

# సినిమాలకు సరిపోనేమో!

## -రాశీఖన్నా

హీరోయిన్లంటే అందంగా, సన్నగా నాజూకుగా ఉంటారు అన్నది చాలా మంది నమ్మకం. ఆ నమ్మకంలో మొదటిదాన్ని మాత్రమే సొంతం చేసుకున్న రాశీఖన్నా, నాజూకైన శరీరాకృతి విషయంలో చేతులెత్తేసింది. మిగతా హీరోయిన్ల కన్నా కొద్దిగా బొద్దుగా ఉన్నా, అవకాశాల విషయంలో మాత్రం మిగతావారితో పోటీపడుతూనే ఉంటుంది. సక్సెస్‌లున్నా అవకాశాలు రాకపోవడానికి తన శరీరాకృతే కారణమంటున్న రాశీతో...

**సక్సెస్‌లున్నా అవకాశాలు రాకపోవడానికి కారణం?**

నా శరీరాకృతే కారణం. మిగతావారితో పోల్చుకుంటే నేను బొద్దుగానే ఉంటాను. బరువు తగ్గాలనుకుంటాను కానీ, అది సాధ్యం కావడం లేదు. కష్టపడి బరువు తగ్గినా, వెంటనే అంతకు రెట్టింపు బరువు పెరుగుతూ ఉంటాను. వ్యాయామం చాలా ఎక్కువ సేపే చేస్తాను. అందరూ రెండు గంటలు చేస్తే నేను నాలుగు గంటలు చేస్తాను. ఆహారం కూడా ఎక్కువ తీసుకోను. బహుశా నా శరీరతత్వమే అంత అనుకుంటాను. నేను అసలు సినిమాలకి సరిపోనేమో అని అప్పుడప్పుడూ అనిపిస్తుంది కూడా!

**ప్రత్యేక పాటలవైపు దృష్టి పెట్టినట్టు న్నారు?**

అలాంటి పాటలకు సరిపోనేమో కూడా! అయినా ఒకసారి ప్రయత్నించాలని ఉంది. అవకాశం వస్తే తప్పకుండా చేస్తాను.

**'హైపర్' సినిమా కోసం బరువు తగ్గినట్టు న్నారు?**

పాత్ర పరంగా తగ్గాల్సి వచ్చింది. మళ్ళీ బరువు పెరగడం నాకు తేలికే! ఇలా ఒకసారి బరువు తగ్గడం, మరొకసారి పెరగడం వలన ఆరోగ్య సమస్యలు వస్తాయని తెలుసు కానీ తప్పడం లేదు.

**తమిళం నేర్చుకుంటున్నారట కదా?**

తెలుగు సినిమాలు చేయడం మొదలు పెట్టిన తరువాత కష్టపడి తెలుగు నేర్చుకున్నాను. ఇప్పుడు తమిళంలో బాగా అవకాశాలు వస్తున్నాయి. అందుకే తమిళం నేర్చుకుంటున్నాను. భాష వస్తే భావం బాగా పలికించవచ్చు అన్నది నా అభిప్రాయం. అందుకే ఏ భాషలో చేస్తే ఆ భాష నేర్చుకుంటున్నాను.

**బాలీవుడ్‌లో అవకాశాలు రావడం లేదా?**

ఒకటి రెండు ఆఫర్లు వచ్చాయి. కానీ నా పాత్రకు అంత ప్రాధాన్యం లేదనిపించింది. నా మొదటిసినిమా ఫ్లాప్ కావడంతో నా మీద కొంత నెగెటివ్ అభిప్రాయం ఉంది. నా తరువాతి సినిమాతో ఆ అభిప్రాయాన్ని పోగొట్టాలని నిర్ణయించుకున్నాను. మంచి కథ, పాత్రా దొరికేంత వరకూ వెయిట్ చేస్తాను.

**హైదరాబాదులో సెటిలైనట్టేనా?**

చెప్పానుగా, నా శరీర తత్వం గురించి. చాలా త్వరగా బరువు పెరిగిపోతాను. బయట తింటూంటే ఈ సమస్య మరీ ఎక్కువై పోతోంది. అందుకే ఇక్కడ ఇల్లు చూసుకొని మా మదర్‌ని తెచ్చేసుకున్నాను. ఇంటి ఫుడ్ తింటూంటే బరువు పెరగకుండా ఉండగలుగుతున్నాను.

**పాములంటే ఇష్టమని చెప్పారు నిజమేనా?**

ఎందుకో తెలీదు చిన్నతనం నుంచీ పాముల్ని చూడడం అంటే భలే ఇష్టం. కోరలు తీసిన పాములతో ఆడుకోవడం అంటే సరదా! చాలా మంది అమ్మాయిలు కోరలు తీసేసిన పామును చూసినా భయపడుతుంటారు. కానీ నాకలాంటి భయాలేమీ లేవు. అసలు పాముల్ని పెంచుకోవాలని ఉంది కానీ, ఇక్కడ అలాంటివి ఒప్పుకోరు కనుక మౌనంగా ఉండిపోతున్నా.

**బాగా పాడతారట కదా?**

బాగా అని కాదు. వచ్చు. కాకపోతే బయట కానీ, సినిమాల్లో కానీ ఎప్పుడూ ట్రై చేయలేదు. అవకాశం వస్తే నా టాలెంట్ చూపిస్తా

**సినిమాల తరువాత ఎక్కువగా ఇష్టపడేది?**

సినిమాలు నాకు జీవితం కాదు. అది నా వృత్తి మాత్రమే! షూటింగ్ లేకపోతే పుస్తకాలు చదువుతూ ఇంట్లోనే కూర్చుంటాను. లేకపోతే మా ఫ్యామిలీతో బైటకెళతాను. సెలవు దొరికితే చేయాల్సిన పనులు ఎప్పటికప్పుడు లిస్ట్‌రాసి పెట్టుకుంటూ ఉంటాను. తీరిక దొరకగానే ముందు వాటిని పూర్తి చేస్తాను.

-భరత్ కుమార్



## సరదాగా....

### అయ్యయ్యో... మర్చేపోయా!

రాఘవమ్మ హైదరాబాద్ బస్టాండ్‌లో వైజాగ్ బస్ ఎక్కింది.

'బాబూ, నేను నిద్రపోతానేమో, విజయవాడ రాగానే లేపుతావా?' అనడిగింది.

సరే అని తలూపాడు డ్రైవర్. సీట్లో కూర్చుని హాయిగా నిద్రపోయింది రాఘవమ్మ.

తర్వాత మెలకువ వచ్చాక డ్రైవర్‌ని అడిగింది "విజయవాడ ఇంకా రాలేదా బాబూ?" అని.

అయ్యయ్యో! మర్చేపోయాను. విజయవాడ దాటి 100 కి.మీ. వచ్చేశాం బామ్మగారు అన్నాడు.

రాఘవమ్మ ఏడుపందుకుంది.

ఆమె అవస్థ చూడలేక బస్ వెనక్కు తిప్పమన్నారు ప్రయాణికులు.

డ్రైవర్ చేసేదేమీ లేక బస్ వెనక్కుతిప్పి విజయవాడ తీసుకెళ్ళి దిగమన్నాడు.

అతడి మాటలు పట్టించుకోలేదు రాఘవమ్మ. బ్యాగ్ లోంచి రెండు మందుబిళ్ళలుతీసి నోట్లో వేసుకుని నీళ్ళు తాగింది. "ఏమీ లేదు బిడ్డా, నాకు బీపీ ఉంది.

విజయవాడ రాగానే ఈ రెండు టాబ్లెట్స్ వేసుకోమన్నాడు నా మనవడు. వాడంతేలే.

ఇప్పుడిక బస్సు వైజాగ్ పోనివ్వు" అంది.

### ఒక ప్రశ్న?

భార్య, పిల్లలతో కలిసి విహారయాత్రకి వెళ్ళాడు జయంత్. తిరగాల్సిన చోట్లన్నీ తిరిగారు. చూడాల్సినవన్నీ చూశారు. వంటకాలు రుచి చూశారు. ఇక బుల్లెట్ ట్రైన్‌లో ప్రయాణం ఒక్కటే మిగిలింది. తెగ ఉత్సాహపడ్డారు. అందరూ రైలెక్కారు. ఆ వేగానికి ఉత్సాహంగా అల్లరి చేస్తూ, ఎంజాయ్ చేస్తున్నారు. కానీ జయంత్ కొడుకు ఆరవ్ మాత్రం ఎందుకో భయపడుతున్నాడు. అది గమనించాడు జయంత్. కొడుకు భయం పోగొట్టాలని ఆరవ్‌ని దగ్గరకు రమ్మని సైగ చేశాడు. కూతురిని కూడా పిలిచాడు. నేను మీ ఇద్దరికీ ఒక పజిల్ ఇస్తాను. మనమిప్పుడు రైల్లో ప్రయాణిస్తున్నాం కదా! ఇదికూడా దానికి సంబంధించిందే అంటూ పజిల్ గురించి ఇలా చెప్పాడు.

"రాజేష్‌కి చీకటంటే భయం. అతను కూడా మనలాగే బుల్లెట్ రైల్లో ప్రయాణిస్తున్నాడు. అతను ప్రయాణించే రైలు కూడా ఓ టన్నెల్‌లోకి ప్రవేశించింది. ఏం చేయాలా అని ఆలోచించాడు.

తనకు భయం కలగకుండా ఎక్కడ కూర్చోవాలి? తనకు ఏది మంచి పొజిషన్! అని బుర్రకి పదును పెట్టాడు రాజేష్. ఒక ఆలోచన తట్టింది! వెంటనే దాన్ని అమలుచేసేశాడు. ఇంతకీ రాజేష్ రైల్లో ఎక్కడ కూర్చున్నాడు? ఎక్కడ కూర్చుంటే తన భయం పోతుందని భావించాడు?"

జయంత్ పిల్లలిద్దరూ తమ బుర్రకి పదునుపెట్టి సమాధానం చెప్పారు. మీరూ మీ బుర్రకి పదును పెట్టండి.

### సమాధానం

రాజేష్ రైలు వెనుకబోగిలోకి వెళ్ళి కూర్చున్నాడు. ఎందుకంటే రైలు ముందుభాగంలో కూర్చుంటే, టన్నెల్‌లో ఎక్కువసేపు ఉంటామని, వెనుకవైపు కూర్చుంటే టన్నెల్‌లోనుంచి తక్కువ టైమ్‌లో బైటికొస్తామని భావించాడు. ఈ ప్రశ్నకి ఇంకా ఇతర సమాధానాలు కూడా ఉండవచ్చు.

## త్రీస్ మార్






ముఖచిత్రం: కీర్తిసురేష్
ఫొటో: గోపీకృష్ణ



**రచనలు, కథలు పంపవలసిన చిరునామా**
**నవ్య వీక్లీ,** ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్-33. email: navyaweekly@andhrajyothy.com


## మార్నింగ్ కాఫీ



### హాయిహాయిగా...

సుబ్బారావు ఆర్నెల్లకి ఓసారి పరీక్షలన్నీ చేయించుకుంటూ ఆరోగ్యం పట్ల చాలా శ్రద్ధ వహిస్తున్నాడు. పరీక్షలు చేయించుకుని ఆర్నెల్లయిందేమో! మళ్ళీ పరీక్షలకు వచ్చాడతను. పరీక్షలన్నీ జరిగాయి. రిజల్ట్స్ చూసి, సుబ్బారావుని డాక్టర్ అడిగాడిలా.

"నీకో గుడ్‌న్యూస్ చెప్పాలి. ఓ బ్యాడ్‌న్యూస్ కూడా చెప్పాలి. ఏది ముందు చెప్పమంటావు?"

"బ్యాడ్‌న్యూసే ముందు చెప్పండి."

"అయితే నీకు క్యాన్సరయ్యా! రెండేళ్ళలో పోతావు." అన్నాడు డాక్టర్.

"ప్చ్! జీవితాన్నింకా అనుభవిద్దామనుకున్నాను, అవకాశం లేకుండాపోయింది. ఏం చేస్తాం? భగవంతుడు ఎలా రాస్తే అలా జరగాల్సిందే! జరగనీ. గుడ్‌న్యూస్ అని ఏదో అన్నారుగా, అది చెప్పండిప్పుడు." అడిగాడు సుబ్బారావు.

"అల్జీమర్స్ వచ్చే అవకాశం కూడా ఉందయ్యా నీకు. మూణ్ణెల్లలో అల్జీమర్స్ నిన్ను ముంచెత్తేస్తుంది. ఇప్పుడు నేను చెప్పిందేదీ నీకప్పుడు గుర్తుండదు. హాయిహాయిగా ఉంటుంది."

### సారీ

ఏటీయం ఆఫీసర్ హోటల్‌కి వచ్చాడు. బాగా ఆకలిమీద ఉన్నాడేమో! సర్వర్‌కోసం వెర్రెత్తిపోయాడు. సర్వర్ వచ్చాడు.

"చెప్పండి ఏం కావాలి?" అడిగాడు.

"ముందు ఏం ఉన్నాయో చెప్పు?"

"ఇడ్లీ, వడ, పూరీ, పొంగల్, ఉప్మా, దోసె, పరోటా, నాన్, ఊతప్పం..."

"సర్సరే! ముందు వేడివేడిగా ఇడ్లీ, వడ, దోసె తిండానికి తీసుకురా! తర్వాత రెండు ప్లేట్ల పూరీ, రెండు ప్లేట్ల ఊతప్పం పార్సెల్ చెయ్యి."

"సారీ సర్! అన్నీ అయిపోయాయి. ఏదీ లేదు."

"ఏదీ లేదా? లేనప్పుడు అంత పెద్ద లిస్ట్ ఎందుకు చదివావ్?"

"ఎందుకంటే మీ ఏటియంకి వచ్చాననుకోండి, ముందు అది ఏఁవడుగుతుంది? పిన్ అడుగుతుంది. తర్వాత అకౌంట్ డీటైల్స్ అడుగుతుంది. ఆ తర్వాత డబ్బెంత కావాలో అడుగుతుంది. తర్వాత రిసీట్ కావాలా? వద్దా అని అడుగుతుంది. ఇంకా చాలా అడిగి అడిగి ఆఖరికి ఏఁవంటుందో తెలుసా?"

"ఏఁవంటుంది?"

"నో క్యాష్ అంటుంది. అప్పుడు నాకు ఎక్కడో కాలుతుంది. ఆ బాధ మీకు అర్థం కావాలని... ఏఁవనుకోకండేఁ! సాయంత్రం రండి." అన్నాడు సర్వర్.

-వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి బాధనయినా మరపిస్తుంది.

# నవ్య

సంపుటి: 13 సంచిక: 37

16-11-2016

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



## మొదటి పేజీ

## వనభోజనం

పిల్లల్నీ, పిచుకల్నీ, సరదాలనీ, సంతోషాలనీ చూడాలంటే వనభోజనాలకు వెళ్ళాల్సిందే! వెళ్దాం అన్నది సీతమ్మ. రామయ్య కాదంటాడా? సరేనన్నాడు. ఊరికి నాలుగైదుకిలోమీటర్లదూరంలో బోడికొండ ఉంది. దానిని ఆనుకుని చిన్న అడవి ఉంది. ఆ అడవిలో ఆలయం ఉంది. ఆ ఆలయానికి ఎదురుగా కొలను ఉంది. ఆ కొలను పక్కన ఉసిరికచెట్లున్నాయి. ఆ చెట్లకింద వండుకుని తింటే ఆ ఆనందమే వేరు. వేడివేడి పప్పు అన్నాన్ని ముక్కలపులుసులో ముంచుకుని తింటే ఆ రుచే వేరు అన్నది సీతమ్మ. కాదా మరి అని చెంబూ తపేలా పట్టుకుని సీతమ్మతో బయల్దేరాడు రామయ్య. దారిపొడుగునా కనిపించే రేగిపళ్ళను తెంపుకుని తింటూ, ఆడుతూ పాడుతూ బోడికొండకు చేరుకున్నారిద్దరూ. చేరుకోగానే వంటా తిండీ అని హైరానాపడలేదు. ముందు కొలనులో స్నానం చేశారు. తర్వాత దేవుణ్ణి దర్శించారు. ఆ తర్వాత ఆలయప్రాంగణంలో ఓ ఇరవై నిమిషాలపాటు ధ్యానం చేశారు. ధ్యానం అంటే ఏమీ లేదు. ఇద్దరూ నిశ్శబ్దంగా కూర్చున్నారంతే! తర్వాత పనిలో పడ్డారు. పొయ్యికి మూడురాళ్ళు కావాలి. పొయ్యిలోకి ఎండుకట్టెలు కావాలి. పులుసుకి చింతకాయలు కావాలి. పచ్చడికి ఉసిరికాయలు కావాలి. తెస్తానని బయల్దేరాడు రామయ్య. సీతమ్మను కౌగిలించుకుని వస్తానన్నాడు.

అన్నట్టుగానే అన్నిటినీ తీసుకుని అరగంటలో వచ్చాడు. సీతమ్మ వంటలో పడితే రామయ్య పుస్తకం పట్టుకుని చదువులో పడ్డాడు. జోకులు చదువుతూ నవ్వుకున్నాడు. నవ్వమని మిమ్మల్ని ఒక్కరినే పుట్టించలేదు దేవుడు, మమ్మల్నీ పుట్టించాడు. ఆ జోకులేవో మాకూ చెబితే మేమూ నవ్వుతాం అన్నది సీతమ్మ. అడగడమే ఆలస్యం, చెప్పి చెప్పి నవ్వించాడామెను రామయ్య. నవ్వుతూనే వంట కానిచ్చింది సీతమ్మ. పచ్చికారంపెట్టి వంకాయకూర చేసింది. ముక్కలపులుసు (చింతకాయపులుసు) చేసింది. ముద్దపప్పు చేసింది. ఉసిరికాయపచ్చడి చేసింది. చేసి, దేవుడికి నివేదించింది. కళ్ళు మూసుకుని కాసేపు ఓపిక పట్టండి, మీరూ తిందురుగాని అన్నది రామయ్యతో. అలాగేనన్నాడతను. కళ్ళు మూసుకున్నాడు. వడ్డన చేసింది సీతమ్మ. విస్తరిలో వేడివేడిగా వడ్డించి, ఇక చాలు! చూడండిప్పుడు అంటే.. .కళ్ళు తెరచి చూశాడు రామయ్య. పదార్థాలన్నీ విస్తరి నిండుగా ఉండి నోరూరిస్తోంటే ఆరగింపులో పడ్డాడు. ఇంత నెయ్యి వేసుకుని, పప్పు అన్నాన్ని అంతంత ముద్దలు చేసి, ముక్కలపులుసులో ముంచుకుని తింటుంటే ఉందీ... సీతమ్మతో తొలిరాత్రి గుర్తొచ్చింది రామయ్యకి. పక్కన కూర్చున్న సీతమ్మను అభినందనగా దగ్గరగా తీసుకున్నాడు.



భోజనాలయ్యాయి. కొండెక్కేందుకు చేయీ చేయీ కలిపి నడిచారిద్దరూ. ఆ కొండెక్కి దిగితే కొడుకు పుడతాడంటారు. కొంపదీసి ఈ వయసులో మళ్ళీ కొడుకు పుడతాడా? గుసగుసగా అడిగింది సీతమ్మ. కావాలంటే పుడతాడని నవ్వాడు రామయ్య. సీతమ్మను దగ్గరగా లాక్కుని వదిలాడు. కొండ మీదికి చేరుకున్నారిద్దరూ. సీతాఫలం చెట్టునీడలో కూర్చున్నారు. పిల్లలు తెంచి పడేసిన కాయలు, చెట్టు మొదల్లో పండి కనిపించాయి. తీసుకుని తిన్నారిద్దరూ. మాగన్నుగా నిద్రపడితే, ఒకరిని ఆనుకుని ఒకరు నిద్రపోయారు. పిచ్చుకల గుంపులా అప్పుడొచ్చారు పిల్లలు. ఆంటీ, అంకుల్ అంటూ ఆటపట్టించారు. ఈ వయసులో ఇంత ఆనందంగా, ఆరోగ్యంగా ఎలా ఉండగలుగుతున్నారని అడిగారు. ఇలా అని సీతమ్మను దగ్గరగా తీసుకున్నాడు రామయ్య. పిల్లల్ని నవ్వించాడు.

ఆరోగ్యంగా ఉండాలంటే ఆనందం అలవాటు కావాలయ్యా! అందుకు ఎప్పటికప్పుడు ఆనందాన్ని పెంచి పోషించాలి. రోజూ రెండు మూడు కిలోమీటర్లు నడవాలి. ఓ ఇరవైనిమిషాలపాటు ధ్యానం చెయ్యాలి. పుస్తకాలు చదవాలి. పగలబడి నవ్వుకోవాలి. అన్నిటినీ మించి ఆత్మీయుల్ని ఆరేడుసార్లు గుండెకు దగ్గరగా తీసుకోవాలి అన్నాడు రామయ్య. సీతమ్మను దగ్గరగా తీసుకున్నాడు. సిగ్గుపడి, దూరంగా జరిగిందామె. బలే బలే అన్నారు పిల్లలు. చప్పట్లు చరిచి నవ్వారు. ఆ నవ్వులు పువ్వులయ్యాయి. ఆ పువ్వులు కొన్ని సీతమ్మ కొప్పున సింగారమైతే ఇంకొన్ని రామయ్య గుప్పిట అక్షింతలయ్యాయి.

నవ్య



## తలకి రోకలి చుట్టాలి!!

ఐఫోన్ చేతిలో ఉంటే సర్వం మరిచి పోతారు కొందరు. మార్కెట్లోకి వచ్చే సరికొత్త మోడల్స్‌ను ఖర్చుకు వెనుకాడకుండా మరీ కొంటుంటారు. మరి అస్సలు డబ్బు ఖర్చు లేకుండానే ఐఫోన్ చేతికొస్తే...!

అదికూడా ఇటీవలే మార్కెట్లోకి విడుదలైన ఐఫోన్-7 ఉచితంగా ఇస్తామంటే...!

ఇలాంటి ఆఫర్ మళ్ళీమళ్ళీ రాదనుకుంటూ స్టోర్లకు పరుగులు పెడతారు అందరూ!

ఓ మొబైల్ రిటైల్ సంస్థ ఇలాంటి ఆఫరే ఇచ్చింది. తాము చెప్పినట్లుచేస్తే ఐఫోన్-7ను ఉచితంగా సొంతం చేసుకోవచ్చునంది.

ఉక్రెయిన్‌లోని అతిపెద్ద మొబైల్ రిటైల్ వెబ్‌సైట్లలో ఒకటైన 'అల్లో. యూఏ' ఓ ఆశ్చర్యకరమైన ఆఫర్ ప్రకటించింది. ఎవరైతే ఐఫోన్ కావాలనుకుంటున్నారో వాళ్ళు తమ పేరుని ఐఫోన్-7గా మార్చుకోవడమే. అంటే పేరుకు బదులుగా మొదటిపేరు (ఫస్ట్‌నేమ్)ను ఐఫోన్




అని, రెండో పేరు (సెకండ్‌నేమ్)ను 7 (సెవెన్) అని మార్చుకోవాలి. అది కూడా సర్కారు ఆమోద ముద్రతో! ఇందుకు సంబంధించి ప్రభుత్వ ధ్రువీకరణ పత్రంతో సెల్ఫీదిగి దాన్ని 'అల్లో. యూఏ' సంస్థకు పంపాలి. అలా చేసిన మొదటి ఐదుగురినీ వెబ్‌సైట్లో విజేతలుగా ప్రకటిస్తారు. గెలిచిన వారికి 32 జీబీ మెమొరీ ఉన్న ఐఫోన్-7 ఉచితం! ఒక్కముక్కలో చెప్పాలంటే ఫోనుకోసం పేరు మార్చుకోవాలన్నమాట. చిత్రంగా ఉంది కదా!

ఐఫోన్-7 దక్కించుకోవాలంటే ముందుగా ఉక్రెయిన్‌లోని స్థానిక రిజిస్ట్రార్ కార్యాలయాని కెళ్ళి పేరు మార్చుకోవాలి. వినడానికి ఇది వెర్రిగా ఉన్నా... ఇలాంటి ఆశ్చర్యకరమైన ఆఫర్లు పెట్టడం కొత్తేం కాదు. నాలుగేళ్ళ క్రితం ఓ అమ్మాయి ఐఫోన్-4 కోసం తన వర్జినిటీని అమ్మకానికి పెట్టింది. మూడేళ్ళ క్రితం ఐఫోన్-6 కోసం ప్రియురాలినే తాకట్టు పెట్టాడో ప్రియుడు. ఫోన్ల పిచ్చి ముదిరి పాకాన పడింది అనుకుంటున్నారు కదూ! ఐతే తలకి రోకలి చుట్టాలేమో!

# మెయిల్ బాక్స్

### షడ్రుచుల దీపావళి సంచిక

నవ్య వీక్లీ దీపావళి సంచిక షడ్రుచుల కలయికతో అలరించింది. నవనవోన్మేషితంగా అందించి ఆనందింపజేశారు. తీపి, చేదు, ఉప్పు, పులుపు, కారం, వగరు కలగలిసిన సంచిక. అందరికీ వందనాలు.

-నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం

### గుండెకు హత్తుకున్న 'దీపావళి కథలు'

నవ్య వీక్లీ దీపావళి సంచికలోని కథలన్నీ గుండెకు హత్తుకున్నాయి. అభిమాన నటి రేవతి దీపావళి వెలుగులు పంచింది. ప్రతివారం ఒక మంచి నటునితో ఇంటర్వ్యూ చేస్తున్న హరనాథ్ గారికి అభినందనలు. కోట శ్రీనివాసరావుగారి సీరియల్ కంచుకోటలా ఉంది. చల్లా భాగ్యలక్ష్మి గారికి అభినందనలు. దీపారాధన ఎలా చెయ్యాలో చక్కగా చెప్పారు. యండమూరి సత్యకమలేంద్ర నాథ్‌గారి కథ 'పద్మవ్యూహం' చాలా బాగుంది. తండ్రీ కొడుకుల అనుబంధానికి చక్కటి అర్థం చెప్పారు.

-కోలిపాక కెఎస్ఆర్, బెల్లంపల్లి

### ఆకట్టుకున్న ప్రత్యేక సంచిక

దీపావళి ప్రత్యేక సంచిక నరకాసుర వధ ముఖచిత్రం, సత్యభామ ఉగ్రరూపం మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకుంది. దీపావళి సంచిక ముఖ చిత్రకారుడు సురేష్ కడలి ఇంటర్వ్యూలో ఆయన చిత్రకళా జీవితం తెలిసింది.

ప్రత్యేక సంచికలోని పదహారు కథలూ వర్తమాన పరిస్థితులతో కూడిన కథాంశాలతో ఉన్నాయి. భజంత్రీలు కథ మరుగునపడిన సన్నాయి కళాకారుడి ప్రతిభను, అతడి ఆవేదనను తెలియజేసింది. అద్భుత సన్నివేశాలతో రంజింపజేశారు రచయిత. కుక్కలు, భిక్ష కథలు సందేశాత్మకంగా ఉన్నాయి.

'అలవాటుపడాలి' సంపాదకీయం బాగుంది. జ్ఞానజ్యోతుల దీపావళి వ్యాసం, దీపారాధన, నామధేయాల విశిష్టతలు తెలియజేసింది. సురభి వింతల్లో గాలివాటం ఇల్లు కడువింత! రామాయణంలో హనుమకు బహుమతి ప్రస్తావన, రాక్షస స్త్రీలపై సీత దయ, రాముడి ఆగ్రహం ఆసాంతం ఆసక్తిదాయకం. కోట సీరియల్ ఆనాటి నాటకరంగం, ఆయన విశిష్టతను తెలియజేసింది.

-కృష్ణ మాధవరపు, కాకినాడ

### రావణ సతుల వేదన

రామాయణంలో రావణ సతుల వేదన మా హృదయాలను కలచివేసింది. పాఠకులకు పట్టుచీరల స్కీము ఆహ్వానించదగినది. ఐతే కూపన్ వెనుక సీరియల్‌గానీ, కథగానీ లేకుండా చూడగలరు. తారల ప్రేమాయణాలు, పెళ్ళి ప్రస్తావనలు హాట్ టాపిక్సే. ఈ వారం సినీవాలి కాస్తంత హాట్‌గా, ఘాటుగా ఉంది.

-గున్నేశ్, కొవ్వాడ.తూ.గో.జిల్లా

### ఉత్కంఠ రేపుతున్న అరణి రామాయణం

నవ్య వీక్లీ సంపాదకవర్గానికి నమస్కారం. రామాయణం ప్రతివారం చదువుతున్నాను. ఎంతో అద్భుతంగా ఉంది. రామ రావణ యుద్ధ ఘట్టాలను ఎంతో బాగా వర్ణించి చెబుతున్నారు. ప్రతివారం వీక్లీ ఎప్పుడు వస్తుందా? అని ఎదురుచూస్తున్నాం. రావణు దంతటి గొప్ప పరాక్రమవంతుడిలో అక్కడక్కడ కనిపించిన పిరికితనం, యుద్ధరంగం నుంచి అతడి సారథి




దూరంగా తీసుకుపోవడం, రావణుడి మరణం, విభీషణుడు అంతఃపుర కాంతలతో కలిసి అశోకవనానికి చేరుకుని రాముని ఆదేశాలను ఆమెకు తెలియజేయడం, రాముడి ఆగ్రహం, శంక వంటి ఎన్నో విషయాలను ఎంతో గొప్పగా రాస్తున్నారు.

రామాయణం చివరి ఘట్టానికి చేరు కున్నట్టే. ఇక రాముడు అయోధ్యకు చేరుకోవడం, పట్టాభిషేకం మిగిలింది. అరణిగారు తమ కలం బలంతో పాఠకులను ఎంతో ఆకట్టుకుంటున్నారు. గతంలో సాయిబాబా జీవిత కథ, మహాభారతం, పిల్లల కథలు, భాగవతం కూడా రాశారు అరణి గారు. ఇక రామాయణం ముగిసిన తర్వాత ఏమి రాస్తారోనని ఉత్కంఠతో ఎదురుచూస్తున్నాం. లవకుశల కథ వరకు కొనసాగించాలని మా కోరిక. మరి అరణిగారు ఏం చేస్తారో?

-ఆసూరి గోపాల్ అయ్యంగార్, హైదరాబాద్-68

### అరణిగారికి వందనం

రామాయణం రాస్తున్న అరణిగారికి వందనాలు. ఎంతో బాగా రాస్తున్నారు. రామాయణంలో ఎన్నో విషయాలు అరటిపండు ఒలిచినట్టుగా మాకు చెప్పారు. నేను, నా భార్య ప్రతివారం ఎంతో శ్రద్ధగా రామాయణం చదువుతున్నాం. ఇంతబాగా రాస్తున్న అరణిగారు నిండునూరేళ్ళూ వర్ధిల్లాలి.

-రాహుల్‌మిత్ర, హైదరాబాద్

### సిరియా మారణకాండకు నిదర్శనం

సిరియాలో అంతర్యుద్ధం వల్ల జరుగుతున్న దారుణాలు, మారణకాండకు ప్రత్యక్ష నిదర్శనం 'శరణాగతి' కథ. సిరియాలో ప్రజలు ఊచకోత తప్పించుకుని, రక్షణ శిబిరాలు వెతుక్కుంటూ ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని ట్రక్కుల్లో, ఓడల్లో తరలిపోయిన ఘటనలకు సజీవదృశ్యం ఈ కథ. రచయితకు అభినందనలు.

-తాళాబత్తుల సత్యనారాయణమూర్తి, విశాఖపట్నం-11



డా॥ జి. సతీష్ రెడ్డి
MS. M.Ch. (Ortho) (UK)
Orthopedics & Joint Replacement Specialist
ప్రైమ్ హాస్పిటల్స్, హైదరాబాద్
ఫోన్. 98495 63360 / 040-4959 4959

# బాధించే స్ట్రెస్ ఫ్రాక్చర్స్ సరైన జాగ్రత్తలతో నివారించవచ్చు

ఎముకలు విరగడంలో చాలా రకాలుంటాయి. కాలి ఎముక మీద భారం ఎక్కువగా పడినప్పుడు ఫ్రాక్చర్లు ఏర్పడుతుంటాయి. వీటినే స్ట్రెస్ ఫ్రాక్చర్స్ అంటారు. సాధారణంగా ఆటలాడేవారిలో ఈ తరహా ఫ్రాక్చర్లు ఎక్కువగా వెలుగుచూస్తుంటాయి. అలాంటి సమయంలో కండరాలు ఎక్కువగా అలసటకు గురై, మనకు సహకరించని స్థితిని చేరుకుని, ఆ ఒత్తిడిని ఎముకలకు బదిలీ చేస్తాయి. దాని వలన ఎముకలు విరిగే అవకాశం ఉంటుంది. గట్టి రోడ్లపైన ఎక్కువగా పరుగెత్తడం, సరిగ్గా అమరని పాదరక్షలు ధరించడం వల్ల స్ట్రెస్ ఫ్రాక్చర్‌కు గురయ్యే అవకాశం ఉంటుంది. ఇది ఎక్కువగా బరువు మోసే కింది కాలులో, పాదాలలో వస్తుంటుంది. 50 శాతం స్ట్రెస్ ఫ్రాక్చర్స్ కింది కాలు భాగంలోనే సంభవించే అవకాశం ఉంటుంది.

## మహిళల్లో రిస్క్ ఎక్కువ

టెన్నిస్, జిమ్నాస్టిక్స్, బాస్కెట్‌బాల్ వంటి ఆటలు ఆడే సమయంలో స్ట్రెస్ ఫ్రాక్చర్‌కు గురయ్యే అవకాశం ఉంటుందని అధ్యయనాల్లో తేలింది. అథ్లెట్స్‌కు సరైన విరామం లేకపోతే స్ట్రెస్ ఫ్రాక్చర్‌కు గురయ్యే అవకాశాలు పెరుగుతాయి. ఈ సమస్య ఎక్కువగా ఆటలు ఆడే స్త్రీ, పురుషులిద్దరిలోనూ సంభవిస్తుంది. అయితే పురుషులతో పోల్చితే మహిళల్లో రిస్క్ ఎక్కువగా ఉంటుంది.

## లక్షణాలు

కదలికలు ఉన్నప్పుడు నొప్పి రావడం అనేది స్ట్రెస్ ఫ్రాక్చర్ సాధారణ లక్షణం. అయితే విశ్రాంతి తీసుకుంటే నొప్పి తగ్గిపోతుంది.

## నిర్ధారణ పరీక్షలు

వైద్యులు రోగిని పరీక్షించడం ద్వారా స్ట్రెస్ ఫ్రాక్చర్ బారినపడే ప్రమాదాన్ని గుర్తించగలుగుతారు. సాధారణంగా ఎక్స్-రే ద్వారా ఈ సమస్యను గుర్తిస్తారు. కొన్ని సందర్భాలలో ఎక్స్-రేలో ఈ సమస్యను గుర్తించలేకపోవచ్చు. అలాంటి సందర్భాలలో కంప్యూటెడ్ టోమోగ్రఫీ (సిటి) స్కాన్ లేదా మాగ్నటిక్ రిసోనెన్స్ ఇమేజింగ్ (ఎంఆర్ఐ) పరీక్షల ద్వారా స్ట్రెస్ ఫ్రాక్చర్‌ను నిర్ధారిస్తారు.

## చికిత్స ఏంటి..?

స్ట్రెస్ ఫ్రాక్చర్స్‌కు చికిత్సలో విశ్రాంతి అనేది చాలా ముఖ్యం. ఈ విశ్రాంతి ఆరు నుండి ఎనిమిది వారాల వరకు అవసరం కావచ్చు. ముఖ్యంగా స్ట్రెస్ ఫ్రాక్చర్‌కు కారణమయ్యే కార్యకలాపాల నుంచి విశ్రాంతి పొందడం అవసరం. స్ట్రెస్ ఫ్రాక్చర్ సరిగ్గా నయం కాకుండా, తిరిగి గాయం కావడం వల్ల దీర్ఘకాలిక సమస్యలకు దారితీస్తుంది.



## నివారణ మార్గాలు

- కొత్త ఆట ప్రారంభించేటప్పుడు ఒకేసారి పెద్ద పెద్ద లక్ష్యాలు పెట్టుకోకుండా, క్రమంగా లక్ష్యాన్ని పెంచుకుంటూ పోవాలి. ఉదాహరణకు ఒకేసారి ఐదు కిలోమీటర్లు పరుగెత్తకుండా, క్రమంగా వారానికి కొంచెం మైలేజిని పెంచుకుంటూ ఉండడం మంచిది.

- ఫిట్‌నెస్ లక్ష్య సాధనకు ప్రత్యామ్నాయ చర్యలు చేపట్టడం మంచిది. ఎక్కువగా ప్రయోజనం చేకూర్చేవిధంగా సౌలభ్యంగా ఉండే వ్యాయామాలను కలిపి చేయడం మంచిది.

- ఆరోగ్యకరమైన ఆహారపు అలవాట్లు కలిగి ఉండాలి. ముఖ్యంగా కాల్షియం, విటమిన్ డి అధికంగా ఉండే ఆహారాన్ని తీసుకోవాలి.

-సరియైన పరికరాలు ఉపయోగించాలి. పాత రన్నింగ్ షూస్ ధరించకపోవడం మంచిది.

- నొప్పిగాని, వాపుగాని వస్తే వెంటనే కార్యకలాపాలను ఆపేసి, కొన్ని రోజులపాటు విశ్రాంతి తీసుకోవాలి. నొప్పి తగ్గకపోతే వెంటనే ఆర్థోపెడిక్ వైద్యులను సంప్రదించాలి.

- లక్షణాలు కనిపిస్తే వెంటనే చికిత్స అందించడం చాలా అవసరం. దాని వల్ల మళ్లీ సాధారణంగా ఆటలు ఆడగలిగే స్థితి సమకూరుతుంది.



Stress fractures of the Foot and Ankle



ఎప్పుడో అరవైలో కనపడాల్సిన మధుమేహం ఇప్పుడు ఇరవై ముప్పైల్లోనే పలకరించేస్తోంది. కేన్సర్, గుండె నొప్పిల తరువాతి స్థానం మధుమేహానిదే అంటే దీని తీవ్రతను అర్థం చేసుకోవచ్చు. ఇది అంటు వ్యాధి కాదు అయినా దీని బారిన పడుతున్న వారి సంఖ్య అంతకంతకూ పెరుగుతూనే ఉంది. దీని గురించి ఒక్క ముక్కలో చెప్పుకోవాలంటే ఇదొక సైలెంట్ కిల్లర్. పైకి మామూలుగా కనిపించినా శరీరం లోపల జరగాల్సిన నష్టం జరిపించేస్తుంది. సరైన జాగ్రత్తలు తీసుకోకుంటే రోజురోజుకూ ఇది పుంజుకుంటూ శరీరంలో ఒక్కో అవయవాన్ని నిర్జీవం చేసేస్తుంది. అంతిమంగా ప్రాణాంతకమవుతుంది. ఇంత భయంకరమైన ఈ సమస్య మన దేశంలో మాత్రమే కాదు, ప్రపంచవ్యాప్తంగా దీని బాధితులు కోట్లల్లో ఉన్నారు. ఒక్క మన దేశంలోనే రాబోయే పది పన్నెండేళ్లలో వీరి సంఖ్య పది కోట్లకు చేరుకోవచ్చన్న ఊహాగానాలు వినిపిస్తున్నాయి. చాపకింద నీరులా రోజురోజుకీ బలపడుతున్న మధుమేహంపై ఇప్పటికే పలు దేశాల వారు దీనిమీద యుద్ధం ప్రకటించారు. దీని మీద మరింత అవగాహన కలిగించడానికీ, దీన్ని సమర్థవంతంగా ఎదుర్కోవడానికి ప్రపంచవ్యాప్తంగా నవంబరు 14వ తేదీని డయాబెటిక్ డేగా పాటిస్తున్నారు. నియంత్రణే తప్ప నివారణ లేని ఈ వ్యాధిని ఎలా ఎదుర్కోవచ్చు అన్న వివరాలు...

# మధుమేహానికి చెక్ పెడదాం

## మధుమేహం అంటే....

ఇదొక మెటబాలిక్ డిజార్డర్. బ్లడ్ షుగర్ లెవెల్స్ ఎక్కువగా ఉన్నప్పుడు సమస్య మొదలవుతుంది. శరీరం సరైన మోతాదులో ఇన్సులిన్ ఉత్పత్తి చేయనప్పుడు, శరీర కణాలు ఇన్సులిన్‌కు స్పందించనప్పుడు ఈ సమస్య ఎదురవుతుంది. కొంతమందిలో శరీరంలో ఉత్పత్తి అయిన ఇన్సులిన్‌ను రక్తం సరిగా గ్రహించకపోవడం వలన రక్తంలో గ్లూకోజ్ స్థాయి అధికమై డయాబెటిక్‌కు కారణమవుతుంది. ఒకసారి ఇది శరీరంలో ప్రవేశించిందంటే చనిపోయేంత వరకూ దీనితో పోరాడాల్సిందే! తగిన జాగ్రత్తలు తీసుకుంటూ దీన్ని అదుపు చేసుకుంటూ ఉండాల్సిందే.

## నిర్లక్ష్యం తగదు

చాలామంది తమకు మధుమేహం వచ్చిందని తెలిసినా కొద్దిగానే ఉందంటూ లైట్ తీసుకుంటారు. ఈ విధమైన నిర్లక్ష్యానికి తగిన మూల్యం చెల్లించాల్సి వస్తుందని నిపుణులు పదే పదే హెచ్చరిస్తున్నారు. షుగర్ సమస్య ఉందని తెలిసిన వెంటనే దాన్ని అదుపు చేసే చర్యలు చేపట్టాల్సిందే అంటున్నారు. గతంలో మధుమేహాన్ని గుర్తించిన వెంటనే మూడు నెలల పాటు ఆహార నియమాలు పాటిస్తే సరిపోతుందనేవారు. ఇప్పుడు ఆ పరిస్థితి లేదు. ఇలాంటి సూచన వలన ముప్పు మూడింతలు పెరుగుతోందని గ్రహించారు. అందుకే ఇప్పుడూ ఎవరూ ఆహార నియమాలకి పరిమితులు విధించడం లేదు. రక్తంలో ఒకసారి గ్లూకోజు స్థాయి కనిపించిన వెంటనే మందులు మొదలు పెట్టాలనీ ఆహారంతో పాటు ఇతర నియమాలు కచ్చితంగా పాటించాల్సిందేననీ ప్రపంచ ఆరోగ్య సమాఖ్య పదే పదే హెచ్చరిస్తోంది.

## అన్నీ పాటించాల్సిందే!

మధుమేహం వచ్చిందని తెలిసిన వెంటనే చాలామంది కాఫీ టీలలో చక్కెర వేసుకోవడం మానేయడం, స్వీట్లు తినడం తగ్గించేయడం, తీసుకునే ఆహారాన్ని గణనీయంగా తగ్గించుకోవడం చేస్తుంటారు. ఆహారం తీసుకోవడం తగ్గించడం వలన మధుమేహం అదుపులోకి రాదు. పైపెచ్చు కొన్నిసార్లు అధికబరువు, ఊబకాయం వంటి వాటితో సమస్య మరింత జటిలం కావచ్చు. మరికొందరు సన్నగా ఉన్నాం కదా మధుమేహం ఎక్కువ కాదు అన్న అపోహలో ఉండి పాటించవలసిన నియమాలు గాలికి వదిలేస్తారు. ఇవన్నీ అపోహలే అంటున్నారు నిపుణులు. ఎప్పుడూ తీసుకునే ఆహారాన్ని ఒకేసారి కాకుండా రెండు మూడు సార్లు తీసుకోవాలనీ, ఆహారంలో పీచు పదార్థాలతో సహా పోషకాలన్నీ సమపాళ్ళల్లో ఉండేటట్లు చూసుకోవాలని వారు సూచిస్తున్నారు. అంతేకాకుండా కాఫీ, టీలలో చక్కెర వాడకాన్ని పూర్తిగా తగ్గిం



చడం కాకుండా మామూలు కన్నా కొద్దిగా తక్కువ వేసుకుంటే సరిపోతుందనీ, అదే విధంగా స్వీట్లు కూడా మితంగా తీసుకుంటే మంచిదని వారు చెబుతున్నారు. చక్కెర వాడ కాన్ని పూర్తిగా తగ్గించేస్తే రక్తంలో చక్కెర నిల్వలు పూర్తిగా పడిపోయి కోమాలోకి వెళ్ళే ప్రమాదం ఉందని వారు హెచ్చరిస్తున్నారు. మధుమేహవ్యాధిగ్రస్థులకు ఇది చాలా ఆందోళనకర పరిణామమని వారు అంటున్నారు. అన్నం మానేసి చపాతీలు తిన్నంత మాత్రాన మధు మేహం అదుపులో ఉంటుందనేది ఒక అపోహ మాత్రమేనన్నది నిపుణుల అభిప్రాయం. అన్న మైనా, చపాతీలైనా మితంగానే తీసుకోవాలని అంటున్నారు. చాలామంది పేషెంట్లు ఆకుకూర లకు దూరంగా ఉంటారు. పాలకూరని ఎక్కు వగా తీసుకోవడం వలన 14 శాతం వరకూ డయాబెటిస్ వచ్చే అవకాశాన్ని తగ్గించుకోవ చ్చన్న విషయం ఇటీవల పరిశోధ నల్లో వెల్ల డైంది.

## మూఢనమ్మకాలు వద్దు

'మంత్రాలకు చింతకాయలు ఎప్పుడూ రాల వని' అంటున్నారు నిపుణులు. కొంతమంది ఆల యాల్లో పూజలు, ప్రార్థనలు నిర్వహిస్తే మధు మేహం పూర్తిగా నయమైపోతుందన్న ప్రచారం చేస్తున్నారనీ, అవన్నీ అసత్య ప్రచారాలనీ వారు చెబుతున్నారు. అలాగే కొన్నిరకాల మూలికలతో తయారు చేసిన పసర్లు తాగినా పూర్తిగా నయ మైపోతుందన్న నమ్మకాలు కొన్ని ఉన్నాయనీ ఇవన్నీ అభూతకల్పనలే అని వారు కొట్టిపారేస్తు న్నారు. మందులు, ఆహార నియమాలకు, వ్యాయామానికి తప్ప మధుమేహం వేటికీ లొంగదనీ, ఇలాంటి నమ్మకాలను విస్మరించాలనీ నిపుణులు సూచిస్తున్నారు.

## అన్నీ పట్టించుకోవాలి

రక్తంలో గ్లూకోజ్ స్థాయిని మాత్రమే పట్టించు కోకూడదనీ, దీనితో పాటు ట్రైగ్లిజరాయిడ్లు, కొలె స్ట్రాల్, కొవ్వు వంటివి అదుపులో ఉంచుకోవాలని నిపుణులు సూచిస్తున్నారు. వీటిని పట్టించు కో కుండా గ్లూకోజు స్థాయి మీదనే దృష్టిపెడితే సరి పోదని వారు అంటున్నారు. పై వాటిని అదు పులో ఉంచుకుంటూ ఎప్పటికప్పుడు వీటిని పరీ క్షించుకుంటూ తగిన జాగ్రత్తలు తీసుకోవాలని వారు చెబుతున్నారు.

## పండ్లు నిరభ్యంతరంగా తినొచ్చు

మధుమేహవ్యాధిగ్రస్థులు పండ్లు తినకూడ దన్న అపోహ చాలామందిలో ఉంది. ఇది తప్పు అంటున్నారు నిపుణులు. పండ్ల ద్వారా లభించే పోషకాలు శరీరానికి మంచే చేస్తాయి తప్ప హాని చేయవనీ, అందువలన దాదాపు అన్ని పండ్లనూ నిరభ్యంతరంగా తీసుకోవచ్చని వారు చెబుతున్నారు. ఒక్క నారింజ, జామ పళ్ళనే కాకుండా వీరు తీసుకోదగిన మిగతా పండ్ల వివరాలు:

**బెర్రీ పండ్లు:** రకరకాల బెర్రీ పండ్లు ఇప్పుడు మార్కెట్‌లో విరివిగా లభిస్తున్నాయి. వీటిలోని చక్కెర ఒక్కసారిగా రక్తంలోకి చేరుకోదని, అందు వలన వీటిని నిరభ్యంతరంగా తీసుకోవచ్చని నిపుణులు చెబుతున్నారు. వీటిలోని పోషకాలు శరీరాన్ని ఆరోగ్యంగా ఉంచడానికి తోడ్పడతా యంటున్నారు.

**యాపిల్:** రోజుకొక యాపిల్ తింటే రోగాలకి దూరంగా ఉండవచ్చన్న సంగతి తెలిసిందే! అయితే తియ్యని యాపిల్ తినడానికి కొందరు డయాబెటిక్ పేషంట్లు భయపడుతుంటారు. ఇవన్నీ అర్థం లేని భయాలని నిపుణులు కొట్టి పడేస్తున్నారు. ఈ పండులోని యాంటీఆక్సి డెంట్లు శరీరానికి చాలా మేలు చేస్తాయని వారు చెబుతున్నారు.

**అరటిపండు:** దీన్ని షుగర్ ఉన్నవాళ్ళు తిన కూడదన్న అపోహ చాలామందిలో ఉంది. కానీ ఇది శరీర ఆరోగ్యానికి అత్యవసరమైన పండు అంటున్నారు నిపుణులు. జీవక్రియకు ఉపయోగ పడే బి6 విటమిన్ అరటిపండులో సమృద్ధిగా లభిస్తుంది.

**పుచ్చకాయ:** నీటిశాతం ఎక్కువగా ఉండే పుచ్చకాయకు మధుమేహవ్యాధిగ్రస్థులు ఆమడ దూరంలో ఉంటారు. ఈ పండుకు పూర్తిగా దూరంగా ఉండడంకన్నా, కొన్ని ముక్కలను తీసుకుంటే మంచిదేననీ, అంతేకాకుండా దీని జ్యూస్ తాగినా మంచి ఫలితాన్నే పొందవచ్చనీ వీరు చెబుతున్నారు.

## మామిడి మంచిదే

మధుమేహ వ్యాధిగ్రస్థులు మామిడి పండు తినకూడదనీ, తింటే ప్రమాదమన్న అపోహలు చాలానే ఉన్నాయి. తినాలని కోరిక ఉన్నా వాటికి చెక్ పెట్టేస్తున్నారు. ఈ పండులోని గుణాలు టైప్-2 డయాబెటీస్‌ను తగ్గించడానికి దోహదం చేస్తాయని అమెరికాలోని ఒక్లాహమా స్టేట్ యూనివర్సిటీ పరిశోధకులు చెబుతున్నారు. పన్నెండు వారాల పాటు 60 ఎలుకల మీద పరి శోధనలు నిర్వహించారు. పండులోని తీపికన్నా దీనిలోని పీచు మధుమేహవ్యాధిగ్రస్థులకు చాలా మేలు చేస్తుందని వారు చెబుతున్నారు. కాకపోతే వీరు మామిడిపండు తినే ముందు వైద్యుల సలహా తీసుకోవాలని వారు సూచిస్తున్నారు.

**-దేవి**

## ఇవి చాలా మంచివి

**మ**ధుమేహ వ్యాధిగ్రస్థులు కొన్ని రకాల పదార్థాలను ఆహారంలో చేర్చుకో వడం ద్వారా పలు ప్రయోజనాలు పొంద వచ్చని నిపుణులు సూచిస్తున్నారు. పసుపు, దాల్చినచెక్క, హోల్ గ్రెయిన్స్, వెనిగర్ వంటివి ఆహారంలో చేర్చుకోవడం చాలా మంచిది. చాలా మంది కాఫీని తాగడం పూర్తిగా మానేస్తారు. కాని ఇది మంచిది కాదు అంటున్నారు నిపుణులు. చక్కెర లేని కాఫీ ఒకటి లేదా రెండు కప్పులు తాగడం వల్ల టైప్-2 డయాబెటిస్‌ను 50 శాతం అదుపులో ఉంచుకో వచ్చని వీరు చెబుతున్నారు.

## రెడ్‌వైన్ మంచిదే!



**డ**యాబెటిక్ పేషంట్లు కొద్దిమోతాదులో రెడ్‌వైన్ తీసుకుంటే మంచి ఫలితాన్నే పొంద వచ్చు అంటున్నారు ఇజ్రాయెల్ పరిశోధకులు. రెడ్‌వైన్ కొలెస్ట్రాల్‌ని అదుపులో ఉంచడంతో పాటు రక్తంలో గ్లూకోజ్ స్థాయిని క్రమబద్ధీకరి స్తుందన్న విషయం వీరి పరిశోధనల్లో వెల్ల డైంది. సుమారు రెండు సంవత్సరాల పాటు 224 మంది వ్యాధిగ్రస్థుల మీద వీరు పరిశోధ నలు నిర్వహించారు. వీరికి నెలలో కొన్ని రోజుల పాటు రెడ్ లేదా వైట్ వైన్‌ను 150 మిల్లీమీటర్ల నీటితో కలిపి ఇచ్చారు. రెండు సంవత్సరాల పాటు వీరి రక్తంలో గ్లూకోజ్ స్థాయిలను పరిశీ లిస్తూ వచ్చారు. క్రమేపీ రక్తంలో గ్లూకోజ్ స్థాయిలు నిలకడగా ఉన్న విషయాన్ని వీరు గుర్తించారు. ఈ విషయం మీద ఇంకా పరిశో ధనలు నిర్వహించాల్సి ఉందని వారు స్పష్టం చేస్తున్నారు.



# ఆరోజు ఎంతో దూరంలో లేదు

గంటి భానుమతి

**చేతిలో ఓ బ్యాగ్‌తో 'లీసా' పక్కన నుంచున్నాను. నా చుట్టూ ఎంతోమంది పేపరు వాళ్ళు, మీడియావాళ్ళు, పత్రికలవాళ్ళు, యింకా ఏర్‌పోర్ట్‌లోని ప్రయాణికులు.**

**ఓ సెంటరాఫ్ అట్రాక్షన్ అయిపోయాను. ఎంతో ఆసక్తిగా చూస్తున్నారు. ఉత్సాహంగా ఏవేవో అడుగుతున్నారు. ప్రేమగా, ఆప్యాయంగా, ఆదరంగా, మర్యాదగా ప్రవర్తిస్తున్నారు. నేను ఓ ఆకర్షణగా అందరి మధ్యా నుంచున్నాను.**

ఇది ఈరోజున, ఆ రోజున కాదు.

నేను పుట్టినప్పుడు కాదు. ఆ రోజున నా పుట్టుక అక్కర్లేనిది. చంపేయాలనుకున్నారుగానీ, ఆశ్చర్యం బ్రతికాను. అమ్ముకోడానికే పుట్టినట్టుగా, నన్ను అమ్మేశారు. ఈ 'లీసా' నన్ను దత్తతకి తీసుకుంది.

నా గురించి, మా అమ్మావాళ్ళ గురించి, వాళ్ళు ఎక్కడున్నారో పూర్తిగా తెలుసుకుంది. నన్ను మావాళ్ళ దగ్గరికి తీసుకెళ్తానని ప్రామిస్ చేసింది. నేను పుట్టిన ఊరుని చూడడం కన్నా విలువైనది ఏవుంటుంది? అదే గొప్ప బహుమతి. అమూల్యం.

అలాగే తీసుకొచ్చింది. నా వాళ్ళని చూశాను. ఎన్నో సంగతులు తెలుసుకున్నాను. గుండెల్లో దాచుకున్నాను. ఇది ఓ కథ కాదు. కన్నీటి జీవితం.

మా తండాల్లో అమ్మాయిల జీవితాల్ని, దేవుడు రాయలేదు. అసలు రాయడు అలా అలా ఆకాశంలోంచి ఊడిపడ్డవాళ్ళం. అందుకని, మా మీద చాలామందికి అధికారాలూ ఉంటాయి.

మా అమ్మకి నేను రెండో సంతానం. నాకన్నా రెండేళ్ళు పెద్దైన అక్క ఉంది. సరిగ్గా నేను పుట్టినప్పుడే, మా చిన్నాన్నకి కూడా ఓ అమ్మాయి పుట్టింది. వాళ్ళకి కూడా అమ్మాయే మొదటి సంతానం.

దీనితో మా కుటుంబంలో మొత్తం నలుగురు ఆడపిల్లలం.

మా నాయనమ్మ జానాబాయి, అమ్మని, పిన్నిని బాగా తిట్టింది.

"ఏం కోడళ్ళు మీరు! ఈ కుటుంబంలోకి ఆడపిల్లల్ని తీసుకొస్తారా! వాళ్ళని కంటారా! మీకు తెలీదా, మన జాతిలో కట్నాల్లేకపోతే పెళ్ళికాదని! ఒక్కొక్క పిల్లకి లక్ష కట్నమైనా ఇవ్వకపోతే పెళ్ళి అవదని... ఒక్కళ్ళు కాదు, ఇద్దరు కాదు... నలుగురు ఆడపిల్లలు... ఎక్కడి నుంచి వస్తాయి పైసలు!"

ఇలా చాలా తిట్టిందట.

అమ్మాయికి పెళ్ళైతే పుట్టింటికి రాకూడదట. ఈ గడప తొక్కకూడదట. ఒంట్లో బాగున్నా, బాగాలేకపోయినా తల్లిగారింటికి రాకూడదు. ఇలాంటి బంధాలకోసం డబ్బెందుకు ఖర్చు చేయాలి!

ఇవన్నీ నాకెలా తెలిశాయంటే నన్ను పెంచుకుంటున్న 'లీసా'కి చెప్పింది మా అమ్మ. ఓ జర్నలిస్ట్ ఆ మాటలన్నీ ట్రాన్స్‌లేట్ చేసి 'లీసా'కి చెప్పాడు. అప్పుడు 'లీసా' నాకు దానిని స్పానిష్‌లో చెప్పింది. కట్నాలు యిచ్చి పెళ్ళిళ్ళు చేయనక్కరలేకుండా, పుట్టినవాళ్ళను చంపేస్తే సరిపోతుందని నాయనమ్మ, తాతయ్య అనుకున్నారుట. వాళ్ళిద్దరూ మరీ చెడ్డవాళ్ళు కారుట. కానీ, డబ్బు కావాలి కదా! లేనప్పుడు ఏం చేస్తారు, చెడ్డగా మారిపోతారుట. డబ్బు ఇబ్బందులు. పైగా నలుగురు ఆడపిల్లలం. అందుకని వాళ్ళు క్రూరంగా తయారయ్యారట.

నేను మూడురోజుల పాపగా ఉన్నప్పుడు మా తాతయ్య అదేదో మందు నా నోట్లో పోశాడట. అది విషంట. రోజుల అమ్మాయిని యిలా చంపడం చాలా సులభమట.

అయితే, నేను వాళ్ళు అనుకున్నంత సుల

భంగా చావలేదు. ఆ మందు పోస్తున్నప్పుడు నేను అటూ ఇటూ కదిలిపోయానట. అప్పుడు ఇంకో సారి పోశారుట. అయినా మింగలేకపోయానట. అంతా బయటికి వచ్చేసిందట.

అమ్మ ఓ చోట ఏడుస్తూ ఉండిపోయిందిట. మాలో పెద్దవాళ్ళు ఏం చేసినా ఎదురు చెప్పకూడదట. అడిగినప్పుడే జవాబు యివ్వాల్ట. అప్పుడే మాట్లాడాలట. అందుకే అంతచేస్తున్నా అమ్మ ఏమీ మాట్లాడలేదు.

ఇదంతా మా చిన్నాన్న చూస్తున్నాడట. నామీద జాలి కలిగి వెంటనే బయటికెళ్ళి, మేక పాలు పిండి నా నోట్లో పోశాడట. అలా చేస్తే లోపల ఉన్నదంతా పాలతోపాటు బైటికి వచ్చేస్తుందిట.

ఆ తర్వాత, దగ్గర్లోఉన్న గుడికెళ్ళి, నన్ను బతికించమని ఓ రెండు గంటలు ప్రార్థన చేశాడు.

అంతే. నేను బతికానట.

మా చిన్నాన్న గెలిచాడు. దేవుడు గెలిపించాడు. మరి మా తాత ఓడిపోయాడు. నాయనమ్మ ఓడిపోయింది.

ఎంత దురదృష్టం! వాళ్ళ గెలుపు ఓటముల కోసం, మా ఆడపిల్లల జీవితాల్ని పణంగా పెడుతున్నారు.

బీదరికం పాపం అనుకుంది నాయనమ్మ. అందుకని ఆ పాపాన్ని నా ద్వారా పోగొట్టుకోవాలనుకుంది. కానీ, నేను బతికాను.

వాళ్ళ ప్రయత్నం ఫలించకపోవడం, వాళ్ళకి అవమానం అనుకుంది. అందుకని, వాళ్ళిద్దరూ ఈ ఓటమిని తేలిగ్గా స్వీకరించదలుచుకోలేదు.

ఓటమి, విజయానికి పునాది అంటారు కదా, అందుకే మా నాయనమ్మ తన ఓటమి నుంచి ఎలా గెలవాలా అని ఆలోచించింది. అందుకే రత్తయ్య కోసం చూసింది.

ఈ రత్తయ్య కమీషన్ ఏజెంటు.

ఓ అడాప్టింగ్ ఏజెన్సీకి ఏజెంటు. వాడెప్పుడూ మా గూడెం దగ్గరే తిరుగుతుంటాడు.

ఓ పాపకి, ఆరునుంచి పదివేల రూపాయలు వరకూ వస్తుందని అందరి దగ్గరా గొప్పలు చెప్తుంటాడు.

రత్తయ్య కాకుండా, మరో ఇద్దరు కూడా ఉన్నారట. ఎవరు ముందొస్తే వాళ్ళకే మాట ఇవ్వడం అంతే. ఒక్కోసారి నాయక్ అనే వాడు కూడా వస్తాడు.

వీళ్ళు గూడేలకి, తండాలకి వచ్చి వాకబు చేస్తుంటారుట. ఎవరిళ్ళల్లో గర్భిణీస్త్రీలున్నారో, వాళ్ళ ప్రసవ తేదీలవీ ఎప్పుడో అన్నీ ముందేకనుక్కుంటారు.

అంతేకాకుండా, మంత్రసానులకు, దాయిలకి డబ్బు ఆశ చూపిస్తుంటారు. డబ్బు ఎలా సంపాదించవచ్చో, ఎంత లాభం ఉంటుందో, అది వచ్చే మార్గం ఏమిటో అన్నీ చెపుతుంటారు.

వీళ్ళందరి దగ్గరా ఫొటోలుంటాయి. ఇలా దత్తత కెళ్ళిన వాళ్ళ ఫొటోలు, అందులో, ఈ పిల్లలు మంచి మంచి బట్టలతో, ఖరీదైన పరిసరాల్లో జీవిస్తున్నట్లుగా ఉంటాయి.

ఆ ఫొటోలు తీసుకెళ్ళి ఎవరైతే గర్భిణీతో ఉన్నారో, ఎవరిళ్ళల్లో, చిన్న చిన్న ఆడపిల్లలున్నారో, ఆ యింట్లో ఉండే పెద్దవాళ్ళకి ఆ ఫొటోలు చూపిస్తుంటారు.

"మీ యిళ్ళల్లో ఈ ఆడపిల్లలు ఎలా పెరుగుతారు? అసలు మీరంతా ఎలా పెంచుతారు? ఎలాగో ఒకలాగ పెంచినా, పెళ్ళిళ్ళు ఎలా చేస్తారు? ఎంతంత కట్నాలివ్వాలో మీకు తెలీదా? ఆ డబ్బు ఎక్కడినుంచి తెస్తారు? అప్పు చేద్దామంటే ఎవరిస్తారు. మీ దగ్గర ఏముందని అప్పు ఇస్తారు? ఈ బాధలన్నీ మీరేం పడతారు? నా మాట వినండి. ఆడపిల్లల్ని నాకు ఇచ్చేయండి. అక్కడ ఆశ్రమంలో జేర్పిస్తాను. అక్కడికి ఎంతోమంది విదేశీయులు వచ్చి మీ పిల్లల్ని దత్తత తీసుకుంటారు. వాళ్ళు వాళ్ళ స్వదేశాలకి తీసుకెళ్తారు. అక్కడ వీళ్ళు ఎంతో చక్కగా, బాగా పెరుగుతారు. అదృష్టం బాగుంటే మంచి మంచి ఉద్యోగాలు చేస్తారు. ఇలా ఆశలు చూపించి వందో, రెండువందలో ఆ యిళ్ళల్లో వాళ్ళకి ఇచ్చి, నా పేరు చెప్పుకుని కల్లు కొనుక్కుని తాగండి. కొడుకు పుడితే మీరే ఉంచుకోండి, ఆడపిల్ల పుడితే నాకు ఇచ్చేయండి..."

అదీ మా వాతావరణం.

ఇలాంటి వాతావరణం ఉన్న జాతిలో పుట్టాను.

నా నోట్లో విషం పోసినా నేను చావలేదు. నాయనమ్మ మరో మార్గం వెతికింది. ఆ మార్గం పేరు రాజునాయక్.

ఆ తర్వాత ఓ నెలకి, మా తండాలోకి ఓ టాటాసుమో వచ్చి ఆగింది. అందులోంచి ఇద్దరు ఆడవాళ్ళు దిగారు.

ఆ సమయాన అమ్మ పొలానికి వెళ్ళింది. నాన్న

**ఆడపిల్లలంటే అందరికీ లోకువే! వాళ్ళను ఒక ఆటవస్తువులా చూస్తారు. గర్భిణీ స్త్రీలకు పేదరికం బలహీనతగా మారితే దాన్ని సొమ్ము చేసుకోవడానికి ఏజంట్లు సిద్ధంగా ఉంటారు. ఇల్లిల్లూ తిరగడం, ఎక్కడ గర్భిణీస్త్రీలున్నారో, ఎక్కడ దారిద్ర్యం ఉందో గుర్తించి వారిని ప్రలోభాలకు గురి చెయ్యడం ఒక వ్యాపారం! మరి ఈ బాధితుల హక్కులగురించి మాట్లాడే దెవరు? వారికోసం కన్నీరు కార్చేదెవరు? దీనికి పరిష్కారం ఏమిటి?**

ఎండుగడ్డి అమ్మడానికి హైద్రాబాద్ వెళ్ళాడు.

సుమోలో వచ్చిన ఆడవాళ్ళకి నన్ను, నేను పుట్టినప్పుడే పుట్టిన మా చిన్నాన్న కూతుర్ని యిచ్చేశారు.

వాళ్ళు నాయనమ్మ చేతిలో డబ్బుంచారు.

ఆ డబ్బుతో ఆ సీజన్‌కి, పొలాల్లో వేయడానికి పురుగులమందు కొన్నారట.

ఆ డబ్బు దానికి సరిపోతుందిట.

అంతేనా! మా జీవితాల విలువ పురుగుల మందు ఖరీదా! ఆ ఖరీదు మా నాయనమ్మ ఏవిధంగా కట్టింది? ఆ ఖరీదు ఎంతో తెలీదు. కానీ మా విలువఎలా కట్టింది? నాయనమ్మ మాకు విలువ కట్టిందా! ఆ సుమోలో వచ్చిన ఆడవాళ్ళు కట్టారా? లేక మా తాతయ్య కట్టాడా!

ఎవరు కట్టినా, మా ఇద్దరినీ అమ్మేసిన నాయనమ్మ ఆడదే, తీసుకెళ్ళిన వాళ్ళు కూడా ఆడవాళ్ళే.

వీళ్ళల్లో ఎవరు కట్టినా, ఆ విలువ మాత్రం మా పొలాలకి పురుగుల మందు కొనగలిగేంత.

మా ఆడపిల్లల జీవితాలు ఎంత చవక!

ఆ సాయంత్రం అమ్మా నాన్న ఇంటికి వచ్చాక, జరిగింది తెలుసుకున్నారు. పెద్ద గొడవ జరిగింది. "డబ్బు కోసం అమ్మేస్తారా ఇంకా నేను ఓ ఆటో ఏదో నడిపి, డబ్బు ఎక్కువ సంపాదించాలనుకున్నాను. నన్ను అడగాలని అనుకోలేదా! నేను కన్నతండ్రిని కదా, నా కూతుర్ని నేను పోషించుకోలేననుకున్నారా! ఓ చిన్ని ప్రాణాన్ని కాపాడలేని నేను తండ్రిని ఎలా అవుతాను! నేను బతికి లాభం ఏమిటి?" అంటూ ఏడ్చాడు. ఆ తర్వాత రెండురోజులకి పొలాల కోసం కొన్న పురుగుల మందు తాగి చచ్చిపోయాడు.

ఈ గొడవలన్నింటికీ అమ్మే కారణమని, అమ్మని చావగొట్టారు. అసలే నీరసంగా ఉన్న అమ్మ, వాళ్ళ దెబ్బలకి కిందపడిపోయింది. ఓ ఆర్నెల్ల వరకూ లేవలేకపోయింది.

ఆ తర్వాత అమ్మని ఇంట్లోంచి తరిమేశారు.

అక్కని తీసుకుని అమ్మ తన తల్లిగారింటికి వెళ్ళిపోయింది. అక్కడే ఓ కాంట్రాక్టరుదగ్గర కూలి

## పొలిటికల్ లీడర్‌తో కాజల్ డేటింగ్?

*దక్షిణాది పొలిటికల్ లీడర్‌తో కాదులెండి. ఉత్తరాదిన ఓ పొలిటికల్ లీడర్‌తో కాజల్ డేటింగ్‌లో ఉందన్న వార్త ఇప్పుడు బాలీవుడ్‌లో బాగా హల్‌చల్ చేస్తోంది. కాజల్ బాలీవుడ్‌లో సినిమాలు చేస్తున్న సమయంలో ఓ పార్టీలో ఆ లీడర్ పరిచయమయ్యాడట! ఆ పరిచయం ఇప్పుడు డేటింగ్ దాకా వెళ్ళిందని అంటున్నారు. కాజల్ ఆ మధ్య ఒకతనితో నేను ప్రేమలో ఉన్నానని చెప్పుకొచ్చింది. దాంతో ఆ ప్రేమికుడు ఈ లీడరే కావచ్చన్న ఊహాగానాలు తెగ వస్తున్నాయి.*

పని చేసుకుంటోంది. ఇప్పటికీ అక్కడే ఉంది.

మా బాబాయికి మూడో ఆడపిల్ల పుట్టింది. రెండో అమ్మాయిని, నాతోపాటే సుమోవాళ్ళకి ఇచ్చేశారు. ఈ పుట్టిన అమ్మాయిని, బతికుండ గానే మట్టిలో పూడ్చేశారట.

ఇంట్లో పెద్దవాళ్ళ కడుపులు నిండాలంటే, ఆడపిల్లలు బలి అవక తప్పడం లేదు.

నన్ను, ఆ సుమోవాళ్ళు ఓ అనాథాశ్రమంలో ఉంచారు. అక్కడ దత్తతకి ఇస్తుంటారు. దానికో డైరెక్టరున్నాడు. అంతేకాకుండా, దాన్ని వెనుకనుండి నడిపించే ఓ సమాజ సేవకుడున్నాడు. అతను ఈ దేశం వాడో కాదో తెలియదుగానీ, అతని పేరు డేవిడ్.

ఆ అడాప్షన్ సెంటర్‌లో ఓ ఐదు నెలలున్నాను. ఈ విషయం నన్ను దత్తత తీసుకున్న 'లీసా' చెప్పింది.

అక్కడ రోజుకి రెండుసార్లు మాకు పాలు ఇచ్చేవారట. ఒక్కొక్కసారి పాలు మరిగించకుండా, అలాగే పట్టేవారట. దానితో రకరకాల క్రిములు కడుపులోనే చేరి, ఎప్పుడూ విరేచనాలు, జ్వరంతో ఉండేవాళ్ళమట.

శరీరశుభ్రత కూడా ఉండేది కాదు. పట్టించు కునేవారు కాదు. తలలో, ఒంటిమీద ఏవేవో చర్మ వ్యాధులు వచ్చాయిట.

అడాప్షన్ ఏజెన్సీకి వచ్చే నిధుల్లోంచి డబ్బు మిగుల్చుకోడం కోసం, మా పిల్లల కడుపులు కొట్టేవాడు. మాకెవరికీ నోరులేదు కదా, మేం ఏం తాగుతున్నామో, అది ఎలా ఉంటుందో జరిగింది చెప్పడానికి... సాక్ష్యాలేం వుంటాయి! ఇవన్నీ చాలా చిన్న విషయాలు కాబట్టి పట్టించుకోరు.

ఒక్కొక్కసారి కడుపుతో ఉన్నవాళ్ళు వచ్చేవారట. వాళ్ళు ప్రసవించాక పిల్లల్ని వదిలి వెళ్ళిపోయేవారట.

ఓసారి, ఓ తల్లి మృతశిశువుని ప్రసవించింది. దానికి ఎవరూ బాధ్యులు కాకపోయినా, వాళ్ళ లాభం పోయిందని, డైరెక్టరు పెద్ద గొడవ చేశా డట. ఒక్కొక్కసారి తల్లులే చనిపోయేవారుట.

ఇంత భయంకర వాతావరణంలో నేను ఐదునెలలు పెరిగాను. నేను అక్కర్లేని పిల్లను కదా! బైటికి పంపేయాలనుకున్నారు. పంపేశారు. మా నాయ నమ్మకి, తాతయ్యకి రోజుల పిల్లని పంపేశాం కదా, అక్కడ ఎలా ఉందో అన్న ఆలోచన లేదు.

మా అక్క, నా కన్నా రెండేళ్ళు పెద్దది. ఆమె తినే అన్నం పూర్తి పోషక విలువలున్నది కాక పోవచ్చు. ఆమె వేసుకునేవి చిరుగుల బట్టలు, పాతవి కావచ్చు. ఆమె బీదరికం నీడల్లో బతుకు తుండవచ్చు. ఆమెకు ఎన్నో విషయాలు తెలియక పోవచ్చు. ఎన్నింటినో మరిచిపోయి ఉండొచ్చు.

కానీ, నా నొప్పి ఆమెకు లేదు. ఈ నొప్పి, చర్మంతోపాటు పెరుగుతుంది. మా అక్కకి ఇలాంటివి ఉంటాయని కూడా తెలీదు. తెలిసే అవకాశం లేదు.

'లీసా' నన్ను దత్తత తీసుకున్న పదకొండేళ్ళకి నన్ను భారతదేశం తీసుకొచ్చింది. అక్కడినుంచి, హైదరాబాదు, మా తండావాళ్ళున్న దగ్గరికి తీసు కొచ్చింది. ఈ డిసెంబరులో నాకు ఈ విధంగా మా వాళ్ళని కలవడం, క్రిస్మస్ బహుమతి! ఏ దుకా ణంలోనూ దొరకని అమూల్యమైన బహుమతి.

పదకొండేళ్ళ తర్వాత ఇప్పుడే నా గురించిన విషయాలన్నీ తెలిశాయి. నేను నివసిస్తున్న దేశం నా పుట్టినదేశం కాదు. 'లీసా' దేశం స్పెయిన్. ఆ మట్టి, ఆ నీళ్ళు, ఆ గాలి, వాటికి నా రక్తంతో సంబంధం లేదు. నాకు చెందినవన్నీ మా ఊళ్ళో ఉన్నాయి. మా జాతిలో ఉన్నాయి.

నన్ను పుట్టించమని నేను ఎవర్నీ అడగలేదు.

కొన్నివేల మైళ్ళ దూరంలో ఉన్న దేశానికి పంపించమని నేను అడగలేదు. నా వంశ మూలాల నుంచి వేరుచేయమని అడగలేదు.

అయినా ఎందుకు చేశారు? ఎన్నో ప్రశ్నలు...




వాటన్నింటికీ జవాబులు ఎవరిస్తారు? మా నాయనమ్మ ఇవ్వగలదా! ఇవ్వదు.

ఎంతో ప్రేమించే భూమిని అమ్మేసి అమ్మా యిల పెళ్ళిళ్ళు చేసి కుటుంబాన్ని వీధిన పడేయ డానికి ఇష్టపడని తాతయ్యని అడిగితే సమా ధానం ఇస్తాడా!

ఇండియా వస్తున్నప్పుడే లీసా నన్నడిగింది, ఎవర్ని చూడాలని ఉందో! నాయనమ్మని, తాత య్యని చూడాలనుకోవడం లేదు.

మా నాన్నని ఆత్మహత్య చేసుకునేలా ప్రవర్తిం చిన తాతయ్యని ఎందుకు చూస్తాను?

రోజుల పిల్లలతో, నెలల పిల్లలతో వ్యాపారం చేస్తున్నవాళ్ళని, ఎందుకు చూస్తాను? వాళ్ళేదో డబ్బు సంపాదిస్తున్నారని కాదు, కడుపులో ఉన్న వాళ్ళని వెతికి పట్టుకోవడం, వాళ్ళు ప్రసవించ గానే, ఆ పిల్లల్ని అమ్మేయడం... ఇలాంటి వాళ్ళ మొహాలు ఎలా చూడను?...

నేను హైదరాబాద్ రాగానే నేను చూడాలను కున్నది మా అమ్మని, మా అక్కని...

"డేవిడ్‌ని చూడవా?" అంది లీసా.

"లేదు" అన్నాను.

డేవిడ్ ఓ సోషల్ వర్కర్. ఈ సొసైటీలో పెద్ద పేరున్న వాడు. మచ్చలేనివాడట. పిల్లల్ని పంపిం చడంలో, అమ్మేయడంలో, ఎన్నో చార్జ్‌షీట్స్ వేసినా ఏం లాభం లేకపోయింది. ఎందుకంటే, అతడిది కరుణా హృదయం. జాలిగుండె! అది ఎంతో శక్తిమంతమైనది. అందుకే అతను చాలా గొప్పవాడు. అతనికి గొప్పవాళ్ళతో సంబంధా లున్నాయి. ఈ సంబంధాలే విదేశీయులకి దత్తత నిప్పిస్తున్నాయి. అందుకే గొప్పవాడు. ఈ గొప్ప వాణ్ణి చూసేందుకు, అతనితో మాట్లాడేందుకు వ్యాపారవేత్తలు, మంత్రులు, రాజకీయ నాయకులు ఉత్సాహం చూపిస్తుంటారు. గొప్పవాడు కదామరి!

ఇది వ్యాపారం. ఈ వ్యాపారాన్ని ఎవరూ అడ్డుకోలేరా! ఎవరూ ప్రశ్నించలేరా! అని ప్రశ్నిస్తే, దీనికి లేదు అనే జవాబు వస్తుంది. ఎందుకంటే అది నిశ్శబ్దంగా సాగిపోతున్న వ్యాపారం.

కొన్నేళ్ళుపోయాక, ఇంకా పెద్దదాన్ని అవుతాను. నేను మళ్ళీ మా వాళ్ళని చూడటానికి వస్తాను. నాలాగా వెళ్ళిన వాళ్ళు కొన్ని వందలమంది, వేల మంది ఉన్నారు. వాళ్ళూ వస్తారు. అప్పుడందరం కలిసి, ఆడపిల్లలు అమ్మకాల కోసమే పుట్టలేదని ఓ పెద్ద కేక పెడతాం. దిక్కులు పిక్కటిల్లే కేక.

నా మటుకు నాకు కొన్ని ప్రశ్నలున్నాయి.

ఎందుకు మనుషుల సెంటిమెంట్లతో వ్యాపారం చేస్తున్నారు?

నా జన్మని, అందులోంచి నాకు సంక్రమించే ఆచార వ్యవహారాలని నా జెనెటిక్ వేళ్ళని, నా కుటుం బాన్ని, నా జాతిని, ఆఖరికి నా అసలైన నిజమైన పేరుని, ఏదీ లేకుండా, 'నా' అనేది ఏదీ నాకు దక్కకుండా చేస్తున్నారు!

మమ్మల్ని ఓ వస్తువులా తయారు చేస్తున్నారు.

బజార్లో అమ్మకానికి ఉన్న వస్తువులాగా చేసి వ్యాపారం చేస్తున్నారు.

ఓ ఫినిష్డ్ ప్రోడక్ట్‌లా చేసేసి, మేడ్ ఇన్ ఇండియా అని ఓ లేబుల్ వేసి, ఓ స్టాంప్ కొట్టి, ఆకర్షించే లాగా చేసి, విదేశీయుల్ని క్లయింట్లుగా చేస్తూ మార్కెట్ లోకి పంపిస్తున్నారు.

సాటి జీవుల్లాంటి నోరు లేని మాకు సాయం చేయాలన్న వాళ్ళ సెంటిమెంట్లను క్యాష్ చేసు కుంటున్నారు.

సేవింగ్ లైవ్స్ అండ్ గివింగ్ అస్ హోంస్ అన్న వాక్యంతో ముందుకు వెళుతున్న ఈ విదేశీ యులు ఏ.టి.ఎమ్.లు.

ఇవన్నీ ఎందుకు జరుగుతున్నాయని ఆలోచిస్తే కట్నాల మూలంగానే కదా! ఈ కట్నాల వల్ల వెనుకబడిన మా జాతుల్లో ఏం జరుగుతోందో ప్రభుత్వం పట్టించుకుంటే బాగుండును.

విమెన్ ఎంపవర్‌మెంట్ అంటూ చేసే ఉప న్యాసాల కన్నా, జాతిని రక్షించే మార్గాలు వెతి కితే బాగుండుననిపిస్తోంది.

ఇప్పుడు, నేను స్పెయిన్ వెళ్ళిపోతున్నాను. మళ్ళీ వస్తాను. అపుడు నాలాంటి వాళ్ళు నా వెనక ఉంటారు. అప్పుడు నా జాతిలోని ఆడపిల్లల్ని రక్షిస్తాం. అసలైన ఎంపవర్‌మెంట్ ఏమిటో చేసి చూపిస్తాం. ఆ రోజు ఎంతో దూరంలో లేదు.

సెల్: 8897643009






## రోలర్‌కోస్టర్ రెస్టారెంట్

ఆ రెస్టారెంట్‌కి వెళితే వెయిటర్లు కనిపించరు. మెనూ పుస్తకాలుండవు. ఏ ఐపాడ్‌లోనో, ఆన్‌లైన్లోనో కావలసిన ఫుడ్ ఐటమ్స్ ఆర్డరిస్తే చాలు. పైనుంచి వాయువేగంతో వచ్చి మన టేబుల్‌పై వాలతాయి మనం ఆర్డిరిచ్చిన పదార్థాలు. అదెలాగో రోలర్ కోస్టర్ రెస్టారెంట్‌కి వెళితే తెలుస్తుంది. మరి దాన్ని చూడాలన్నా, అక్కడి ఐటమ్స్ రుచి చూడాలన్నా ఇంగ్లండ్ వెళ్ళాల్సిందే!

ఇంగ్లండ్‌లోని ఆల్టన్ టవర్స్‌లో ఉన్న స్టాఫర్డ్ షైర్ థీమ్ పార్క్‌లో ఏర్పాటు చేశారీ రోలర్ కోస్టర్ రెస్టారెంట్! రెస్టారెంట్‌కి వచ్చిన అతిథులు తమ ఐటమ్స్ ఎలా మెలికలు తిరుగుతూ వస్తాయో, చక్కగా చూస్తూ ఎంజాయ్ చేయవచ్చు కూడా! పిల్లలైతే ఇంకా బాగా ఎంజాయ్ చేస్తారు.

ఐటమ్స్‌ని చెఫ్స్ రోలర్ కోస్టర్ రైడ్ పైన ఉంచుతారు. ఆ డిష్ దాదాపు 400 మీటర్లు ప్రయాణించి ఆర్డరిచ్చిన వారి టేబుల్‌పై ల్యాండ్ అవుతుంది. రోలర్‌కోస్టర్ పైన ఆర్డరిచ్చిన పదార్థాలు ఒలింపిక్స్‌లో గోల్డ్‌మెడల్ సాధించిన మోఫరా కన్నా వేగంగా ప్రయాణిస్తాయట! అంతటి వేగంతో, అంతటి ఫోర్స్‌తో వచ్చే పదార్థాలు ఆరోగ్యానికి మంచివేనా అంటే, ముందే వాటిని వారి ల్యాబ్‌సెంటర్‌లో పరీక్షచేసి, అవి బాగానే ఉంటాయని నిర్ధారించుకున్నాకే సర్వ్ చేస్తారట! ఈ రెస్టారెంట్‌లో మొత్తం 13 టేబుల్స్ ఉన్నాయి. ఈ రెస్టారెంట్ చూడటానికి, అందులో ఆరగించడానికి తెగ ఉత్సాహపడుతున్నారట పిన్నలు, పెద్దలు. బాగుంది కదూ రోలర్‌కోస్టర్ రెస్టారెంట్! ఇంగ్లండ్ వెళితే మీరు కూడా అక్కడి ఫుడ్ రుచి చూసేయండి!

## ప్రొఫెసర్ శునకం



నేను అన్నిటిలా కాదు, నా రూటే సెపరేటు అంటోంది బేర్‌గార్డ్. ఇంతకీ ఎవరీ బేర్‌గార్డ్? అనుకుంటున్నారా? కాలిఫోర్నియా యూనివర్సిటీలో ప్రొఫెసర్ విధులు నిర్వర్తించే శునకం గారండీ! కుక్కేంటి? ప్రొఫెసరేంటి? అని ఆశ్చర్యపోకండి. మీరు చదివేదంతా నిజమే!

అమెరికాలోని సదరన్ కాలిఫోర్నియా యూనివర్సిటీలో బేర్‌గార్డ్ టైర్ బైటర్ అనే శునకం ప్రొఫెసర్‌గా పనిచేస్తోంది. దీని వయసు రెండు సంవత్సరాలు. ప్రొఫెసర్ అంటే ఈ శునకం గారు బోర్డు ముందు నిలబడి, పాఠాలు చెబుతున్నట్లు ఊహించేసుకోకండి. యూనివర్సిటీ విద్యార్థుల్లో ఒత్తిడిని దూరంచేసి మానసిక ఉల్లాసం పెంపొందించేందుకు బేర్‌గార్డ్‌ని ప్రొఫెసర్‌గా నియమించారు. ఇలా శునకాలతో సరదాగా గడపడంవల్ల మానసిక ఆనందం కలుగుతుందని, ఒత్తిడిని కలిగించే హార్మోన్ల విడుదల తగ్గుతుందని పరిశోధనల్లో తేలిందట. అందుకే ఈ బేర్‌గార్డ్ శునకాన్ని ప్రొఫెసర్‌గా నియమించినట్లు యూనివర్సిటీ అధికారులు చెబుతున్నారు. మొత్తానికి ప్రొఫెసర్ హోదాలో శునకంగారు బహుబాగా విద్యార్థుల్లో ఒత్తిడిని మాయం చేస్తున్నట్టున్నారు!

## బుల్ టౌన్

ఎద్దును ఇంగ్లీషులో ఏమంటారు? అని అడిగితే బుల్ అని ఠక్కున చెప్పేస్తారు. ఆ బుల్ పేరుమీదనే ఈ ఊరు ఏర్పడింది. నార్త్ ఐలాండ్ ఆఫ్ న్యూజిలాండ్ ద్వీప సముదాయంలో ఉంది ఈ గ్రామం. ఇక్కడ ఆఫీసు పేర్లు, వీధుల పేర్లు అన్నీ బుల్‌తోనే మొదలవుతాయి లేదా అంతమవుతాయి.

1862లో ఇంగ్లాండ్‌కి చెందిన జేమ్స్ బుల్ ఇక్కడ కిరాణా దుకాణం పెట్టాడు. అది చాలా ఫేమస్ అయిపోయింది. అలా ఆ ప్రాంతం బుల్‌టౌన్‌గా మారిపోయింది. ఆ తర్వాత అప్పటి న్యూజిలాండ్ ప్రధాని ఈ గ్రామాన్ని బుల్ థీమ్‌డ్ టౌన్‌గా మార్చాలని నిర్ణయించారు. దీంతో ఈ బుల్‌టౌన్‌ను బుల్స్‌గా పిలవడం మొదలుపెట్టారు. అప్పటినుంచి గ్రామంలో వాళ్ళంతా బుల్‌కి అభిమానులుగా మారిపోయారు. ఎంతలా అంటే ఈ టౌన్‌లో ప్రతీ చోటుకీ బుల్ పేరు పెట్టుకోవాల్సిందే! ఎలా అంటే పార్కింగ్ స్థలాన్ని 'పార్క్-ఎ-బుల్', లైబ్రరీని 'రీడ్-ఎ- బుల్', ఆసుపత్రిని క్యూర్-ఎ-బుల్', హోటల్‌ను 'ఈట్-ఎ-బుల్', టాయిలెట్‌లను 'రిలీవ్-ఎ-బుల్' ఇలా పిలుస్తుంటారు. అంతేకాదు టౌన్‌లో పెద్దపెద్ద ఎద్దు బొమ్మలు కూడా ఏర్పాటుచేశారు. దీంతో ఈ పట్టణం ప్రముఖ పర్యాటక ప్రాంతంగా మారిపోయింది. పర్యాటకులు ఈ టౌన్ సందర్శించేందుకు తెగ ఆసక్తి చూపిస్తున్నారు.

## గంటకో డిజైన్ మార్చుకునే భవంతి

ఎప్పుడో కట్టిన ఇల్లు కొత్తగా కనిపించాలంటే ఏంచేస్తాం? కొత్తగా రంగులు వేస్తాం లేదంటే రీమోడలింగ్ చేస్తాం. కానీ ఆ భవనానికి అలాంటి అవసరం లేదు. ఎందుకంటే ఆ భవనం గంటగంటకూ తన రూపం మార్చుకుంటూ సరికొత్తగా వెలిగిపోతుంది. మరి ఆ కథాకమామీషేంటో తెలుసుకుందామా!

ఆస్ట్రియా దేశం స్టైరియా నగరంలో ఒక అద్భుతమైన భవనం నిర్మించారు. కీఫర్ టెక్నిక్ షోరూం భవనం ఇది. దీని వెలుపలిభాగం (ఎక్స్‌టీరియర్) రకరకాల డిజైన్లలోకి మారుతూ చూపరులను ఆకర్షిస్తోంది. వాతావరణ పరిస్థితులనుబట్టి ఈ భవనం తనంతట తానే స్వీయ మార్పులు చేసుకుంటుందట! ఈ భవన నిర్మాణానికి 'డైనమిక్ ఫెకెడ్' టెక్నాలజీ ఉపయోగించారు. ఎర్నెస్ట్ గైసెల్బ్రెక్, తన భాగస్వాములతో కలిసి ఈ చిత్రమైన నిర్మాణం చేశాడు. 2007లో ఈ భవన నిర్మాణం పూర్తయింది. భవనం ఎక్స్‌టీరియర్ వివిధ రకాల డిజైన్లలో కనిపించడానికి 112 మెటల్ టైల్స్ ఏర్పాటుచేశారు. గంటగంటకూ ఈ భవనం డిజైన్ మారిపోతూ ఉంటుందన్న మాట! అద్భుతంగా ఉందికదూ!

-నర్మద వాసిరెడ్డి





# జీవితమే ఒక ప్రతిఘటన

(కోట శ్రీనివాసరావు కథాకథనం) 6

**టి.**కృష్ణగారి ప్లానింగ్ చాలా కచ్చితంగా ఉండేది. ఆయన భావాలు చాలా ప్రత్యేకంగా ఉండేవి. ఆయన సినిమాల్లో సమస్యను చర్చించడం మాత్రమే కాదు. మంచో చెడో ఇలా ఉంటే బావుంటుందని ఆన్సర్ కూడా చెప్పేవారు. ఆయనే ఉంటే నాకు ఇంకా రకరకాల పాత్రలు ఇచ్చేవారండీ. ప్చ్! సర్లెండి. అలా నేను సినిమాను వెతుక్కుంటూ ఏ రోజూ అడుగు వేయలేదు. కానీ సినిమాయే అలా నన్ను పిలిచింది.

## ఇప్పుడు రిలీజై ఉంటే బాహుబలిని మించిపోయేది

(గతసంచిక తరువాయి)

ఇప్పుడు నేను ఆ విషయం చెప్పుకుంటే గొప్పగా ఉంటుంది.

ఇప్పటి మిమిక్రీ ఆర్టిస్టుల్నిచూస్తే నాకు గతం గుర్తుకొస్తుంది. వాళ్ళు చేసే కొన్ని కొన్ని ఐటమ్స్ చూసి 'ఇలాంటివి ఎప్పుడో చేశానయ్యా బాబూ..' అనుకుంటాను. ఇప్పుడది ప్రొఫెషన్ అయిందిగానీ అప్పుడు నేను సరదాగా చేసేవాణ్ణి.

ఒక పాపులర్ పాట తీసుకుని రకరకాలుగా పాడేవాణ్ణి. అలా పాపులర్ అయిన స్కిట్ 'దేవదాసు'. 'దేవదాసు' చిత్రాన్ని మళ్ళీతీస్తే ఎలా ఉంటుంది? అందులోని పాటల్ని రేడియో ప్రముఖులు పాడితే ఎలా ఉంటుంది? అనే ఆలోచనతో చేసిన స్కిట్ అది. అప్పట్లో రేడియోలో ప్రముఖులు వెంకటేశ్వర్లుగారు, చిత్తరంజన్‌గారు, ఓగిరాల నరసింహ మూర్తిగారు, ఎమ్మెస్ రామారావుగారు లాంటి వ్యక్తుల్ని ఇమిటేట్‌చేస్తూ దేవదాసు పాటలు పాడేవాణ్ణి. అప్పట్లో నా ప్రోగ్రామ్స్‌లో ఇవి చాలా ఫేమస్.

### పొట్ట చెక్కలయ్యేలా నవ్వించా

బ్యాంకులో పనిచేస్తుండగా, సరదాగా నా అంతట నేను నేర్చుకుని పాడి నలుగురితో శభాష్ అనిపించుకున్న స్కిట్‌లు ఎంతో ఫేమస్ అయ్యాయి. ఆ రోజుల్లో కమర్షియాలిటీ లేదు. ఇవాళ ఏ కాస్త నేర్చుకున్నా కమర్షియలైజ్ చేసి, డబ్బుకు ముడి పెట్టేస్తున్నారు. అప్పుడు నాకు డబ్బులు తీసుకోవాలనే ఐడియాలే లేవసలు. ఒక్కసారి మాత్రం పారితోషికం అందుకున్నా. నా గురించి ఆనోటా ఈనోటా విన్నారు ఒక రాజుగారు. ఆయనకు ఇండస్ట్రీ ఏదో ఉండేది. '31 డిసెంబర్‌కి మాతో ఉండాలండీ సరదాగా' అని తీసుకెళ్ళి, వరుసపెట్టి నాతో తెలంగాణ యాసలో రామాయణం దగ్గర్నుంచి అన్నీ చెప్పించుకున్నారు. ఆయన, వారి బంధువులందరితో ఆ ఆవరణంతా సందడిగా ఉంది. నేను చెప్పడం, వాళ్ళు నవ్వడం....రెండు గంటలసేపు అందరూ నవ్వీ నవ్వీ పొట్టలు పట్టుకున్నారు.

'కొత్త సంవత్సరానికి మేం ఆనందంగా ఆహ్వానం పలికామండీ. పొట్టలు చెక్కలయ్యేలా నవ్వించారు' అని ముచ్చటపడి నన్ను చాలా బాగా చూసుకున్నారు. అప్పట్లో రెండు రూపాయల కాగితాలు వచ్చిన కొత్త. ఆ కొత్త నోట్లతో 200 రూపాయలు చేతిలో పెట్టి, శాలువాకప్పి 'థాంక్సండీ' అన్నారు. అదొకటి నాకు బాగాగుర్తు. అంటే నా మిమిక్రీ ప్రోగ్రామ్‌కి డబ్బులు తీసుకోవడం అదే తొలిసారి.

### నన్నుచూసే జనంతో మా బ్యాంక్ కిటకిటలాడేది

నారాయణగూడ చౌరస్తాలో నేను పనిచేసే స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా ఉండేది. దాన్ని ఆనుకునే దీపక్‌మహల్. అందులో 1985 అక్టోబర్ 11న 'ప్రతిఘటన' సినిమా రిలీజైంది. ఆ సినిమాతో సినీ నటుడుగా నా జీవితం మొదలైంది. అక్కడి నుంచి మిడ్‌నైట్ స్టార్‌నైపోయానండీ. అంటే 12వ తారీఖు నేను స్టార్‌ని. 'ప్రతిఘటన' చూసిన వారందరికీ నేను బ్యాంకులో పనిచేస్తానని తెలియసాగింది. ఆనోటా ఈనోటా వింటుంటారు కదా. అలా తెలుసుకున్న జనాలు ఆ సినిమా చూడటం, బ్యాంకుకు రావడం, క్యాష్ సెక్షన్‌లో నన్ను చూడాలని ఉబలాటపడటం. సెక్యూరిటీ వాళ్ళు ఒప్పుకోకపోవడం, బ్యాంక్ అంతా కిటకిటలాడటం... ఇదీ తంతు. బాగా అల్లరి, గోల, హడావిడి ఉండేవి. 'నువ్వు క్యాష్ డిపార్ట్‌మెంట్ వదిలేసెయ్. నిన్ను చూడ్డానికి విపరీతంగా జనం వస్తున్నారు. మాకు తలకాయనొప్పిగా ఉంది' అని మా మేనేజర్ గారు నన్ను వెనకాల కూర్చోపెట్టేవారు. ఆయన్ని నేనేం తప్పు పట్టలేదు. అంటే అది క్యాష్ కదా.. ఇప్పట్లాగ పెద్ద సెక్యూరిటీ ఉండేదికాదు కాబట్టి ఆయన జాగ్రత్తల్లో ఆయన ఉండటం తప్పుగా అనిపించలేదు.

### సినీ జీవితం ప్రారంభం

'ప్రతిఘటన' విడుదలైనప్పటి నుంచి వరుసగా సినిమాలు రావడం మొదలుపెట్టాయి. స్పెషల్‌గా సెలవులు పెట్టడానికి బ్యాంకువాళ్ళ పర్మిషన్‌లేదు.



టి.కృష్ణ



బ్యాంకు రూల్స్ స్ట్రిక్ట్‌గా ఉండేవి. ఏం చేయాలో అర్థం కాలేదు. అప్పుడే ఐదారు సినిమాలకు అవకాశాలు వచ్చాయి. బ్యాంక్ వాళ్ళకి తెలిసీ తెలియకుండా చేయడానికి ప్రయత్నించేవాణ్ణి. రిక్వెస్ట్‌లు మీద రిక్వెస్ట్‌లు పెట్టగా, పెట్టగా, జనవరిలోనో, ఫిబ్రవరిలోనో పర్మిషన్ ఇచ్చారు. అదీ ఏమనీ... 'నువ్వు సినిమాల్లో యాక్ట్ చేసుకోవచ్చు, ఎలాంటి ప్రత్యేక సెలవులు ఇవ్వం. ఫెసిలిటీస్ ఉండవు. నీకున్న సెలవుల్లో నువ్వు యాక్ట్ చేసుకోవచ్చు' అని. సరే అనుకుని యాక్ట్ చేయడం మొదలుపెట్టా.

### రామోజీరావుగారి ఆశీర్వాదం

సరిగ్గా ఆ సమయంలో 'ప్రతిఘటన' వంద రోజుల వేడుక జరిగింది. తొలిసారి రామోజీరావుగారితో పరిచయమైంది. అప్పటిదాకా ఆయన గురించి వినడమేగానీ ఎప్పుడూ చూడలేదు. శతదినోత్సవంలో రామోజీరావుగారిని చూశా. ఆయన ఆనందపడి నన్ను చాలా అప్రిషియేట్ చేశారు. 'బాగా చేశారండీ. సినిమా చూసిన వారందరూ మీ గురించి అడుగుతున్నారు. మంచిపేరు వచ్చింది మీకు. ఫ్యూచర్‌లో తప్పకుండా చక్కటి అవకాశాలు వస్తాయి. బాగా బిజీ అవుతారు. మనం ఫస్ట్ టైమ్ కలిశాం. మీతో పరిచయం బావుంది' అని ఆనందంగా చెప్పారు. ఆయన వాక్కులు ఫలించాయి నాకు. ఆ సినిమా జనాల్లోకి మౌత్‌టాక్‌తో వెళ్ళింది. దానికి తోడు రామోజీరావుగారు కూడా బాగా పబ్లిసిటీ చేశారు. అదే గనుక ఇప్పుడు విడుదలై ఉంటే 'బాహుబలి' సక్సెస్‌ని మించిపోయేది. ఎందుకంటే అప్పట్లో రూపాయి వాల్యూ వేరు. ఇప్పుడు వేరు. కంపేర్ చేస్తే ఆ సినిమా ఆ లెవల్ హిట్ అన్నమాట.

### బ్యాంక్ ఉద్యోగానికి రాజీనామా

వరుసగా సినిమాలు రావడంతో బ్యాంకు కంటే ఇది బెటర్ కదా అనే ఫీలింగ్ నాలో మొదలైంది. పేరుప్రతిష్టలపరంగా గానీ, ఆర్థికంగా కానీ సినిమా పరిశ్రమే నాకు బెటర్ అనిపించింది. అయినా బ్యాంకును వదిలే ధైర్యం చేయలేదు. చూడబోతే నన్ను నమ్ముకుని ఇంట్లో మా ఆవిడ, ముగ్గురు పిల్లలున్నారు. బ్యాంక్ అంటే గవర్నమెంట్ ఉద్యోగం. నిలకడైన జీతం, గౌరవం. అందుకే గబుక్కున వదల్లేకపోయా. అలాగని రోజూ బ్యాంక్‌కి వెళ్ళే టైమ్ ఉండేది కాదు. ఆర్టిస్ట్‌ని కావడంవల్ల మారుపేరు పెట్టుకుని ఉద్యోగం చేయడం కుదరదు. పోనీ ఆరోగ్యం బాగోలేదనో, మరోటనో అబద్ధంచెప్పే పరిస్థితి లేదు. జనాన్ని అలరిస్తూ స్క్రీన్‌మీద కనిపిస్తుంటాను. అందువల్ల అబద్ధాలు చెప్పడం నాకిష్టం లేకపోయింది. 'సినిమాల్లో ట్రై చేస్తున్నాను. అవకాశాలు ఆశాజనకంగా ఉన్నాయి, సెలవు గ్రాంట్ చేయాల్సిందిగా మనవి' అని లెటర్లు పెట్టేవాణ్ణి. అలా నెలకి ఒకటీ, రెండు సార్లు సెలవులు పెట్టి మద్రాసు వెళ్ళేవాణ్ణి. రెండు పెద్ద సినిమాల్లో చేసేవాణ్ణి. తర్వాత్తర్వాత సినిమాలు పెరిగాయి. ఓ పక్క నేమో మా అన్నయ్యగారు వాళ్ళు 'ఒరేయ్ నీకు చాలా పేరొచ్చింది. నువ్వు ఇంక బ్యాంకు వదిలేయొచ్చు. నేను ప్రజల్లో చూస్తున్నాను కదా, నీకు తిరుగు ఉండదు. నటుడిగా నిలదొక్కుకుంటావ్' అని చెప్పడం మొదలెట్టారు. నాకేమో భయం వేసేది. ఏం చేయాలో అర్థమయ్యేది కాదు. అప్పటికే బ్యాంకువాళ్ళు కూడా ఏడాదిపాటు చూశారు.



**హైదరాబాద్ నారాయణగూడలో కోట శ్రీనివాసరావుగారు పనిచేసే బ్యాంక్‌ను ఆనుకునే దీపక్‌మహల్ ఉండేది. ప్రతిఘటన సినిమా అందులో రిలీజైంది. ఆ సినిమా చూసి జనం ఆనోటా ఈ నోటా విని కోటను చూసేందుకు బ్యాంక్‌కి వచ్చేవారు. గోల గోలగా ఉండేది బ్యాంక్ అంతా. సెక్యూరిటీ వాళ్ళు ఒప్పుకునేవాళ్ళుకాదు. తర్వాత ఐదారు సినిమాలకు ఆయనకు అవకాశాలు వచ్చాయి. అప్పుడు కోట ఏం చేశారు?**

నా పద్ధతిలో మార్పు రాలేదని వాళ్ళకు అర్థమైంది. అప్పటికి నేను బ్యాంకులోజేరి పందొమ్మి దిన్నర సంవత్సరాలు. 20 ఏళ్ళు పూర్తయితే నాకు పెన్షన్ ఇవ్వాలి. అందువల్ల ఒక ఉత్తరం రాశారు. 'ఫలానా తారీఖులోపు జాయిన్ అవ్వాలి. లేకపోతే నీకు ఉద్యోగంమీద ఇంట్రెస్ట్ లేదనుకుని మేమే తీసేస్తాం..' అన్నట్టు రాశారు. ఉత్తరం ఆలస్యంగా అందింది. వాళ్ళు చెప్పినడేటు దాటిపోయి అప్పటికి ఐదురోజులైంది. అప్పుడు బెంగళూరులో షూటింగ్‌లో ఉన్నట్టున్నా. సిల్క్ స్మిత సొంత పిక్చర్. ఆమే హీరో యిన్. వినోద్ హీరో. కాంబినేషన్ సీన్లు ఉండటం వల్ల వెంటనే హైదరాబాద్ రాలేకపోయాను. నేను వచ్చేసరికి పరిస్థితి చెయ్యి దాటిపోయింది. బ్యాంకు వాళ్ళు ఒప్పుకోలేదు. సరే అని రిజైన్ చేశా.

### ఐదు నెలలు హోటల్ కాపురం

ఇక అలా బ్యాంక్ ఉద్యోగానికి రాజీనామా చేశాక 1987 నుంచి సినిమానే నా వృత్తి. జాగ్రత్తగా చేసుకోవాలని నిర్ణయించుకున్నా. మద్రాసులో పామ్ గ్రోవ్ హోటల్లో రూమ్ తీసుకున్నా. రూమ్ నెంబరు 305. నాకు బాగా గుర్తుండి. ఇంకెవరైనా అన్ని రోజులు ఆ రూమ్‌లో ఉన్నారోలేదో తెలియదుగానీ, ఐదున్నర నెలలు ఏకధాటిగా ఉన్నాను దాన్లో. చేతి నిండా సినిమాలుండేవి. హైదరాబాద్ రావడం కుదిరేది కాదు. దాంతో అదే నాకు ఇల్లు ఐపోయింది. ఎప్పుడో అర్థరాత్రి రూమ్‌కి చేరుకునేవాణ్ణి. అంత తిని పడుకుంటే తెల్లారుజామునే మళ్ళీ షూటింగ్. బిజీగా మారానుగానీ, ఎంతైనా నాకు సినిమా వాతావరణం కొత్తగానే ఉండేది.. ఎవరితో ఎలా మాట్లాడాలో తెలి సేది కాదు. సినిమాలకు ఎలా డేట్లు ఇవ్వాలో చెప్పేవాళ్ళు లేరు. అందువల్ల చాలా ఇబ్బంది పడ్డమాట వాస్తవం.

### ఒకేసారి ఐదారుగురు ప్రొడక్షన్ మేనేజర్లు వచ్చారు

రాజమండ్రిదగ్గర పూడిపల్లిలో షూటింగ్. దాసరి నారాయణరావుగారి దర్శకత్వం. గోపీకృష్ణా మూవీస్ సినిమా. కృష్ణంరాజుగారు హీరో. నాకు మంచివేషం ఇచ్చారు. ప్రాణ్‌గారి కాంబినేషన్‌లో సీన్లు చేయాలి. సరేనని మేకప్ వేసుకుంటున్నా. అప్పటికే కాస్తంత మంచిపేరు వచ్చింది. ఇటు కృష్ణంరాజుగారు, అటు దాసరి నారాయణరావుగారు నన్ను చాలా బాగా చూసుకుంటున్నారు. అంతా పద్ధతిగా ఉంది. అప్పుడు ఓ ఐదారుగురు ప్రొడక్షన్ మేనేజర్లు సెట్‌లోకి వచ్చారు. దాసరిగారు వాళ్ళను గుర్తుపట్టి పలకరించి, టీ, కాఫీలు ఇచ్చి 'ఏంటి ఇలా వచ్చారు' అని అడిగారు. వారిలో ఒకరు 'కోటగారి కోసమండీ' అన్నారు. ఇంకొకరివైపు చూస్తే ఆయన కూడా అదే మాట. వరుసగా మిగిలిన ముగ్గురిదీ అదేమాట. 'ఏంటి విషయం? అందరికీ కోటగారితో ఏం పని' అని అడిగారు. 'ఆయన డేట్లు కావాలండీ. కాల్షీట్లు ఎవరు చూస్తున్నారో అర్థం కావడంలేదు. అందుకే కలిసి వెళ్దామని వచ్చాం. బిజీగా ఉన్నట్టున్నారు. మేం మళ్ళీ వచ్చి కలుస్తాం' అని చెప్పి వెళ్ళారట. ఆ విషయం నాకు తర్వాత తెలిసింది. వాళ్ళు మర్నాడు రాలేదు. మూడో రోజు వచ్చి నన్ను కలిశారు. 'ఏం చేయాలి?' నాకేం తోచలేదు. కంగారుగా అనిపించింది. 'మీ డేట్లు కావాలండీ. ఎన్నాళ్ళిస్తారు? ఎప్పుడిస్తారు' అని అడిగారు. అంతమంది ఒకేసారి అడిగితే ఏం చెప్పాలో అర్థం కాలేదు. అప్పుడు దాసరిగారు ఓ సాయం చేశారు.

**(ఇంకావుంది)**

**-డా.చల్లా భాగ్యలక్ష్మి**
**సెల్: 88850 55528**

# వెట్టి (ది వారియర్)

-మధుబాబు




**ముఖాన్ని ముటముటలాడించుకుంటూ, దూరంగా కుర్చీలో కూర్చుని ఉన్న బాజిరెడ్డి వైపు చూసి, పమిటిచెంగును నోటికి అడ్డం పెట్టుకుని, పకపకా నవ్వింది శివారెడ్డి భార్య.**

**'దరిద్రుడికి మంచి శాస్తి జరిగింది. అసలు మన దగ్గర ఉద్యోగం వదులుకుని విదేశాలకు వెళ్ళిపొమ్మని చెప్పించినట్లయితే ఇంకా బాగుండేది' ఇరవై రెండు సెకన్ల తర్వాత బలవంతంగా నవ్వును ఆపుకుని చెప్పింది.**

'అంత పెద్దపెద్ద కోరికలు వద్దులే వదినమ్మ. ప్రస్తుతానికి ఇది చాలు. అన్నయ్య కోలుకుంటాడు' అంటూ వెట్టి వైపు తిరిగింది ప్రణవి.

'వాడు నిన్ను వదిలిపెట్టడు. కచ్చ కడతాడు. ఇవాళ కాకపోయినా రేపో ఎల్లుండో నీకు ఏదో ఎదురు దెబ్బ తగిలి తీరుతుంది' అన్నది.

'నోరు జాగ్రత్త ప్రణవీ. పైన తథాస్తు దేవతలు ఉంటారు' వెంటనే ఆమెను హెచ్చరించింది ప్రత్యూష.

మెడలో ఉండవలసిన స్టెతస్కోపు చేతిలోకి తీసుకుని, వడిశెల మాదిరి గిరగిరా తిప్పుతూ డాక్టరు అటుగా రావటంతో ఆగిపోయింది వారి సంభాషణ.

ప్లెజెంట్‌గా ఉన్న శివారెడ్డి భార్య మొఖంలో తిరిగి ప్రత్యక్షమైంది తీవ్రమైన ఆందోళన. 'డాక్టరుగారు... ఆయన' అని అడగబోతుండగా చేతిని ఎత్తి ఆపేశాడు ఆయన.

'నథింగ్ టు వర్రీ.. శివారెడ్డి సార్ పర్‌ఫెక్ట్లీ ఆల్ రైట్. ఇప్పుడు నేను ఏం చెప్పటానికి వచ్చానంటే...' అని మొదలుపెట్టి - అప్పటివరకూ దూరంగా కూర్చుని ఉన్న బాజిరెడ్డి గబగబా దగ్గరికి వచ్చేసరికి మాట ఆపేశాడు డాక్టరు.

'ఎలా ఉంది డాక్టరుగారు? పరిస్థితి ఏమిటి?' తనే అందరికంటే ఎక్కువగా ఫీలైపోతున్నట్టు మొఖం పెడుతూ అడిగాడు బాజిరెడ్డి.

'నువ్వు ఇంకా ఇక్కడే ఉన్నావేమిటి? అహోబిలం వెళ్ళి రమ్మని చెబితిని కదా... వెళ్ళవయ్యా.. వెళ్ళిరా.. బద్ధకించకు. మేము శరీరాలకు వచ్చిన జబ్బులకు మాత్రమే వైద్యం చేయగలం. ఆయుష్షుకు సంబంధించిన వైద్యం చేయగలిగింది ఆ దేవుడు ఒక్కడే. అర్థమైందా నా మాట?' కనులు చిట్లిస్తూ క్వశ్చన్ చేశాడు డాక్టరు.

### జరిగిన కథ

గూండా మురాలకు కనిపించకుండా తప్పించుకుతిరుగుతూ ఉంటాడు వెట్టి. నాగదేవతగా చెప్పుకుంటున్న ఒక అమ్మి వెట్టికి పరిచయమవుతుంది. వెట్టిని తన ఇంటికి తీసుకెళ్ళి ఆశ్రయమిస్తుంది. కదిరి ఎస్టేటుకు బయలుదేరివెళ్ళిన ఆమె కూతురు ప్రణవి వెంట సెక్యూరిటీగా వెళతాడు వెట్టి. వెట్టి అసలు పేరు విఠల్‌రెడ్డి. ఇంజనీరింగ్ ఫైనలియర్ స్టూడెంట్. కాలేజీలో ఆడపిల్లను అల్లరిచేయబోయిన బాజిరెడ్డి కొడుకు పఠాన్‌కు దేహశుద్ధి చేస్తాడు. అతడి మనుషుల నుండి తప్పించుకున్నాడు. కదిరి ఎస్టేటులో ప్రణవి వెంట కనిపించిన వెట్టిని ఎక్కడోచూసినట్టనిపిస్తుంది బాజిరెడ్డికి. కానీ గుర్తురాదు. ఇంతలో హార్ట్ ఎటాక్‌కు గురైన శివారెడ్డిని సకాలంలో హాస్పిటల్‌కు తరలించి వెట్టి అతన్ని కాపాడటం బాజిరెడ్డికి కంటగింపుగా మారతుంది. ఆ తర్వాత......

'ఒక్కసారి నేను లోపలికి పోయి...' అని మొదలు పెట్టిన బాజిరెడ్డి మీద విరుచుకుపడినంత పని కూడా చేశాడు.

'ఇందాక ఈ యంగ్‌మాన్ చెపితే నేను కూడా ఒక విధంగా లైట్ తీసుకున్నాను. ఇప్పుడు వచ్చిన ఈ ఎమర్జెన్సీకి నువ్వే కారణం అని నాకు ఇప్పుడు బాగా తెలుస్తోంది. శివారెడ్డి సారును టెన్షన్‌పెట్టే మాటల్ని నువ్వు మళ్ళీ రిపీట్ చేయబోతున్నావు. అందుకే ఎంతచెప్పినా నీ బుర్రకి ఎక్కటం లేదు' కోపంగా అన్నాడు.

'అబ్బెబ్బే... అటువంటిదేమీ లేదు. ఏదో ఆత్రుత కొద్దీ అడుగుతున్నాను. మీరు వద్దని చెప్పిన తర్వాత ఇంకోసారి ఎందుకు అడుగుతాను?' ఒక అడుగు వెనక్కివేసి చాలా వినయంగా అన్నాడు బాజిరెడ్డి.

'నర్సును పిలవండి శంకరయ్యగారూ' అన్నాడు డాక్టరు.

గబగబా పోయి ఐసీయూలో ఉన్న నర్సును అద్దంలోంచి సైగచేసి బయటికి పిలిచాడు శంకరయ్య.

'మన బాజిరెడ్డి సారుకు బయటి నుంచే శివారెడ్డి సారును చూపించి, వెంటనే ఇవతలకి పంపేయ్' ఆర్డర్ ఇచ్చాడు డాక్టరు.

కనుచివరల నుంచి వెట్టివైపు చూస్తూ ముందుకు పోయి, అద్దంలో నుంచి లోపలికి చూసి, వెంటనే వెనక్కి వచ్చాడు బాజిరెడ్డి.

'అయిపోయావు విఠల్‌బాబూ... నీ పని అయిపోయినట్టే! రెండు మూడు రోజుల దాకా ఆగడు. తెల్లారేసరికి నీకు ముహూర్తం పెట్టేస్తాడు' అతని మొఖంలోని భావాలను క్లోజ్‌గా పరిశీలించి చిన్నగా చెప్పింది ప్రణవి, అతనికి మాత్రమే వినిపించే టట్టు.

'నువ్వు ఊరుకో ప్రణవీ. వద్దన్నకొద్దీ మాట్లాడేస్తున్నావు. ఇవతల అటువంటి అవకాశం కోసమే ఎదురు చూస్తున్న సంగతి మర్చిపోతున్నావు' తను కూడా చిన్నగానే ఆమెను హెచ్చరించింది ప్రత్యూష.

'చూశావా? ఎలా ఉన్నాడు?' బాజిరెడ్డిని అడిగాడు ఆ సంభాషణ అర్థం కాని డాక్టరు. 'బాగానే ఉన్నాడు. అసలు గుండెనొప్పి వచ్చినట్టుగా లేనే లేదు. నిజంగానే వచ్చిందా?' అడిగాడు బాజిరెడ్డి.

డాక్టరు తన చేతిలో ఉన్న స్టెత్‌తో అతని మొఖం మీద కొడతాడేమోనన్న అనుమానం వెట్టికి కలిగింది, ఆయన ఫీలింగ్స్‌ని గమనించేసరికి.

అతను అనుమానపడినట్లు రియాక్ట్ అవలేదాయన. 'శివారెడ్డిసారుకు లేనిపోని రోగాల్ని అంటగట్టి ఆయన ఎస్టేట్‌ని దోచుకు తినాలనే కోరిక నాకు లేదు. నా మాటలు నమ్మటం నమ్మకపోవటం నీకు సంబంధించిన విషయం కాదు. మేడమ్‌గారు ఇక్కడే ఉన్నారు. ఆమె నమ్మటం నాకు ముఖ్యం' సీరియస్‌గా అన్నాడు.

'డాక్టరుగారూ.... మీరు వేరేగా అనుకోకండి. బాజిరెడ్డి ఏదో టెన్షన్‌లో ఉండి అలా మాట్లాడి ఉంటాడు. సరైన వైద్యం అందటం వల్లనే ఆయన హ్యాపీగా ఉన్నట్లు నేను భావిస్తున్నాను.' వెంటనే చెప్పింది శివారెడ్డి భార్య.

'అర్థమైంది తల్లీ... ఈ పెద్దమనిషి టెన్షన్ నాకు బాగా అర్థం అయింది. అందుకే దాన్ని నీ పెనిమిటికి కూడా అంటించవద్దని చెబుతున్నానంటూ బాజిరెడ్డివైపు తిరిగి నువ్వు నేను చెప్పినట్టు చెయ్యి. వారంలో శివారెడ్డిసారు పూర్తిగా కోలుకుంటాడు' అన్నాడు.

పళ్ళు బిగించి విసురుగా వెనక్కి వెళ్ళిపోయాడు బాజిరెడ్డి.

'తల్లీ... మీరందరూ ఇంటికిపోయి హాయిగా నిద్రలు పొండి. తెల్లవారగానే సారును ఇంటికి తీసుకుపోవచ్చు' అన్నాడు డాక్టరు.

వారమో, రెండు వారాలపాటో హాస్పిటల్లోనే ఉండవలసి వస్తుందని అనుకుంటున్న శివారెడ్డి భార్యకు



నోటి వెంట మాటలు రాలేదు. 'డాక్టరుగారూ... మీరు అంటున్నది' అంటూ ఆపైన ఏమని అడగాలో తెలియక ఆగిపోయాడు శంకరయ్య కూడా.

'నేను మీకు కాకమ్మ కథలు చెప్పటం లేదు. ఇక్కడికి తీసుకు వచ్చినప్పుడు ఆయన కండిషన్ సీరియస్.' ఒక్క గంటలో ఎవ్రీథింగ్ ఈజ్ నార్మల్. స్ట్రోక్ వచ్చిన లక్షణం ఒక్కటి కూడా కనిపించటం లేదు. గుండెకాయ హ్యాపీగా తన పని తాను చేసుకుపోతున్నది. ఏదేమైనా ఈ అబ్బి చెయ్యి చాలా మంచిచెయ్యి' వెట్టి భుజం తడుతూ మెచ్చుకున్నాడు డాక్టరు.

'ఎలా? ఎలా సాధ్యపడింది డాక్టరుగారు?' గొంతు పెగల్చుకుని అడిగింది శివారెడ్డి భార్య.

'పైన మనల్ని కనిపెట్టుకుంటూ ఉండేవాడు ఒకడు ఉన్న సంగతి మర్చిపోకు తల్లీ... బహుశా ఆయనే కల్పించుకుని పరిస్థితిని చక్కదిద్ది ఉంటాడు. అంతకు మించి నేను చెప్పగలిగింది ఏమీలేదు. వెళ్ళండి. రెస్టు తీసుకోండి' అంటూ అవతలికి వెళ్ళిపోయాడు డాక్టరు.

'నువ్వు చేసిన సాయం మేము మర్చిపోలేము' అంటూ తనవైపు తిరిగిన శివారెడ్డి భార్యకు, గబగబా నమస్కారం చేశాడు వెట్టి'. పెద్దపెద్ద మాటలు వద్దు తల్లీ.. అవసర సమయంలో ఉపయోగపడటం కోసమే జయమ్మ తల్లి నన్ను పంపించింది. ఇటువంటి ఎమర్జెన్సీలు వస్తాయని ఆమెకు ముందుగానే తెలిసింది కాబోలు..' అన్నాడు వెట్టి.

శివారెడ్డి భార్య మొఖం కొద్దిగా కళ తప్పటం కనిపించింది అతనికి. సంతోషించవలసిన మాటల్ని విని హాయిగా నిట్టూర్చకుండా ఆమె, వినకూడని మాటలు విన్నట్టు మొఖం పెట్టటం ఏమిటో తెలియలేదు అతనికి.

అయితే ఆ విషయం గురించి అతిగా ఆలోచించే అవకాశం అతనికి లభించలేదు. 'నేను ఇక్కడ ఉంటాను. నువ్వు పిల్లల్ని తీసుకుపోయి ఇంటి దగ్గర దింపి, వచ్చేటప్పుడు సంపంగిని వెంటబెట్టుకురా..' చెప్పింది ఆమె.

'అన్నయ్య, అన్నయ్యతోపాటు నువ్వు ఇక్కడ ఉన్నప్పుడు మేము ఆ ఇంట్లో హాయిగా నిద్రపోగలమని ఎలా అనుకుంటున్నావు వదినమ్మా? నీతోపాటు మేము కూడా ఇక్కడే..' అంటూ ప్రత్యూషవైపు తిరిగింది ప్రణవి. 'ఏమంటావు?' అని అడిగింది.

'సరిగ్గా చెప్పావు. అందరూ ఇక్కడే... పదండి' అంటూ తను శివారెడ్డి భార్య చేయిపట్టుకుని ఖాళీగా ఉన్న కుర్చీల దగ్గరికి నడిపించింది ప్రత్యూష.

హాస్పిటల్లో ఉన్న పేషంట్స్ తాలూకు బంధువులు చాలామంది ఉన్నారు విజిటర్స్ హాల్లో. శివారెడ్డి భార్యను చూడగానే గబగబా లేచి నమస్కారాలు చేశారు. నిద్రలు పోకుండా మెలకువగా ఉన్నారందరూ.

'మనం ఇక్కడే ఉంటే వాళ్ళందరూ ఇలా నమస్కారాలు పెడుతూనే ఉంటారు. సుఖంగా కూర్చోరు. మనల్ని కూర్చోనీయరు... ఎలా?" సగం నిద్రలో నుంచి లేచి, తను లేవగానే హడావుడిగా నిలబడుతున్న మరికొంతమందిని చూస్తూ చిన్నగా చెప్పింది శివారెడ్డి భార్య.

'ప్రత్యూషా, ఒకసారి నాతో వస్తావా?' అని ఆమెను అడుగుతూ సమాధానం కోసం ఎదురు చూడకుండా ముందుకు కదిలాడు వెట్టి.

'వెళ్ళు.. ఎందుకు రమ్మంటున్నాడో.. ఏదో కారణం ఉండే ఉంటుంది' తనవైపు చూసిన ప్రత్యూషకి చెప్పింది ప్రణవి.

నైట్‌డ్యూటీ చేసే స్టాఫ్‌ని గమనించుకోవటం కోసం ఒక పెద్దావిడ ఆ హాలు చివరి భాగంలో కూర్చుని కునికిపాట్లు పడుతోంది.

'నేను పిలిస్తే కంగారుపడి కేకలు పెడుతుంది. నువ్వు నెమ్మదిగా నిద్రలేపు' ప్రత్యూషకి చెప్పాడు వెట్టి.

దగ్గరికిపోయి చిన్నగా భుజం తట్టింది ఆమె. అదిరిపడి లేచిన ఆమెకు వెట్టిని చూపించి 'ఏదో చెప్పాలనుకుంటున్నాడు, వినండి' అన్నది.

'అమ్మా.... శివారెడ్డి సారు భార్య అందరితోపాటు ఆ కుర్చీల్లో కూర్చోవటం ఇబ్బందిగా ఉంది. ఖాళీగా ఉన్న గది ఏదైనా ఇప్పించండి. అవసరం అయితే మీరు కేకపెట్టిన వెంటనే ఖాళీచేసి అప్పగించేస్తాము' వినయంగా అన్నాడు అతను.

అటువంటి మాట ఇతర పేషంట్స్‌కి సంబంధించిన వాళ్ళు ఎవరైనా మాట్లాడి ఉంటే హాస్పిటల్ దద్దరిల్లిపోయేటట్లు అరిచి కేకలుపెట్టి ఉండేదేమో గాని, శివారెడ్డి పేరును విన్నవెంటనే తల ఊపేసింది ఆమె.

'ఇక్కడే ఉంది. కాకపోతే కొంచెం అపరిశుభ్రంగా ఉంటుంది' అంటూ తను కూర్చున్న చోటికి పది అడుగుల దూరంలోనే ఉన్న ఒక గది దగ్గరికి వారిని తీసుకుపోయి తలుపులు తెరిచింది.

'ఫ్యాన్ వేయి ప్రత్యూష... లైటుకూడా' అంటూ ఆమెకి చెప్పి, వెనక్కి తిరిగి చేయి ఊపాడు వెట్టి.

శివారెడ్డి భార్య అక్కడికి వచ్చే సమయానికి గదిలో కాపురం చేస్తున్న స్టేవ్ ఎయిర్ అంతా బయటికి వెళ్ళిపోయింది.

**బాజిరెడ్డికి వెట్టి చేతిలో అవమానం ఎదురైంది. పైగా డాక్టర్ కూడా అతగాణ్ణి పేషంట్ రూమ్‌లోకి వెళ్ళనీయలేదు. తట్టుకోలేకపోయాడు బాజిరెడ్డి. తన కొడుకు పఠాన్‌ను, గూండాలను హాస్పిటల్ వెలుపల సిద్ధంగా ఉంచాడు. వెట్టి బైటకు రాగానే అతణ్ణి మట్టుపెట్టాలని వారి ప్లాన్. కానీ వెట్టి హాస్పిటల్ లోపల లేడు. మరి ఎక్కడ ఉన్నాడు? పఠాన్ అతణ్ణి మట్టుపెట్టాడా?**

'మీరు బెడ్‌మీద పడుకోండి తల్లీ. మేము ఎక్కడో ఒకచోట సర్దుకుంటాం' అంటున్న శంకరయ్యని చూసి నవ్వింది శివారెడ్డి భార్య.

'మీరిద్దరూ పోయి ఆ కుర్చీల్లోనే కూర్చోండి. ఆడవాళ్ళం మేము బెడ్‌మీద సర్దుకుంటాం' అన్నది.

పద అబ్బయ్యా. నిన్ను నన్ను చూసి మొఖాలు ముడుచుకునే వాళ్ళే గాని, లేచి నిలబడి నమస్కారాలు పెట్టేవాళ్ళు ఎవరూ లేరు. మనకేమీ పరవా లేదు' అంటూ వెట్టి చేయిపట్టుకుని తిరిగి వెయిటింగ్ ప్లేస్‌కి తీసుకువచ్చాడు శంకరయ్య.

'మంచి రసపట్టులో ఉండగా ఆగిపోయింది నీ కథ. ఆ తర్వాత ఏమైందో తెలుసుకోవాలని ఉన్నది గాని, ప్రణవమ్మ తనకంటే ముందుగా విన్నందుకు, నా పీక పిసికేస్తుందని భయంగా ఉంది' ఖాళీగా ఉన్న కుర్చీలో కూర్చుని ఇంకో కుర్చీ మీదికి కాళ్ళు జాపుతూ అన్నాడు శంకరయ్య.

"బాజిరెడ్డి మాటల్ని శివారెడ్డి ఎందుకు కాదనలేకపోతున్నాడు? కాదని అంటే అతను ఎస్టేటును వదిలి వెళ్ళిపోతాడని భయమా?' ఉన్నట్లుండి అడిగాడు వెట్టి.

'నిజం చెపుతాను... నువ్వు నమ్ముతావా?' అడిగాడు శంకరయ్య.

'భలేమాట అడిగారు. మీరుచెప్పిన తర్వాత నమ్మకపోవటం ఏమిటి? నిజం చెపుతారనే కదా అడిగింది' ఆశ్చర్యంగా అన్నాడు వెట్టి.

భుజం మీది కండువాతో మొఖం తుడుచుకుంటూ చుట్టూ చూశాడు శంకరయ్య. తమ మాటల్ని వినేవాళ్ళు ఎవరూ దగ్గర్లో లేరని నిశ్చయం చేసుకోవటానికి అలా చూస్తున్నాడని అనుకుని, ఊపిరి బిగపట్టాడు వెట్టి.

'శివారెడ్డి పెద్దవాడై ఎస్టేట్ వ్యవహారాలు చూసుకోవటం మొదలుపెట్టినప్పటి నుంచీ నేను కూడా నువ్వు అడిగిన ప్రశ్ననే కొన్ని వేలసార్లు నన్ను నేను అడుగుకుంటూ వస్తున్నాను. ఇప్పటివరకూ సమాధానం లభించలేదు. నీకు ఎంత తెలుసో నాకు కూడా అంతే తెలుసు' అన్నాడు శంకరయ్య.

అతను దిక్కులు పిక్కటిల్లే సమాధానం ఏదో చెపుతాడని ఊపిరి బిగపట్టి చెవులు రిక్కించిన వెట్టికి నవ్వు ఆగలేదు.

'భలేగా చెప్పారు శంకరయ్య. చాలా బాగుంది' అంటూ నెమ్మదిగా కుర్చీలో నుంచి లేచాడు.

'ఎక్కడికి అబ్బయ్యా?' ఆశ్చర్యంగా అడిగాడు శంకరయ్య.

'హాస్పిటల్ వాసన భరించటం నాకు చేతకావటం లేదు. కాసేపు బయటికిపోయి, ప్రశాంతంగా గాలి పీల్చుకు వస్తాను. అవసరం అయితే



# ఇంకా ఆ వయసురాలేదట!



**హ**న్సికా మెత్వానీ... దాదాపు దశాబ్దం పైగా
సినిమాల్లో ఉన్న హీరోయిన్. సినిమాల్లోకి వచ్చి
చాలాకాలమే అయినా, మిగతావారితో పోల్చు
కుంటే తను చిన్నదాన్నని చెప్పుకొచ్చింది హన్సిక.
పెళ్ళి వయసు ఇంకా రాలేదనీ, నటన, తన
పిల్లలు తనకు రెండు కళ్ళనీ వారిని చూసుకోవ
డానికే సమయం సరిపోవడం లేదనీ అంటోంది.
మరో ఐదారేళ్ళు సినిమాలు చేసిన తరువాత
పెళ్ళి చేసుకుంటానని చెబుతోంది. అప్పుడు
కుటుంబం ఒక కన్ను, దత్తత పిల్లలు మరో
కన్ను అవుతారని వివరించింది. ప్రేమ ఎంత
మధురమైనా తనకు మాత్రం చేదునే అందిం
చిందనీ, అందుకే ఈసారి అమ్మ చెప్పిన అబ్బా
యినే మనువాడతానని స్పష్టం చేసింది.

గుమ్మం దగ్గరికి వచ్చి చేయి ఊపండి. పరిగెత్తు
కుంటూ వచ్చేస్తాను' అంటూ బైటికి బయలు
దేరాడు వెట్టి.

'జాగ్రత్త అబ్బయ్యో! బాజిరెడ్డిని గురించి మర్చి
పోకు' అంటూ హెచ్చరించి కుర్చీ వెనక్కి వాలి
కనులు మూసుకున్నాడు శంకరయ్య.

ప్యాంటు జేబులో చేతులు పెట్టుకున్నాడు వెట్టి.
వెంటనే అతని చేతికి తగిలాయి పెళపెళలాడు
తున్న మందపాటి కరెన్సీనోట్లు. ఆ రోజు ఉదయం
ఎస్టేటుకు వచ్చీ రావడంతోటే, 'ప్రణవి నీకు ఇవ్వ
మని చెప్పింది. నీ దగ్గర చిల్లికాణీ కూడా లేదని
జయమ్మగారు చెప్పారట' అంటూ ఒక నోట్ల పొత్తి
కను అతనికి అందించింది ప్రత్యూష.

అందరి చూపులు తమమీద, ముఖ్యంగా తన
మీద ఉండడంతో ఎదురు చెప్పలేదతను. కామ్‌గా
జేబులోకి నెట్టేశాడు. ఆ తరువాత ఆ విషయం
గురించి పూర్తిగా మర్చిపోయాడు.

ఇప్పుడు ఆ పొత్తికను బైటికి తీసి ఎంత
ఎమౌంటు ఉన్నదో చూడాలని అనిపించినా, మెయిన్
గేటు దగ్గర సెక్యూరిటీవాళ్ళు కళ్ళు చిట్లించి చూస్తూ
ఉండటంతో ఆ పని చేయలేక పోయాడు.

'రాత్రిపూట లోపల్నించి ఎవరినీ బయటికి పోని
య్యము సారూ. తెల్లవారిన తర్వాతనే పోవటం'
అతను రోడ్డుమీదికి పోయే ఆలోచన చేస్తున్నాడని
గ్రహించి వెంటనే అడ్డుకున్నాడు ఒక గార్డు.

'ఇందాక బాజిరెడ్డి సారు బైటికి పోయాడు. ఆప
లేదెందుకని?' నవ్వుతూ అడిగాడు వెట్టి.

'ఆయన బాజిరెడ్డి సారు గనక ఆపలేదు.'

'నేను కూడా అంతే. శివారెడ్డి సారు మనిషిని....
ఆగిపొమ్మంటారా?'

తికమక పడిపోయాడు ఆ గార్డు. ఏమని సమా
ధానం చెప్పాలో తెలియక అయోమయంగా చూశాడు.

'నువ్వు కంగారుపడాల్సిన అవసరం లేదు. నేను
పేషంట్‌ని కాదు. ఫీజులు కట్టకుండా పారిపోవటం
లేదు. లోపల కూర్చోవటం ఇబ్బందిగా ఉండి
కాసేపు బయట తిరగటానికి వచ్చాను. పది నిమి
షాల్లో వచ్చేస్తాను' అంటూ అతని సమాధానం కోసం
ఎదురు చూడకుండా రోడ్డుమీదికి పోయాడు వెట్టి.

నర్సింగ్‌హోమ్‌కి వంద గజాల దూరంలో అత
నికి కనిపించింది ఒక చిన్న దుకాణం. చిన్న చెక్క
బల్ల మీద కూర్చుని కునికిపాట్లు పడుతున్నాడు,
ఆ దుకాణాన్ని రన్‌చేసే మనిషి.

'అర్ధరాత్రి దాటిపోయింది. హాస్పిటల్ గేట్లు
మూసి ఎవరినీ బైటికి రానీయటం లేదు. రోడ్డు
మీద పిట్ట కూడా కనిపించటం లేదు. ఇంకా తెరిచి
పెట్టుకోవటం దేనికి?' తనను గమనించి లేచి నిల
బడిన అతన్ని అడిగాడు వెట్టి.

'అనంతపురం నుంచి లారీలు వస్తూ ఉంటయ్యి
అబ్బయ్యా. మంచి మంచి బేరాలు తగుల్తాయ్.
అందుకే ఈ పాట్లు' అంటూ ప్రశ్నార్థకంగా కనులు
ఎగరవేశాడు.

ఆ సమయంలో ఒక సిగరెట్టు అడిగితే, మంచి
నిద్ర చెడగొట్టినందుకు తిట్లు మొదలు పెడతా
డన్న అనుమానం కలిగి, ఒక పాకెట్‌ని, అగ్గిపెట్టెని
అడిగి తీసుకున్నాడు వెట్టి. ఒక కరెన్సీ నోటును
అందించి సిగరెట్ వెలిగించుకున్నాడు.

'హాస్పిటల్‌కి వచ్చి ఉండావా? ఏంటి ప్రాబ్లెము?'
చనువుగా అడిగాడు అతను చిల్లర తిరిగి ఇస్తూ.

'గుర్తుచేయకు పెద్దయ్యా. గుండెలు పట్టుకుపో
తయ్. కాసేపు ఈడ కూర్చోవచ్చునా?' దుకాణం
వెలుపల ఉన్న చెక్కబల్లవంటి నాపరాయి అరేంజ్
మెంట్ వైపు కదులుతూ అడిగాడు వెట్టి.

'అందుకే కదా ఆ రాయి. కూర్చో... ఇంకేమైనా
కావాలంటే అడుగు' అంటూ తిరిగి కునికిపాట్లు
పడటం మొదలు పెట్టాడు దుకాణం మనిషి.

నాపరాయి మీద సర్దుకు కూర్చుని సిగరెట్
పొగని గుండెలనిండా పీల్చుకుని, నెమ్మదిగా బయ
టికి వదులుతూ పక్కకి చూశాడు వెట్టి.

చూసిన మరుక్షణం దారుణమైన చలిగాలి వీచి
నట్లు జలదరించింది అతని శరీరం. చేతులమీది
రోమాలు వాటంతట అవే నిక్కబొడుచుకుంటున్న
సెన్సేషన్ కలిగింది.

నాపరాయికి పది అడుగుల దూరంలో, దుకాణం
పక్కనే ఉంది కరెంటు స్తంభం. దేదీప్యమానంగా
వెలుగుతున్నది స్తంభం మీది ట్యూబ్‌లైటు.

ఆ వెలుగుపడి నిగనిగ మెరిసిపోతున్నది రెండు
బారులకు పైగానే పొడవు ఉన్న తాచుపాము.
చుట్టలు చుట్టుకుని ఉంది. పడగ పైకెత్తి అతని
వైపే నిశితంగా చూస్తోంది.

ఎండుకు పోయినట్లు తయారయింది వెట్టి
గొంతు. ఐసీయూలో ఉన్న శివారెడ్డికి మళ్ళీ ఏదైనా
ప్రాబ్లమ్ వచ్చి ఉంటుందేమోనన్న భయం ఒక్క
క్షణంపాటు అతన్ని కంగారు పెట్టేసింది.

'తనకు తెలియకుండానే తలతిప్పి హాస్పిటల్
ఎంట్రన్స్ వైపు చూశాడు. సెక్యూరిటీ జనం తప్ప
మరెవ్వరూ కనిపించలేదతనికి.

పెదవుల మధ్యన ఉన్న సిగరెట్ తీసి కింద పడవేస్తూ
మరింత పరిశీలనగా చూశాడు ఆ పన్నగం వంక.

అంతకుముందు అవుట్‌హౌస్‌లో కనిపించినప్పుడు
ఆ పాము కదలికల్లో ఒక విధమైన అర్జెన్సీ కనిపించింది.
సిచ్యుయేషన్ వెరీ సీరియస్‌గా ఉన్నట్లు పడగను
విదిలించి పూత్కారం కూడా చేసిందా పాము.

ఇప్పుడు కనిపిస్తున్న పాములో ఆ తొందర
పాటు అగుపించటం లేదు. గాదిమీద గింజల వంటి
కనులతో స్టడీగా అతన్నే చూస్తున్నది.

'నా తల్లి గనుక ఇప్పుడు ఇక్కడ ఉండి ఉంటే నీ
చూపులకు ఏదో ఒక అర్థాన్ని తప్పకుండా విడమరిచి
చెప్పేది. తను ఇక్కడ లేదు. నాకు నీ భాష రాదు.
ఏం చేయాలో తెలియడం లేదు' తనలో తను అను
కుంటూ నాపరాయి మీది నుంచి లేచి నిలబడ్డాడు.

వెంటనే పైకెత్తి ఉంచిన పడగను కిందికి దించే
సిందా పాము. పాదరసం జారినట్టు సుతిమెత్తగా
జరుగుతూ దుకాణం వెనక భాగంలో ఉన్న ప్రహరీ
గోడ దగ్గరికి పోయి మటుమాయం అయిపోయింది.

సిగరెట్ ప్యాకెట్‌ని, అగ్గిపెట్టెని నాపరాయిమీద
పెట్టాడు, కూర్చునేటప్పుడు. వాటిని అందుకుని ప్యాంటు
జేబులోకి నెట్టుకుంటూ ఉండగా, దూరంలో నుంచి
కనిపించింది వేగంగా వస్తున్న కారు ఒకటి.

తనవైపు వేగంగా వచ్చే వెహికల్స్‌ని, మను
ష్యుల్ని చూసిన మరుక్షణం పక్కకు తప్పుకోవటానికి
బాగా అలవాటుపడి ఉండటం వల్ల, తనకు తెలియ
కుండానే దుకాణం పక్కభాగంలోకి జరిగి, నీడలో
నిలుచుండి పోయాడు అతను.

స్పీడ్‌గా వచ్చి దుమ్ముతెరలు రేపుతూ సరిగ్గా
దుకాణం దగ్గిరే ఆగింది ఒక కారు. స్టీరింగ్ ముందు
నుంచి దిగి, వెనుక డోర్‌ని తెరిచిపట్టుకున్నాడు డ్రైవర్.

శివారెడ్డిని హాస్పిటల్‌కి తీసుకు వస్తున్నప్పుడు
తమ కారుకు అడ్డం పడబోయి, అవతలికి దూకిన
మనిషే అతను. బాజిరెడ్డి డ్రైవర్!

అతను తెరిచిన డోర్‌ని తన ఎడమ పాదంతో
మరింత విశాలంగా తెరుచుకునేటట్టు నెట్టి, కిందికి
దిగాడు పఠాన్.

బిగుసుకున్నాయి వెట్టి పిడికిళ్ళు. ఎర్రబడి
పోయాయి కనుకొలకులు. ఎగిరి ముందుకు దూకి,
అతనిమీద కలబడాలన్న కోరిక సుడిగాలి మాదిరి
చుట్టుముట్టింది అతన్ని.

వివేకం వెన్నుతట్టి హెచ్చరించింది. అప్పుడు గనుక
తను బయటపడటం జరిగితే తెల్లవారే సమయాని
కల్లా గువ్వలగుట్ట గ్రానైట్‌మైన్స్ వాళ్ళకి చేరి
పోతుంది తన ఆచూకీ. మరోసారి ప్రాణాలు కాపాడు
కోవటానికి తను మళ్ళీ పరుగులు పెట్టాల్సిన పరి
స్థితి వచ్చేస్తుంది.

పఠాన్ ఒక్కడినే అయితే ఏదైనా చేయగలడు తను.
బాజిరెడ్డిని ఏదైనా చేసే వ్యవధి తనకు లభించకపోవచ్చు.

విల్‌పవర్‌నంతా కూడగట్టుకుని తనలో అడుగు
పెట్టిన ఆవేశం అణచుకున్నాడు వెట్టి.

ఆవేశం మాయం అయిన వెంటనే మొదలైంది

ఆలోచన. ఇంత రాత్రివేళ ఈ పఠాన్‌గాడు ఎందుకు వచ్చినట్టు?

'రేయ్... నిద్ర మొఖమా? బాజిరెడ్డిసార్ కొడుకు పఠాన్‌బాబు వచ్చి నీ దుకాణం ముందు నిలబడటం కనిపించలేదా? లేవరా... లేచి ఏం కావాలని అడగవేంటి?' కునికిపాట్లు పడుతున్న దుకాణం యజమానిని బిగ్గరగా అరిచి నిద్రలేపాడు డ్రైవర్.

హడావుడిగా లేచి దుకాణం వెలుపలికి వచ్చాడు యజమాని. 'క్షమించాలయ్యా.. నిద్రకు ఆగలేక పోయా. ఏం కావాలో చెప్పండయ్యా' చేతులు కట్టుకుని వినయంగా అడిగాడు.

'చలిచలిగా ఉంది. హాట్‌హాట్ డ్రింకు ఏదైనా ఉందా?' నడుముమీద చేతులు వేసుకుని చుట్టూ చూస్తూ అడిగాడు పఠాన్.

'అయ్యా.... క్షమించాలి. కూల్‌డ్రింకులుతప్ప వేరే ఏమీ లేవు. మంచి టీ పెట్టి ఇద్దామన్నా ఇంకా తెల్లవారలేదు. తెల్లారితేగాని పాలు రావు' నెమ్మదిగా చెప్పాడు దుకాణం యజమాని.

'సిగరెట్ పాకెట్ ఇవ్వు. మా డ్రైవర్‌కి కూల్‌డ్రింకు ఇవ్వు' ఆర్డర్ వేశాడు పఠాన్.

రెండు క్షణాల్లో ఆ పనులు పూర్తిచేశాడు దుకాణం యజమాని. తనకు రావాల్సిన ఎమౌంట్‌ని వెల్లడించాడు.

'రేపు మా ఆఫీసుకు వచ్చి తీసుకో' అంటూ సిగరెట్ వెలిగించుకుని కారుకు అవతలివైపుకు పోయి నిలబడ్డాడు పఠాన్.

బిక్కమొహం వేసిన దుకాణం యజమానివైపు వెక్కిరింపుగా చూస్తూ, తను తాగిన కూల్‌డ్రింకు బాటిల్‌ని అవతల పెట్టలేదు డ్రైవర్. అతనిచేతికి కూడా అందివ్వలేదు. చటుక్కున కిందికి వదిలేశాడు.

కాళ్ళకింద ఉన్న నేల మెత్తమెత్తగా ఉండటం వల్ల, పగిలిపోకుండా ఆగిందా బాటిల్.

'నాక్కూడా ఒక సిగరెట్ పాకెట్ ఇవ్వు' అంటూ కౌంటర్ మీద ఉన్న వాటిల్లో నుంచి చాలా చొరవగా ఒక సిగరెట్ పాకెట్‌ని తీసుకుని కారు దగ్గరికి వెళ్ళాడు డ్రైవర్.

మరింతగా చిన్నబోయింది దుకాణం యజమాని మొఖం. తనలో తను ఏదో గొణుక్కుంటూ గబుక్కున దుకాణం తలుపులు మూసేశాడు చకచకా తాళాలువేసి, వెనుతిరిగి కూడా చూడకుండా వెళ్ళిపోయాడు అక్కడినుంచి.

పూర్తిగా కాలిన సిగరెట్‌ని అవతలికి విసిరికొట్టి, అంతకుముందు వెట్టి కూర్చున్న నాపరాయి దగ్గరికి వచ్చి, కాలుమీద కాలు వేసుక్కూర్చున్నాడు పఠాన్.




'కారులో కూర్చోండి బాబూ... బైట చలి.... దోమలు' అన్నాడు డ్రైవర్.

'చిటికెలో వచ్చేస్తామని చెప్పారు. ఇంకా రాలేదేంటి? ఎందుకింత ఆలస్యం?' అతని మాటలు తనకు వినబడనట్లు అడిగాడు పఠాన్.

'వచ్చేస్తూ ఉంటారు బాబూ. నాన్నగారు ఆర్డర్ ఇచ్చిన తర్వాత ఆలస్యం చేస్తే ఏమవుతుందో వాళ్ళకి బాగా తెలుసు' చెప్పాడు డ్రైవర్.

మరోసారి ఝల్లుమన్నది నీడలో నిలబడి ఉన్న వెట్టి శరీరం. కొంపతీసి వాళ్ళు గువ్వలగుట్ట జనాన్ని పోగు చేయటం లేదు కదా!

నిలుచున్న చోటినుంచి వెనక్కివెనక్కి జరిగి, ఎటైనా జంప్ అయిపోవటమే బాగుంటుందని అనుకుంటూ ఉండగా, దుమ్ము తెరలు రేపుతూ రానే వచ్చింది మరో కారు.

తలుపులు తెరచుకుని బిలబిలలాడుతూ బయటికి వచ్చారు అరడజనుమంది జనం. నాపరాయి మీద కూర్చునివున్న పఠాన్‌కి నమస్కారం చేసి చేతులు కట్టుకుని నిలుచున్నారు.

'తెల్లారేవరకూ ఇక్కడే ఉండండి. వాడు హాస్పిటల్లో నుంచి బైటికి వస్తాడు. వచ్చినవెంటనే ఏదో ఒక విధంగా పోట్లాట పెట్టుకుని చితక బాదేయండి' చెప్పాడు పఠాన్.

'నాన్నగారు చెప్పారు బాబూ... కాని ఆడితో పాటు శివారెడ్డిసారు భార్యగారు కూడా ఉంటారు. మరి ఎలాగ?' అడిగాడు వారిలో ఒకతను.

'ఆవిడను చూసి ఆగవలసింది మేము. మీరు కాదు. మీకు అవన్నీ అనవసరం. వాడిని చితక్కొట్టి మీ దారిన మీరు వెళ్ళిపొండి. మిగిలిన విషయాలు నాన్నగారు చూసుకుంటారు' అన్నాడు పఠాన్.

'ఆడు ఎవరో మేము తెలుసుకోవటం ఎలా??' అడిగాడు మరో వ్యక్తి.

'శంకరయ్య తెలుసుగదా..' అడిగాడు పఠాన్.

'తెలుసు బాబు.. చూశాము గాని పరిచయం లేదు.'

'అదే మాకు కావాల్సింది. శివారెడ్డిసారు భార్యతో పాటు గాని, శంకరయ్యతో పాటు గాని నా వయసోడు ఎవడు కనిపించినా ముందు కిందపడేసి బాదేయండి'.

'ఇంత గొడవ దేనికి బాబూ? మీ డ్రైవర్‌ని పంపించి ఒకసారి అతన్ని మాకు చూపిస్తే బాగుంటుంది కదా..'

'ఓరి నీ... ఈ పని మేము చేసినట్టు ఎవరికీ అనుమానం రాకూడదు. మా డ్రైవర్‌ని చూస్తే వాడు అనుమానించవచ్చు. ఎందుకు రిస్కు?' ఈ మాత్రం పని చేయటం మీకు చేతకాదా?' అడిగాడు పఠాన్.

'సరే బాబూ... అలాగే చేస్తాం. మీరు వెళ్ళిరండి. తెల్లారి పని పూర్తి అయిపోగానే కబురెట్టి, మేము మా ఊరెళ్ళిపోతాము' అన్నాడు మొదటి మనిషి.

నాపరాయి మీది నుంచి లేచాడు పఠాన్. 'మా నాన్నగారిని గోడకేసి నెట్టినందుకు వాడిని నేనే చావకొట్టి నడిరోడ్డు మీద పారేయాలి. కాని అవతల నాకు కాబోయే పెళ్ళాం ఒకటి ఉంది. అది చూస్తుండగా నేను చేతులు మట్టి చేసుకోకూడదు. అందుకే నాన్నగారు మీకు కబురు పంపారు. జాగ్రత్తగా, చక్కగా పని పూర్తి చేయండి' అంటూ తన కార్లో కూర్చున్నాడు పఠాన్.

స్టార్ట్‌చేశాడు డ్రైవర్. వేగంగా వచ్చిన దారిలోనే తీసుకుపోయాడు వెనక్కి తిప్పి.

'తెల్లారటానికి ఇంకా చాలా టైము ఉంది. కూర్చోండిరా. డిక్కీలో మూడు బాటిల్స్ ఉన్నాయి. తీసుకురండి' ఆర్డర్ ఇచ్చాడు అక్కడే ఉండిపోయిన మనుష్యులకు నాయకుడి మాదిరి కనిపిస్తున్న వ్యక్తి.

ఊపిరి బిగపట్టి నిలబడి ఉన్న వెట్టికి ఆ తర్వాత తను చేయవలసింది ఏమిటో తెలిసిపోయింది.

నెమ్మదిగా కిందికివంగి తను నిలబడిన ప్రదేశంలో నేలను తడిమాడు. అర నిమిషం తరువాత చేతికి తగిలింది, క్రికెట్ బాల్ సైజులో ఉన్న కంకర రాయి ఒకటి. గుండెల నిండా ఊపిరి పీల్చుకుని బలంగా పైకి విసిరాడు.

గింగిరాలు తిరుగుతూ పోయి, దేదీప్యమానంగా వెలుగుతున్న ట్యూబ్‌లైట్‌కు తగిలింది అది.

ఫట్‌మని వినవచ్చింది శబ్దం. కన్ను పొడుచుకున్నా ఏమీ కనిపించని కటిక చీకటి ఆ ప్రదేశాన్ని ఆవరించుకున్నది.

ముక్కలు ముక్కలైన ట్యూబ్‌లైటు అవశేషాలు చెల్లాచెదురై వాటిలో కొన్ని తమ తలల మీద కూడా పడడంతో, అదిరిపడి తలలు పైకెత్తి చూడటం మొదలు పెట్టారు ఆ మనుష్యులు.

ట్యూబ్‌లైటు పగిలిపోయి, చీకటి ప్రత్యక్షం అయిన తరువాత క్షణం కూడా ఆలస్యం చేయలేదు వెట్టి. రాక్షసుడి మాదిరిపోయి వారి మధ్యలో దూరాడు.

'ఎవరు? ఏమిటి? ఏమైంది??' కంగారుగా అరుస్తూ, తమమీదికి వచ్చింది ఎవరో తెలుసుకునే ప్రయత్నం చేశారు వాళ్ళు.

ఆ అవకాశం వారికి లభించలేదు. మధ్యకు పోయిన రెండో క్షణంలో నాశిక మీద బలమైన దెబ్బ పడటంతో, నాశిక ఎముక విరిగి ఎర్రటి రక్తం వెల్లువలా బైటికి వచ్చేస్తూ ఉండడంతో, అవతలికి పరుగు తీశాడు ఒక మనిషి. గుండెలమీద కాంక్రీట్ దిమ్మ ఏదో వచ్చి పడినట్టు ఊపిరి ఆగి, నేలమీద చతికిలబడిపోయాడు మరో మనిషి.

ఇంకో మనిషి మోకాలిమీద తన ఎడమ పాదంతో బలంగా అదిమాడు వెట్టి. పుటుక్కుమని శబ్దం చేస్తూ విరిగి పోయింది ఎముక. బాధను భరించటం అసాధ్యమై గావుకేక పెట్టి కింద కూర్చుండి పోయాడతను.

అంతే... అతివేగంగా దిగజారిపోయింది మిగిలిన ముగ్గురి ధైర్యం. కూడబలుక్కున్నట్టు ఒకేసారి అవతలికి దూకి పరుగు మొదలుపెట్టారు వాళ్ళు.

**(ఇంకావుంది)**

## సైనస్ సమస్య మళ్లీ రాదు

**ముక్కు** కళ్ల చుట్టూ నాలుగు గదులుంటాయి. వాటిని సైనస్‌లు అంటారు. ఈ సైనస్‌లలో వైరల్, బాక్టీరియా, ఫంగల్ ఇన్‌ఫెక్షన్ కారణంగా విపరీతమైన నొప్పి పుడితే దాన్ని సైనసైటిస్ అంటారు.

**కారణాలు :** సైనస్ ముఖద్వారం మూసుకుపోతుంది లేదా అక్కడ చాలా మ్యూకస్ పేరుకుపోతుంది. ఫలితంగా అక్కడ బాక్టీరియా, ఇతర క్రిములు సులభంగా పెరిగి సైనసైటిస్ సమస్య మొదలవుతుంది. శ్వాసకోశ మార్గానికి ఇన్‌ఫెక్షన్ రావటం వల్ల సైనస్‌లకు బాక్టీరియా ఇన్‌ఫెక్షన్ వస్తుంది. ఫలితంగా సైనసైటిస్ మొదలవుతుంది.

**గుర్తించటం సులభం :** తరచు జలుబు చేయడం, జలుబుతో ఎక్కువ రోజులు బాధపడటం అనేది సైనస్ వ్యాధి ప్రాథమిక లక్షణం. ఆ తరువాత దశలో జలుబు చేసినపుడు ముక్కులు బిగదీసుకుపోతాయి. తల అంతా బరువుగా ఉంటుంది. ఆ పైన ముక్కు నుంచి పసుపు పచ్చని, ఆకుపచ్చని ద్రవాలు రావడం మొదలవుతుంది. తీవ్రమైన తలనొప్పి, దగ్గు, శ్వాస దుర్గంధంతో కూడి ఉండటం కూడా జరుగుతుంది. ముఖంలో వాపు కనిపిస్తుంది. గొంతు మంటగా, నోరంతా చేదుగా మారుతుంది.

**సర్జరీ అవసరం లేదు :** హోమియోపతి చికిత్స వల్ల సర్జరీ అవసరం లేకుండానే సైనసైటిస్‌ను సమూలంగా తగ్గించుకోవచ్చు. హోమియో మందుల్లో ఎటువంటి దుష్ప్రభావాలు ఉండవు. ఇతర చికిత్సల వల్ల తాత్కాలిక ఉపశమనం కలుగుతుందే తప్ప శాశ్వత పరిష్కారం లభించదు. కానీ హోమియో చికిత్సతో సమస్య సమూలంగా తొలగిపోతుంది.

## హెపటైటిస్, హెర్పిస్‌కు చెక్ సాధ్యమే

**హెపటైటిస్** వైరస్ ఎప్పుడైతే కాలేయంపై దాడి చేస్తుందో అప్పుడు లక్షణాలు బయటపడతాయి. అంతవరకు ఇది సోకిన విషయం తెలియదు. హెపటైటిస్ వైరస్ శరీరంలోకి ప్రవేశించిన వెంటనే లక్షణాలు బయటపడవు. రోగలక్షణాలు కనిపించడానికి చాలా ఏళ్లు పడుతుంది. కొంతమందిలో వైరస్ సోకిన 4 వారాలు లేదా 12 వారాల తరువాత కొన్ని రోగలక్షణాలు బయటపడతాయి. ఆకలి తగ్గిపోవడం, వాంతులు, మూత్రం పచ్చగా రావడం, కళ్లు పసుపుపచ్చగా మారడం, జ్వరం, ఒళ్లు నొప్పులు అధికంగా ఉండటం వంటి లక్షణాలు కనిపిస్తాయి. వ్యాధి నిర్ధారణ కోసం హెపటైటిస్-బి(హెచ్‌బిఎస్ ఏజి) పరీక్ష చేయించాలి. హెపటైటిస్-బి ఉన్న కొందరిలో లివర్ ఫెయిల్యూర్‌కు దారితీస్తుంది. కొన్ని ఏళ్ల నుంచి వైరస్ ఉన్నవారిలో కాలేయం క్రమంగా దెబ్బతింటూ లివర్ సిర్రోసిస్‌కు దారితీయవచ్చు లేక లివర్ క్యాన్సర్‌గా మారవచ్చు.

**హెర్పిస్ సింప్లెక్స్ :** పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలిపుండు పడుతుంది. ఈసమయంలో చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు. స్త్రీలలో కూడా యోని మీద చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి ఎర్రగా మారి నొప్పిని కలిగిస్తాయి.

**హోమియో చికిత్స**

హెపటైటిస్ బి, సి వ్యాధులను సమర్థవంతంగా అడ్డుకునే చికిత్స హోమియోలో ఉంది. వైరల్‌లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది.





## కిడ్నీలో రాళ్లకు ఆపరేషన్ ఎందుకు?

**ఏ** పనైనా సాఫీగా జరుగుతున్నంత సేపు ఏ ఇబ్బంది ఉండదు. ఏదైనా ఆటంకం ఏర్పడినప్పుడే దాని ప్రభావం ఏస్థాయిలో ఉంటుందో అర్థమవుతుంది. మూత్రవిసర్జన విషయంలోనూ అంతే. కిడ్నీలో ఏర్పడిన రాళ్లు మూత్రనాళంలో అడ్డుపడితే ఆ బాధ చెప్పనలవికాదు.

**కారణాలు :** శరీరంలో తయారయ్యే మలిన పదార్థాలన్నీ మూత్రం ద్వారానే బయటకుపోతాయి. మలినాలన్నీ కరిగిన స్థితిలో మూత్రం ద్వారా బయటకు వెళితే ఏ సమస్యా ఉండదు. అలా కాకుండా మూత్రం విసర్జన సాఫీగా జరగకపోతే గాఢత పెరిగిపోయి మలినాలు రాళ్లుగా ఏర్పడతాయి. సాధారణంగా కిడ్నీ స్టోన్స్ రెండు రకాలుగా ఉంటాయి. ఒకటి కాల్షియం ఆక్సలేట్, యూరికాసిడ్. కొంతమందిలో మెటబాలిక్ సమస్య వల్ల కూడా రాళ్లు ఏర్పడతాయి.

**లక్షణాలు :** కిడ్నీలో ఏర్పడిన రాయి ఒక్కోసారి మూత్రనాళంలో అడ్డుపడుతుంది. ఫలితంగా కిడ్నీలో వాపు వస్తుంది. తీవ్రమైన నొప్పి, మూత్రంలో మంట, జ్వరం వంటి లక్షణాలు కనిపిస్తాయి. మూత్రంలో రక్తం కూడా రావచ్చు. మూత్రవిసర్జన సమయంలో తీవ్రమైన నొప్పి వస్తుంటుంది. నొప్పి వెనక నుంచి ముందుకు విస్తరిస్తూ ఉంటుంది.

**హోమియో వైద్యం :** ఆపరేషన్ కోసం పరిగెత్తకుండా హోమియో చికిత్స తీసుకోవడం ద్వారా రాళ్లు సులభంగా తొలగిపోయేలా చూసుకోవచ్చు. మూత్రనాళంలో రాయి అడ్డుపడినట్లయితే హోమియో మందులు మూత్రనాళం వ్యాకోచం చెందేలా చేసి రాయి పడిపోయేలా చేస్తాయి. అంతేకాకుండా హోమియో మందులు శరీరతత్వాన్ని మార్చుతాయి. ఫలితంగా రాళ్లు తయారయ్యే అవకాశం తగ్గిపోతుంది. కిడ్నీలో రాయి ఉంది అనగానే గాభరా పడిపోకుండా అనుభవజ్ఞులైన హోమియో వైద్యున్ని సంప్రదిస్తే సమస్య ఇట్టే తొలగిపోతుంది.

## ఎసిడిటీని ఎన్నాళ్లు భరిస్తారు?

**ఎసిడిటీ, గ్యాస్ట్రైటిస్ :** జీవనశైలిలో మార్పులు అంటే సమయానికి భోజనం చేయకపోవడం, మసాలా, వేపుళ్లు ఎక్కువగా తీసుకోవడం, మాంసాహారం అధికంగా తినడం, మానసిక ఒత్తిడి, నిద్రలేమి వంటివి గ్యాస్ట్రైటిస్ సమస్యకు కారణమవుతాయి.

**లక్షణాలు :** పుల్లటి తేన్పులు, వాంతులు, కడుపులో మంట, కడుపు ఉబ్బరం వంటి లక్షణాలుంటాయి. కొద్దిగా ఆహారం తీసుకున్నప్పటికీ పొట్ట నిండినట్లుగా అనిపించడం, ఆకలి లేకపోవడం, కారణం లేకుండానే బరువు తగ్గిపో తుండటం వంటి లక్షణాలు ఉంటాయి.

**చికిత్స :** రోగి లక్షణాలు, శారీరకపరిస్థితిని పరిశీలించి మందులు ఇవ్వాల్సి ఉంటుంది. చికిత్స తీసుకోవడంతో పాటు జీవనశైలిలో మార్పులు చేసుకున్నట్లయితే మంచి ఫలితం ఉంటుంది. వేళకు భోజనం చేయడం, కారం, ఉప్పు, నూనె తగ్గించడం చేయాలి.

**అల్సర్స్(గ్యాస్ట్రిక్, పెప్టిక్) :** మ్యూకస్ మెంబ్రేన్ యందు పుండులాగా కావడాన్ని అల్సర్ అంటారు. అల్సర్ ఏ భాగంలో అయితే ఆ పేరుతో పిలుస్తారు. ఆహారవాహికలో ఉన్నట్లయితే ఒసియోఫేగల్ అల్సర్, జీర్ణకోశంలో ఉన్నట్లయితే గ్యాస్ట్రిక్ అల్సర్, చిన్న పేగు మొదటి భాగంలో ఉన్నట్లయితే డ్యుయోడినల్ అల్సర్ అని పిలుస్తారు.

**లక్షణాలు :** తినేముందు లేదా తిన్న తరువాత కడుపులో నొప్పి, కడుపు ఉబ్బరంగా ఉండటం, పుల్లటి తేన్పులు, తలతిరగడం, వాంతులు వంటి లక్షణాలు ఉంటాయి. వ్యాధి ముదిరినపుడు రక్తంతో కూడిన వాంతులు, భరించలేని కడుపునొప్పి, బరువు తగ్గిపోవడం జరుగుతుంది.

**చికిత్స :** అల్సర్‌ను సమూలంగా తొలగించే మందులు హోమియోలో ఉన్నాయి. ఆహారపు అలవాట్లు మార్చుకొని క్రమం తప్పకుండా మందులు వాడినట్లయితే సమస్యకు శాశ్వత పరిష్కారం లభిస్తుంది.



# గేమ్ ఆఫ్ లైఫ్

-కంఠంనేని రాధాకృష్ణమూర్తి 20

**మనలోని శక్తి సామర్థ్యాలను పూర్తిస్థాయిలో వినియోగించినప్పుడు విజయం సాధించటానికి ఎక్కువ అవకాశాలుంటాయి.**

**శక్తి సామర్థ్యాలను పూర్తిస్థాయిలో ప్రదర్శించాలంటే మన ఆలోచనలలో, జీవితంలో క్రమశిక్షణ సెల్ఫ్‌డిసిప్లిన్ తొణికిసలాడాలి. సక్సెస్‌కి సంబంధించిన సూత్రాలలో ఇది చాలా ముఖ్యమైనది!**

## సెల్ఫ్ డిసిప్లిన్

చాలామంది ముందు ఒక పనిచేసేసి తర్వాత దానివల్ల ఉత్పన్నం కాబోయే పరిస్థితుల గురించి ఆలోచిస్తారు.

కాని సెల్ఫ్-డిసిప్లిన్ ఉన్నవాళ్ళు అలాకాదు. ఒక పని చేయబోయేముందే దానికి సంబంధించిన పూర్వాపరాలు, మంచిచెడులు, జరగబోయే పరిణామాలు ఆలోచిస్తారు.

సెల్ఫ్-డిసిప్లిన్‌ను అమలుపరచాలంటే మనలోని ఎమోషన్స్ (రాగద్వేషాలను) అదుపులో ఉంచుకోవాలి.

మనలోని పాజిటివ్, నెగెటివ్ ఎమోషన్స్ ఈ కిందివిధంగా ఉంటాయి.

### పాజిటివ్ ఎమోషన్స్

- ప్రేమ
- సెక్స్
- ఆశ
- నమ్మకం
- విశ్వాసం
- కోర్కె

### నెగెటివ్ ఎమోషన్స్

- భయం
- జెలసీ
- ద్వేషం
- ప్రతికారేచ్ఛ
- అత్యాశ
- కోపం
- మూఢ నమ్మకం

ఈ పైవన్నీ మనస్సుకు సంబంధించినవి. ప్రయత్నం ద్వారా వీటిని కంట్రోల్‌లో ఉంచుకోవచ్చు.

ఎమోషన్స్ కంట్రోల్‌లో ఉంచుకోవటమే సెల్ఫ్-డిసిప్లిన్. ఎమోషన్స్‌ని హేతుబద్ధత (Reasoning) ద్వారా బ్యాలెన్సులో ఉంచుకోవటం సెల్ఫ్-డిసిప్లిన్.

అంటే ఒకపని చేయబోయేముందు లేక నిర్ణయం తీసుకోబోయేముందు మనం మన ఫీలింగ్స్‌ని మాత్రమే కాకుండా హేతువును కూడా కన్సల్ట్ చేయాలన్నమాట!

ఇలా కన్సల్ట్ చేస్తున్నప్పుడు ఒకోసారి మనం ఎమోషన్స్ పక్కనబెట్టి కేవలం హేతువు ప్రకారమే నడుచుకోవాల్సి రావచ్చు.

ఒకోసారి హేతువును పక్కనబెట్టి ఎమోషన్స్ ప్రకారమే ప్రవర్తించాల్సి రావచ్చు.

ఆయా సందర్భాలలో మనకు సంతోషం కలిగించే, అపకారం కలిగించని, మనల్ని సక్సెస్‌లోకినెట్టే మార్గం అనుసరించటం ఉత్తమం.

### గుర్తుంచుకోవాల్సింది ఏమిటంటే

ఎమోషన్స్ మనకు అపకారం కలిగించేవికావు. మన నిర్ణయం అమలుపరిచేందుకు అవసరమయ్యే Driving Forceని Driving Powerని అందిస్తాయి.

ప్రవహించే నదుల్లాంటివి ఎమోషన్స్.

వాటికి అడ్డుకట్టవేసి, కంట్రోల్‌లోఉంచి, మనకు అవసరమైనవైపు మళ్ళించటంద్వారా వాటి ప్రయోజనాలు పొందవచ్చు. అలా మళ్ళించకపోతే ఎప్పుడో ఒకసారి డ్యామ్ బద్దలై తీవ్రనష్టం వాటిల్లే ప్రమాదం ఉంటుంది.

ఇది నెగెటివ్ ఎమోషన్స్‌కి కూడా వర్తిస్తుంది. నెగెటివ్ ఎమోషన్స్ కంట్రోల్ చేసుకుని, మనకు అవసరమైనవైపు మళ్ళించటంద్వారా వాటి ప్రయోజనాలు పొందవచ్చు.

సెల్ఫ్-డిసిప్లిన్, పాజిటివ్ మనోదృక్పథం రెండింటి ద్వారా నెగెటివ్ ఎమోషన్స్‌లోని చెడుఫలితాలను నివారించి వాటిని నిర్మాణాత్మకమైన పనులకు వినియోగించుకోవచ్చు.

ఎమోషన్స్‌కీ, హేతువుకీ మధ్య బ్యాలెన్స్ కుదిర్చే శక్తి ఏమిటో తెలుసా?

మనలోని విల్‌పవర్?

విల్‌పవర్‌ని అందించే నిర్మాణాత్మకమైన శక్తి-సెల్ఫ్-డిసిప్లిన్!!

### మనో సంబంధం

మనస్సు అంటే ఏమిటో తెలుసా?

నిజం చెప్పాలంటే మనశరీరంలో మనస్సు అనే పదార్థం ఏమీ ఉండదు. అంటే మెదడులాగా Physicalగా మనస్సు అనేదేమీ ఉండదన్నమాట!

సాఫ్ట్‌వేర్ రంగంలో ఉపయోగించే Cloud Computing లాంటిది మనస్సు. కనబడని శూన్య పదార్థం. కానీ దానిలో మెదడుకు సంబంధించిన అన్ని లక్షణాలు, విషయాలు ఉంటాయి. ఇలాంటి మనస్సు అనేపెట్టెలో ఆరు అరలుంటాయి. ఈ ఆరు అరల్లో మనస్సు ఏ విధంగా పని చేస్తుందన్నది తెలుసుకుంటే సెల్ఫ్-డిసిప్లిన్‌ని అర్థం చేసుకున్న వాళ్ళమవుతాం.

### 1. మొదటి అర - ఇగో (Ego)

విల్‌పవర్‌కి మూలం ఈ 'ఇగో'నే. మిగతా మనస్సు మొత్తం మీద 'ఇగో' సుప్రీంకోర్టులా అజమాయిషీని చెలాయిస్తుంది.

మిగతా అరల్లో మనస్సు పనిచేసే విధానాలకి మార్పులు చేర్పులు చేయటానికి క్యాన్సిల్ చేయటానికికూడా శక్తిని, అధికారాన్ని కలిగి ఉంటుంది 'ఇగో'.



**2. రెండవ అర - ఉద్వేగాలు (Emotions)**

మన ఆలోచనలు, ప్లానుల్ని అమలుచేసే Driving Force ఇక్కడ ఉత్పత్తి అవుతుంది.

**3. మూడవ అర-హేతుబద్ధత (Reasoning)**

మన ఉద్వేగాలు, ఊహలనుంచి ఉత్పత్తయ్యే ఆలోచనల్లోని మంచిచెడుల విశ్లేషణ జరిగేది ఇక్కడే. ఆ ప్రకారంగా మన ప్రవర్తనలో మార్పులు చేర్పులకు ఇక్కడ శ్రీకారం చుట్టబడుతుంది.

**4. నాల్గవ అర - ఊహాత్మకత (Imagination)**

మనం కోరుకున్న లక్ష్యాలను అందుకోవటానికి అవసరమయ్యే పద్ధతులు, ప్లానులు, ఐడియాలు ఇక్కడ రూపు దిద్దుకుంటాయి.

**5. అయిదవ అర - అంతరాత్మ (Conscience)**

మన అవసరాలు, మనం వేసుకునే ప్లానులు, మన ఆలోచనల్లోని నీతి, న్యాయాలను బేరీజు వేసేది ఇక్కడే.

**6. ఆరవ అర - జ్ఞాపకం (Memory)**

గతంలో మనం పొందిన అనుభవాలు, వాటి తాలూకు అనుభూతులన్నీ ఇందులో నిల్వ ఉంటాయి.

మన జీవితానికి సంబంధించిన సంఘటనల రికార్డ్ కీపర్ లాంటిది ఈ అర.

ఈ అరలన్నిటి మధ్య ఎంతచక్కటి సమన్వయం ఉంటే అంతగా మనం సెల్ఫ్-డిసిప్లిన్ పాటించగలుగుతాం.

**మనో ఆర్కెస్ట్రా**

మన మనస్సులో నిరంతరంగా వివిధ ఆలోచనలు, దృశ్యాలు (Images) అనుభూతులు, అంతకు మునుపు విన్నవి, కన్నవి నేర్చుకున్నవి, గతంతాలూకు జ్ఞాపకాలు, సంతరించుకున్న జ్ఞానం, పొందిన సుఖ దుఃఖాల తాలూకు ముద్రలు లాంటివన్నీ కిక్కిరిసి ఉంటాయి.

ఇవన్నీ కలగలిసి, మన మాటలు, నడత, ప్రవర్తన లాంటి వాటిని ప్రభావితం చేస్తుంటాయి.

ఈ ఆలోచనలు, Images అనుభూతులు, జ్ఞాపకాలు, జ్ఞానం, సుఖదుఃఖాలముద్రలు, ఇవన్నీ మన స్సులలో ఎలా ఉంటాయంటే-

మీ మనస్సులో అనేకమంది వాయిద్యకారులు కిక్కిరిసి ఉండి ఎవరికివాళ్ళు తమ వాయిద్యాలు వాయిస్తున్నట్లు ఉంటుంది. ఒకొక్కళ్ళది ఒక్కో ట్యూను, ఏ ట్యూనుకు మిగతా వాటితో లంకె ఉండనట్లుగా.

దీనికి ఒక ఉపమానం ఉంది:

ఒక మ్యూజికల్‌నైట్ జరుగుతోందనుకుందాం. స్టేజ్ మీద వివిధ కళాకారులు తమతమ వాయిద్యాలతో కూర్చుని ఉంటారు.

అక్కడ మ్యూజిక్ డైరెక్టర్ లేదు. ఎవరికి ఇష్టం వచ్చినరీతిలో వాళ్ళు వాయిద్యాలు వాయిస్తోంటే వినటానికి ఎంత ఇబ్బందికరంగా ఉంటుందో ఆలోచించండి.

అదే ఒక మ్యూజిక్ డైరెక్టర్ వాళ్ళనందరినీ ఒక క్రమపద్ధతిలో కూర్చోబెట్టి లయబద్ధంగా వాళ్ళచేత వాయింపజేస్తే ఎంత వినసొంపుగా ఉంటుంది!

మన జీవితం, భవిష్యత్తు మనం కోరుకున్న విధంగా మలుచుకోవాలంటే మనస్సుకు సంబంధించి ఎవరికి వాళ్ళు ఒక మ్యూజిక్ డైరెక్టర్ కావాలి.

మన మనస్సులో ఆలోచనలు, అనుభూతులు (Images), జ్ఞాపకాలు, సుఖదుఃఖాలు (Impressions) అనిపిలిచే వివిధవాయిద్యాలను లయబద్ధంగా ఉండేట్లు ఆర్కెస్ట్రా నిర్వహించాలి.

**ప్రతి మనిషీ తన జీవితంలో అనుకున్న లక్ష్యం సాధించాలంటే వారికి స్వీయ క్రమశిక్షణ అవసరం. మన లక్ష్య సాధనకు ఏళ్ళు పట్టవచ్చు. అన్ని సంవత్సరాల పాటు మన లక్ష్యం, సంకల్పం సడలిపోకుండా, మనం పక్కదారి పట్టకుండా విజయం దిశగా ముందుకు సాగాలంటే మనకు కావాల్సింది స్వీయ క్రమశిక్షణ. దీన్ని సాధించాలంటే మనలో ఉండే పాజిటివ్, నెగెటివ్ ఎమోషన్స్‌ని మన అదుపులో ఉంచుకోవాలి. మరి అదెలా సాధ్యం?**



సెల్ఫ్ డిసిప్లిన్ అంటే ఈ మనో ఆర్కెస్ట్రానే! ఈ ఆర్కెస్ట్రాతో మన జీవితాన్ని ఒక అందమైన, సుమధురమైన సంగీతంగా వినిపించేట్లు చేసుకోవాలి.

**మహాత్మాగాంధీ**

సెల్ఫ్-డిసిప్లిన్ గురించి మాట్లాడుకునేటప్పుడు మొట్టమొదటగా మనకు మహాత్మాగాంధీ గుర్తుకు రాక తప్పదు.

ఈ శతాబ్దపు మహోన్నత వ్యక్తులలో ఒకరు మహాత్మాగాంధీ. ఆయనకు స్వంత ఇల్లులేదు, స్వంత డబ్బు లేదు. అంతటి పేదవాడు రవి అస్తమించని బ్రిటిషు సామ్రాజ్యాన్ని గడగడలాడించారు.

ఆయనకు అంతశక్తి ఎక్కడినుంచి వచ్చింది?

ఆయనను అంత శక్తిమంతుడుగా తీర్చిదిద్దిన అంశాల్లో ముఖ్యమైనవి అయిదు, అవి:

**1. జీవితానికి ఒక ధ్యేయం:**

మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీలో భారతదేశానికి స్వాతంత్ర్యం తీసుకురావాలనే ఒక ధ్యేయం ఉంది. ఒక (Purpose)ఉంది.

తన జీవిత ధ్యేయం ఏమిటో తను ఏమి కోరుకుంటున్నాడో ఆయనకు స్పష్టంగా తెలుసు.

ప్రపంచంలో ఏశక్తీ తనను Defeat చేయరాదనే నమ్మకంతో, Determinationతో ఉండేవాడు ఆయన.

**2. లక్ష్యశుద్ధి:**

ఆ విధంగా జీవితం గడపమని గాంధీగారికి ఎవరూ చెప్పలేదు, అలా గడిపినందుకు ఆయనకు ఎవరూ జీతం ఇవ్వలేదు.

తనకంటూ ఏమీ కోరుకోకుండా స్వార్థరహితంగా ఆ జీవితాన్ని ఎన్నుకున్నారు గాంధీజీ.

తన దేశంలోని కోట్లాదిమంది క్షేమంకోరి, వాళ్ళకు తప్పకుండా ఉపయోగం జరుగుతుందనే నమ్మకంతో ఆయన ఆ జీవితం ఎన్నుకున్నాడు. లక్ష్యశుద్ధి అంటే ఇది.

**3. సంకల్పం:**

ప్రజలకోసం తను కోరుకున్న స్వాతంత్ర్యాన్ని తప్పకుండా సిద్ధింపజేసుకుంటాననే నమ్మకం ఆయన మనసులో ఎప్పుడూ దృఢంగా ఉండేది. ఆ విషయంలో ఎలాంటి సంశయాన్నీ తన ధ్యేయాన్నుంచి మనస్సును ఎన్నడూ పక్కకు మళ్ళించే వాడుకాదు. ఆయనలోని ఆ దృఢ నిశ్చయం, దానిని ఫలింపచేసుకోవటానికి సిన్సియర్‌గా ఆయన చేపట్టిన చేతలు ఆయనను తన లక్ష్యసాధనకు చేరువగా తీసుకు వెళ్ళాయి.

**4. దీక్ష:**

మహాత్మాగాంధీ అకుంఠిత దీక్షతో కోట్లాది ప్రజల సంకల్పాలను తన సంకల్పంతో మమేకం చేశాడు. ఆ కోట్లాది మందిలో చాలామందికి ప్రాథమిక విద్యాస్థాయి కూడా ఉండక పోవచ్చు.

నిస్వార్థ జీవనంతో ఆదర్శప్రాయుడై స్వతంత్రేచ్ఛ పట్ల వాళ్ళలో కోర్కెరగిలించి అనుకున్నది సాధించేట్లు చేశాడు.

ప్రపంచంలోని ఏ శక్తీ ఆయనదీక్ష ముందు నిలవలేక పోయింది.

**5. సెల్ఫ్-డిసిప్లిన్:**

అన్ని సంవత్సరాలపాటు తన సంకల్పం సడలిపోకుండా గాంధీజీ దాన్ని ఎలా నిల్పుకో గలిగాడనుకుంటున్నారు?

బహుశా అనేకసార్లు స్వార్థప్రయోజనాలు పొందగలిగే అవకాశాలు ఆయనకు అనేకం వచ్చి ఉండవచ్చు.

ఆయన స్థానంలో వేరేవాళ్ళు ఉంటే, ఆ అవకాశం ఉపయోగించుకునేందుకు Tempt అయ్యేవారు. కాని గాంధీజీ మాత్రమే తన దృఢసంకల్పంతో, సెల్ఫ్ డిసిప్లిన్‌తో మేరుపర్వతంలా నిలిచి మోహావేశాలకు లోనుకాకుండా దేశానికి స్వాతంత్ర్యం తీసుకు రాగలిగారు!

ఆయనలా అందరూ ఉండలేకపోయినా ఎంతో కొంతైనా ఆయనలా ఉండేందుకు ప్రయత్నిస్తే వ్యక్తిత్వం పరిమళాన్ని సంతరించుకుంటుంది.

జీవితంలో ఆటుపోట్లు, అపజయాలు, కష్టనష్టాలు ప్రతి మనిషికీ సహజం. ఎప్పుడో ఒకసారి ఎదురవుతుంటాయి. అలాంటి సందర్భాలలో చాలా మంది వాటికి తమ ఆలోచనలు, తమ ప్రవర్తన కారణం కావచ్చునేమోనన్న శోధన చేసుకోకుండా చుట్టూ ఉండే లోకం, మనుషుల్ని తిట్టుకుంటూ వాళ్ళు మారాలని కోరుకుంటారు.

ఎవరైనా ఎప్పుడైనా తమ జీవితంలో ఎదురు దెబ్బలు తగులుతున్నప్పుడు మొట్టమొదట తమ ఆలోచనా దృక్పథాన్ని తమ ఆలోచనా విధానాన్ని మార్చుకోవటానికి ప్రయత్నించాలి.

అందుకు ఉపకరించేది సెల్ఫ్-డిసిప్లిన్!!

(అయిపోయింది) D

# అమృతం

## -మలిపెద్ది సూరిబాబు

**'ఉంగా, ఉంగా' అంటూ పొత్తిళ్ళలో చంటిది గుక్కతిప్పుకోకుండా ఏడుస్తోంది. ఆ పసిదాని ఏడుపు విద్యాధరి గుండెను రంపంతో కోస్తున్నంతగా బాధ పెడుతోంది. ఆకలితో డొక్కలు ఎగిరిపడేలా ఏడుస్తుంటే చేష్టలుడిగిన దానిలా గుడ్ల నీరు కక్కుకోవడంతప్ప ఇంకేం చేయలేకపోతోంది. ఆ చిన్ని పొట్ట ఆకలి తీర్చడానికి స్తన్యం ఇచ్చింది.**

ఇప్పటికది ఏ అయిదోసారో, ఆరోసారో అలా ఇవ్వడం. స్తన్యంలో పాలు ఉంటేగా బిడ్డ ఆకలి తీరేది. ఆ బాధే విద్యాధరి గుండెను పిండేస్తోంది. భగవంతుడు బిడ్డనైతే ఇచ్చాడుగానీ, ఆ బిడ్డ ఆకలి తీర్చే పాలధారను మాత్రం ప్రసాదించ లేదనే చేదునిజం గుర్తొచ్చినప్పుడల్లా పిచ్చిదానిలా మారిపోతోంది. 'నన్ను క్షమించరా కన్నా, నీ ఆకలి తీర్చేశక్తి ఆ భగవంతుడు నాకివ్వలేదురా' అనుకుంటూ గుండెలు బాదుకుంటోంది. పొత్తిళ్ళల్లో చంటిది ఏడ్చిఏడ్చి మిన్నకుండిపోయింది. ఉలుకూ, పలుకూ లేదు. 'ఏమైందిరా కన్నా' అంటూ జీవచ్ఛవంలా ఉన్న పసిగుడ్డును చేత్తో తడుతూ పిచ్చిదానిలా పిలుస్తోంది. చిన్నారిశరీరం చల్లగా తగిలేసరికి విద్యాధరికి అనుమానం వచ్చింది. అంతే "నో" అంటూ గట్టిగా అరిచింది.

"విద్యా విద్యా" ఎవరో పిలుస్తుంటే నిద్రపోతున్న విద్యాధరికి మెలకువ వచ్చింది. పక్కనే బెడ్‌పై భర్త. అంటే తను ఇంతవరకు 'కలగన్నదన్నమాట' అనుకుంది. ఒళ్ళంతా చెమటతో తడిసిపోయింది. ఆందోళననిండిన వదనంతో భార్య కనిపించేసరికి చక్రవర్తిలో తెలియని గాబరా.

"ఏమైంది. విద్యా" అడిగాడు.

"... ... ..."

"మాట్లాడవేం" భార్యను గట్టిగా కుదిపాడు.

"చంటిదానికి పాలివ్వలేకపోతున్నాననే బెంగ నన్ను స్థిమితంగా ఉండనీయడం లేదండి. నిద్రలోనూ అవే కలలు అంటూ తనకొచ్చిన కల గురించి చెబుతూ సన్నగా ఏడుస్తోంది.

భార్యను ఎలా సముదాయించాలో తెలియక ఆర్తిగా గుండెలకు అదుముకున్నాడు చక్రవర్తి. పేగు తెంచుకుపుట్టిన బిడ్డకు పాలివ్వలేక పోతున్నాననే క్షోభతో తల్లడిల్లుతున్న ఆ తల్లివేదన చక్రవర్తి గుండెను బరువెక్కించింది. మెల్లగా భార్యను పక్క వెనక్కు చేర్చాడు.

ఎప్పుడో కూతురు జాహ్నవి పసిబిడ్డగా ఉన్నప్పుడు వేధించిన కల విద్యాధరిని ఇప్పటికీ వెంటాడుతోంది. ఇరవైమూడేళ్ళు దాటిపోయినా తరచూ గుర్తుకొస్తూనే ఉంటోంది. తల్లిపాలు లేకుండా పెరిగిన 'జాహ్నవి'ని కంటికి రెప్పలా కాపాడుకుంది. ఎప్పుడూ ఏదో ఒక అనారోగ్యంతో చలాకీతనం లేక నీరసంగా కనిపించే జాహ్నవి అంటే వల్లమాలిన అభిమానంతోపాటు అంతకు మించిన జాగ్రత్త చూపేది. ఈదారిలో శారీరకంగా, మానసికంగా అలసిపోయింది.

•••

"అమ్మాయిని కాన్పుకి తీసుకురావాలి. రెండ్రోజులు ఆఫీసుకు సెలవుపెట్టండి" అంది విద్యాధరి.

"ఇప్పుడు నాలుగోనెలే కదా! ఇప్పటినుంచీ ఎందుకు" అన్నాడు చక్రవర్తి.

"బాగుంది. మీ వరస. కనీసం నాలుగైదు నెలల ముందునుంచైనా తీసుకురాకపోతే ఏం బాగుంటుంది?"

"కాన్పు అత్తారింట్లోనే చేద్దామంటున్నారట కదా!"

"అమ్మాయంటోందలా! కానీ తొలికాన్పు పుట్టింట్లోనే జరగాలి. అది ఆనవాయితీ. వెళ్ళి అడగాల్సిన బాధ్యత మనది. తర్వాత వియ్యంకులవారు ఏమంటారో చూద్దాం".

"సరే. ట్రైన్‌కు రిజర్వేషన్ చేయిస్తానైతే".

"ఎందుకైనా మంచిది. అట్నుంచి అమ్మాయితో కలిపి ముగ్గురికి రిజర్వ్ చేయండి".

"అలాగే"

ఫలక్‌నుమాకు టికెట్ కన్ఫర్మ్ కావడంతో హైద్రాబాద్ ప్రయాణానికి పెద్ద టెన్షన్‌పడాల్సిన అవసరం లేకపోయింది. పిల్లకు ఇష్టమని అదనీ, ఇదనీచెప్పి మొత్తంమీద భారీ లగేజీ తయారు చేసింది విద్యాధరి. ఈ లగేజీతో మరుసటిరోజు ఫలక్‌నుమా ఎక్కేసరికి ఇబ్బంది పడాల్సివచ్చింది.

రైలు హైద్రాబాద్ చేరుకోవడంతో సనత్‌నగర్‌లో వియ్యంకులవారింటికి చేరుకున్నారు విద్యాధరి, చక్రవర్తి. కుశల ప్రశ్నలు, అతిథి మర్యాదల య్యాక వియ్యంకుడి దగ్గర అసలు విషయం కదిపింది విద్యాధరి.

"అన్నయ్యగారూ! అమ్మాయిని డెలివరీకి వైజాగ్ తీసుకెళదామనుకుంటున్నాం. మీరు ఓ.కే. అంటే" అంటూ మధ్యలో ఆపింది.

"ఇప్పుడే కదమ్మా మీరొచ్చారు. తరువాత మాట్లాడుకుందాంలే" అన్నాడు వియ్యంకుడు. విద్యాధరి, చక్రవర్తి ఒకరి మొఖాలింకొకరు చూసుకున్నారు.

రాత్రి భోజనాలదగ్గర మరోసారి కదిపింది.

"తొలికాన్పు కన్నవారింట్లో జరగడం ఆచారమే. కాదనను. కానీ మా ఇద్దరి కోడళ్ళ కాన్పులు ఇక్కడే జరిగాయి.." అంటూ ఆగాడు వియ్యంకుడు.

అతను మనసులో విషయం అర్థమైంది ఇద్దరికీ.

"మీరెలా అంటే అలాగే బావగారు. సంప్రదాయం ప్రకారం తీసుకెళ్ళాలి కాబట్టి వచ్చాం" అన్నాడు చక్రవర్తి.

"కాన్పుకి ఇంకా టైముంది. ఇప్పుడు డాక్టరు తనిఖీలవుతున్నాయి. మొదటినుంచి ఒకే డాక్టరైతే బాగుంటుంది. మా ఇద్దరి కోడళ్ళకు డెలివరీ జరిగిన ఆసుపత్రిలోనే జాహ్నవిని జాయిన్ చేస్తాం" అన్నాడు వియ్యంకుడు.

జాహ్నవి ముందునుంచి చెబుతున్న విషయమిదే. రేప్పొద్దున్న మాట పడకూడదన్న ఉద్దేశంతోనే కుమార్తెను డెలివరీకి పంపమని అడగడానికి వచ్చారు. వియ్యంకులు స్థితిమంతులు కావడంతో ఆ మాత్రం గౌరవం ఇవ్వకపోతే జాహ్నవిని దెప్పిపొడవచ్చన్న ముందుచూపు కూడా ఉంది.

డబ్బున్నవాళ్ళ ఇళ్ళల్లో మాదిరిగానే వియ్యంకులవారి ఇంట్లోకూడా సోకులు, ఫ్యాషన్లకు పెద్దపీట వెయ్యడం విద్యాధరి గమనించకపోలేదు. శరీరం ఏ మాత్రం అలిసిపోకుండా ప్రవర్తించడం, పిల్లల తల్లులు అవుతున్నా శరీరంపై అవసరానికి మించి శ్రద్ధచూపించడం, ఇంతవయసొచ్చినా బ్యూటీపార్లర్లకు వెళుతుండడాన్ని పసిగట్టింది. అడుగడుగునా డబ్బున్నవాళ్ళమనే హోదా, దర్పం ప్రదర్శించడం విద్యాధరి దృష్టిపథంనుంచి దాటిపోలేదు. జాహ్నవి కూడా ఇప్పుడిప్పుడే ఆ డాంబికాలు వంట పట్టించుకోవడంతో దాని మాటల్లో కూడా కించిత్తుగర్వం, హోదా కనిపిస్తుండడం విద్యాధరిని ఆలోచనలో పడేసింది. కూతురికి ఏదో చెప్పాలనుకుంది. కాని ఎందుకో మిన్నకుండిపోయింది.

వచ్చినపనైపోవడంతో విద్యాధరి, చక్రవర్తి వైజాగ్ వచ్చేశారు. రోజులు గడవడం ఎంతసేపు. జాహ్నవి డెలివరీడేట్ దగ్గరపడింది. తల్లిమనసు



విద్యాధరిని నిలువనీయలేదు. 'తోడొస్తానని' చక్రవర్తి అంటున్నా విద్యాధరి ఒక్కర్తే హైద్రాబాద్ రైలెక్కింది. డెలివరీ తర్వాత ఎలాగూ రావాల్సి ఉంటుందనిచెప్పి మొగుణ్ణి వైజాగ్‌లోనే ఉంచేసింది. కూతురికి సాయంగా ఉంటుందని వచ్చిన రెండు రోజులకే జాహ్నవికి సడన్‌గా నొప్పులు మొదలు కావడంతో ఆసుపత్రిలో జాయిన్ చేశారు. అదృష్టంకొద్దీ ఏ సమస్యా లేకుండానే కాన్పు సుఖంగా జరిగిపోయింది. పండంటి మగబిడ్డ. తల్లీబిడ్డ క్షేమం. వియ్యంకులవారింట్లో సంతోషానికి కొదవలేకపోయింది. భర్తకు ఫోన్లో విషయం చెప్పేవరకు విద్యాధరికి కాలు నిలవలేదు. ఇక్కడ చక్రవర్తికూడా 'తాతనయ్యానంటూ' మురిసిపోయారు. రిజర్వేషన్ దొరక్కపోవడంతో కాన్పు సమయానికి వెళ్ళలేకపోయినా, డెలివరీ జరిగిన మూడోరోజుకు హైద్రాబాద్‌లో వాలిపోయారు. అప్పటికే జాహ్నవిని ఆసుపత్రి నుంచి ఇంటికి తీసుకొచ్చేశారు. నేరుగా చూసేందుకు ఇబ్బందులేవీ లేకపోవడంతో మనవణ్ణి చూశారు చక్రవర్తి. 'అచ్చు జాహ్నవి పోలికే' అనుకున్నారు. వచ్చినప్పటినుంచి గమనిస్తున్నాడు. భార్య ఎక్కడా కనిపించలేదు. అక్కడ జాహ్నవి తోడికోడళ్ళు, మిగతా బంధువులు, అల్లుడు అందరూ ఉన్నా విద్యాధరి మాత్రంలేదు. అదే విషయం జాహ్నవిని అడిగాడు.

"ఇప్పటివరకూ ఇక్కడే ఉంది. బైట ఉందేమో చూడండి డాడీ" అంది.

బయటకొచ్చి చూశాడు చక్రవర్తి. వరండా చివర నిల్చొని ఎటో చూస్తున్న విద్యాధరి కనిపించేసరికి దగ్గరగా వెళ్లాడు.

"అంతా అక్కడుంటే ఇక్కడేం చేస్తున్నావు?" అన్నాడు.

భర్తమాటలు గుర్తించి ఇటువైపు తిరిగింది విద్యాధరి. కూతురు కాన్పు సజావుగా జరిగిపోవడంతో భార్యమొహం వెలిగి పోతుందనుకున్నాడు. అందుకు భిన్నంగా వాడిపోయినట్లు కనిపించేసరికి చక్రవర్తి భృకుటి ముడి పడింది.

"ఏమైంది" అన్నాడు.

సమాధానం లేదు.

"నిన్నే అడుగుతున్నాను విద్యా. ఏమిటా పరధ్యానం. ఏం జరిగింది. ఎందుకంత డల్‌గా ఉన్నావు" మళ్ళీ అడిగాడు చక్రవర్తి.

"తరువాత చెబుతానులెండి" అనేసిందిగానీ భర్తకు ఎలా చెప్పాలా అని ఆలోచిస్తోంది.

ఏ మూడ్‌లో ఉన్నారోగానీ కాన్పు సజావుగా జరిగిపోవడంతో జాహ్నవిని వైజాగ్ తీసుకెళ్ళడానికి వియ్యంకుడు ఒప్పుకోవడంతో మరుసటిరోజే అమ్మాయితో కలిసి 'గోదావరి' ఎక్కేశారు. అల్లుడు స్టేషన్‌వరకు వచ్చి జాహ్నవికి ఏవో జాగ్రత్తలు చెబుతున్నాడు. రైలు కదిలింది.

"అమ్మా... చంటిగాణ్ణి చూస్తుండు. నాకు నిద్రొస్తోంది" అంటూ జాహ్నవి నిద్రకుపక్రమించింది. చక్రవర్తి ఎప్పుడో బెర్త్ఎక్కి ముసుగు తన్నేశాడు. విద్యాధరికిమాత్రం తప్పలేదు. చంటిగాడితో రాత్రంతా జాగారమే చేసింది.

చక్రవర్తి ముసుగుతన్నాడన్న మాటేగాని నిద్రపట్టడం లేదు. వియ్యంకులవారింట్లో ఏం జరిగింది? భార్య ఎందుకంత డల్‌గా ఉంది? అర్థం కాలేదు. ఏం జరిగి ఉంటుందోనని ఊహించినా, ఏదీ ఊహకందడం లేదు. 'చూద్దాం, ఇంటికెళ్ళిన తరువాత విద్యాధరి చెబుతుంది కదా' అని సమాధాన పడ్డాడు.

●●●

"టైమవుతోంది. ఆఫీసుకి వెళ్ళరా" తీరుబడిగా పేపరు చూస్తున్న చక్రవర్తిని అడిగింది విద్యాధరి.

"ఈ రోజు సెలవేకదా"

"ఎందుకు"

"ఏదో ముస్లిం పండుగ".

ఇంతలో ఊయల్లో పడుకున్న మనవడు ఏడుపు లంకించుకోవడంతో చక్రవర్తి లేచి ఊయల ఊపడం ప్రారంభించాడు. చంటిగాడు ఎంతకూ



**కన్నకూతురు గర్భవతి. పుట్టింటికి తీసుకు వెళ్ళాలని ఆరాటపడ్డారు ఆ తల్లిదండ్రులు. వియ్యంకుడింటికి వెళ్ళి అడిగారు. కోడల్ని పంపేందుకు సున్నితంగా నిరాకరించాడు వియ్యంకుడు. కన్నవారు మిన్నకుండిపోయారు. అనుకున్నట్టుగానే మహానగరం హాస్పిటల్‌లో కూతురుకు సుఖప్రసవం జరిగింది. అందరూ సంతోషిస్తున్నారు. కానీ ఆ తల్లి హృదయంలో మాత్రం విషాదం గూడుకట్టుకుంది. ఎందుకని? ఏమిటామె ఆవేదన?**

ఏడుపు ఆపడం లేదు.

"అమ్మా... జాహ్నవి" అంటూ కేకేశాడు చక్రవర్తి.

"అదెందుకండి" అంది అక్కడేఉన్న విద్యాధరి.

"బాబు ఏడుస్తున్నాడు కదా, పాలుపడుతుందని"

"అక్కర్లేదండి" అంటూ వంటింట్లోకివెళ్ళి పాలునింపిన సీసాతెచ్చి పీక చంటిగాడి నోటికందించింది.

"అదేమిటి విద్యా. పోతపాలు పడుతున్నావు".

"నన్నడుగుతారేం? మీ కూతురును అడగండి"

"అలా మాట్లాడతావేమిటి?"

"ఇంకెలా మాట్లాడాలి. కడుపునపుట్టిన పిల్లాడికి తల్లిపాలుపట్టడం మన కూతురికి ఇష్టం లేదు".

భార్య ఏం చెబుతోందో అర్థంకాలేదు చక్రవర్తికి.

"ఏంటి నువ్వు చెప్పేది".

"అవును. చంటాడికి పాలివ్వనంటోంది జాహ్నవి".

"ఏం"

"ఏం అంటే.. ఏం చెప్పాలి. బిడ్డకు పాలిస్తే తన అందం తగ్గిపోతుందట" విద్యాధరి మాటల్లో కోపంతో కూడిన వ్యంగ్యం కనిపించింది చక్రవర్తికి. భార్య చెప్పిన మాటలకు స్థాణువైపోయాడు.

"దానికి పుట్టిన బుద్దేనా ఇది" గొంతు పెగుల్చుకుని అడిగాడు.

"తోడికోడళ్ళు వద్దన్నారట. వాళ్ళుకూడా తమ పిల్లలకు తల్లిపాలు ఇవ్వలేదట. ఇస్తే అందం తగ్గిపోతుందని, పోతపాలే పట్టారట. మనపిల్లా అలాగే తయారైంది" విద్యాధరి ఆవేదనగా అంది.

"అందుకేనా? నువ్వంత డల్‌గా ఉన్నావు. మరి నాతో ఇంతవరకూ ఎందుకు చెప్పలేదు"

'చెబితే ఏం చేసేవారు?"

"జాహ్నవిని అడుగుదును కదా"

"డెలివరీ అయినరోజే ఇది పాలివ్వనంటే గట్టిగా అడిగాను".

"ఏమంది"

"నిర్మొహమాటంగా చెప్పేసింది. పిల్లాడికి తన పాలు పట్టనని కుండబద్దలు కొట్టింది. ఏమ్మా పాలురావట్లేదా అని అడిగితే అదికాదని చెప్పింది. మరెందుకు పిల్లాడికి పాలివ్వనంటున్నావని నిలదీశాను".

"జాహ్నవి ఏం చెప్పింది".

"ఇంకేం చెబుతుంది. తోడికోడళ్ళెవరూ తల్లిపాలివ్వలేదట. తనూ ఇవ్వదట"

"దానికేమైనా మతిపోయిందా" చక్రవర్తిలో అసహనం.

"చూశారా.... మీరే ఇంత ఇదైపోతున్నారే. కాన్పు అయినప్పటినుంచీ ఇదిలా ప్రవర్తిస్తుంటే నాకెలా ఉంటుంది. ఒళ్ళంతా కంపరంగా ఉంది. దాని ప్రవర్తన. గొడవెందుకుని మిన్నకుండిపోయాను".

ఇంతలో జాహ్నవి బెడ్‌రూంలోంచి అక్కడికొచ్చింది.

"అమ్మా... బాబుకు పాలు పట్టావా" అంది.

"ఆ... " అంటూ ముభావంగా సమాధానమిచ్చింది విద్యాధరి.

"ఏంటమ్మా ఇది. చంటాడికి తల్లిపాలుకదా పట్టాలి?" ఉండబట్టలేక అడిగాడు చక్రవర్తి.

మౌనం వహించింది జాహ్నవి.

"డాడీ అడుగుతున్నారుగా చెప్పు. నా పాలు పడితే నా అందం తగ్గిపోతుంది నాన్నా! అందుకే పట్టడంలేదని చెప్పు" విద్యాధరి మాటల్లో అసహనం. తల్లి వైపు అయోమయంగా చూసింది జాహ్నవి. తల్లి అలా మాట్లాడుతుందనుకోలేదు.

"అదేం చెబుతుందండి. డబ్బున్న ఇంటికి కోడలుగా వెళ్ళిందికదా. వాళ్ళలాగే ఇదీ ప్రవర్తిస్తోంది. ప్రకృతిలో ఏ జంతువైనా కన్నబిడ్డకు పాలివ్వకుండా ఉంటుందటండి. వాటికున్న ఇంగితమైనా దీనికి లేకపోయింది. కడుపున పుట్టిన బిడ్డ కన్నా దీనికి అందం ఎక్కువైపోయింది. చంటాడు ఆకలితో ఏడుస్తుంటే నాకు నరాలు తెగిపోతున్నాయండీ. దీనికిమాత్రం చీమకుట్టినట్టైనా లేదు" విద్యాధరి గొంతు దుఃఖంతో పూడుకుపోయి బొంగురైంది".

"విద్యా...." ఏదో చెప్పబోయాడు చక్రవర్తి.

"ఇది పుట్టిన తర్వాత నేనెంత బాధపడ్డాను. ఆ పాలే లేక ఎంత నరకం అనుభవించాను".

"ఇప్పుడవన్నీ ఎందుకు చెప్పు".

"దానికి తెలియాలండీ. అది తెలియకే ఇదిలా ప్రవర్తిస్తోంది. ఒకరికి లేక కన్నీళ్ళు, ఇంకొకరికి ఉండీ తెగులు" విద్యాధరి మాటల్లో వశం తప్పుతున్న కోపం. తల్లినోట ఇంతవరకూ తను వినని కొత్తకొత్త విషయాలు బయట పడుతుండడం జాహ్నవిని విస్మయానికి గురిచేస్తోంది. అందుకే స్థాణువులా నిలబడిపోయింది. విద్యాధరి మళ్ళీ అందుకుంది.

"నువ్వు చంటిదానిగా ఉన్నప్పుడు నాకు పాలుపడలేదు. ఆకలికి నువ్వేడుస్తుంటే నా పరిస్థితి ఏమిటి? ఏం చేయాలో తోచేదికాదు. 'భగవంతుడా నాకెందుకీ శిక్ష విధించావని' అనుకుంటూ నాలోనేను ఎంతనరకం అనుభవించానో ఆపైవాడికే తెలుసు" తల్లివంక నోరెళ్ళబెట్టి చూస్తోంది జాహ్నవి.

"తల్లిపాలులేక ఇది నిత్యం ఏదోఒక అనారోగ్యంతో సతమతమవుతుంటే దీనికోసం ఎంత వెంపర్లాడాం. తిరగని డాక్టర్‌లేడు. ఇప్పటికీ కళ్ళ ముందు మెదులుతోంది".

"సర్లే... అవన్నీ ఎందుకు. ఏదో చిన్నతనం. దానికి తెలియక" సర్దిచెప్పబోయాడు చక్రవర్తి.

"తెలియక కాదండి. మన అమ్మాయికేకాదు. సమాజంలో ఎంతోమంది తల్లులు తమ పిల్లలకు తల్లిపాలివ్వడంలేదు. తల్లిపాలంటే చులకన. కొందరికి తెలియక అపోహ. తల్లి బిడ్డకు ఇచ్చేది పాలు కాదండి. అది అమృతం. బిడ్డ పాలిట శ్రీరామరక్ష.

తల్లిపాలుతాగితే పిల్లలు శారీరకంగానే కాదండి, మానసికంగా బాగా ఎదుగుతారు. పేగు తెంచుకు పుట్టినబిడ్డకు పాలిస్తుంటే ఆ అనుభూతి అనిర్వచనీయం. తల్లి, బిడ్డల మధ్య అనుబంధం పెంచేది తల్లిపాలే అంటే ఎంతమంది నమ్ముతారు. ప్రసవమైన గంటలోపు తల్లికివచ్చే పసుపుపచ్చని 'ముర్రుపాలు' బిడ్డకు ఎంతో ఆరోగ్యం. ఆ పాలల్లో బిడ్డకు కావల్సిన పోషకాలన్నీ ఉంటాయి. మాంసకృత్తులు, ఖనిజాలు, విటమిన్లు, రెటినాల్, బీటాకెరోటిన్ వంటివన్నీ సమృద్ధిగాఉండి బిడ్డలో రోగనిరోధకశక్తిని కలిగిస్తాయి. ఏ జబ్బూ సోకకుండా కాపాడుతుంది. చిన్నపిల్లల్లో ఆలస్యమయ్యే కొద్దీ ప్రమాదకరంగా మారే విసర్జనక్రియ ఈ పాలుపట్టడంవల్ల క్రమబద్ధమవుతుంది. తొలి విరోచనం అవుతుంది. ఎంతమంది తల్లులకు ఈ విషయాలపై అవగాహన ఉంది" విద్యాధరి నోటి



# అలర్జీని పారదోలుదాం!

అలర్జీ అనే పదం మనం సర్వసాధారణంగా ప్రతి రోజూ వింటూనేఉంటాం. మన జీవన శైలికి ఇది ప్రతి రోజూ ఒక సవాలును విసురుతుంది. మనిషి శారీరక తత్వం, వాతావరణం, వంశానుగత చరిత్ర, గాలి, నీరు, ఆహారం వీటిలో కలిగే మార్పులు, కాలుష్యాలు మన రక్తంలో కలిగే మార్పుల వల్ల ఈ అలర్జీ సమస్య మొదలవుతుంది. కొందరికి, కొన్ని ఆహార పదార్థాలు, లేదా కొన్ని వస్తువులు అలర్జీని కలిగిస్తుంటాయి. కొందరికి జన్యుపరమైన కారణాలతో కూడా ఈ సమస్య రావచ్చు. వాటిలో ముఖ్యంగా భౌతికంగా ఉన్న కవలల్లో అలర్జీ ఉంటే 70 శాతం వరకు ఒకే రకంగా కాకుండా 30 శాతం వరకు మాత్రమే వచ్చే అవకాశం ఉంది. మన ఆధునిక జీవనం,పారిశ్రామిక ప్రాంతాలు, పెద్ద పట్టణాల్లోని వాతావరణ కాలుష్యాలు అలర్జీలకుప్రధాన కారణంగా ఉంటాయి. సుమారు 20శాతం మంది అమెరికన్లు ప్రస్తుతం ఈ అలర్జీల కారణంగా సతమతమవుతు న్నారు. మన శరీరంలో అలర్జీకి సంబంధించి చర్మం, ఊపిరితిత్తులు,జీర్ణకోశభాగాల్లో ఎక్కువగా ప్రభావం చూపుతుంటాయి.ఒకసారిఅలర్జీ ఉందనితెలిసి పోయాకదాన్ని నివారించేందుకు మన జీవన విధానాల్లో మార్పులు చేసుకుంటే కొంత మేరకు అలర్జీ బారినుంచి తమనుతాము కాపుడుకోవచ్చు.

**అలర్జీమూలం:** అలర్జీఅంటే శరీరరోగనియంత్రణా శక్తి యొక్క అసందర్భ ప్రతిచర్య ఇది ఇతరుల మీద ఏ విధమైన దుష్ప్రభావాన్ని చూపదు. అలర్జీని ఉత్పన్నం చేసే పదార్థాలను 'అలర్జెన్స్' అంటారు. వాటికి సంబంధించిన వాటిలో పోలెన్ మొక్కల్లో ఉండే పుప్పొడిపదార్థం మోల్డ్(ఫంగస్)జంతువులకు సంబంధించిన ఉన్ని, పాలు, గుడ్లు, ఇతర ఆహార పదార్థాలు, రసాయనాలు, మందులు దూళివంటివి ప్రధానమైనవి. **అలర్జీ సమస్యలు:** అలర్జీ రాగానే శరీరంలో ఐజిఈ అనే ప్రత్యేక యాంటీబాడీలు విడుదలై అలర్జెన్ పదార్థాన్ని చుట్టి వేస్తాయి. ఈ యాంటీబాడీలను రక్తంలోఉండే మాస్ట్‌సెల్స్ పట్టి వేస్తాయి. ఈ సెల్స్ శ్వాస కోశాల్లో, అన్నవాహికలో జి.ఐ.ట్రాక్ట్, ఇతర చోట్లలోఉంటాయి. అందువల్ల శ్వాసకోశాల్లో, జీర్ణకోశాల్లో అలర్జీకి సంబంధించిన పలుబాధలు మొదలవుతాయి. అలర్జీలవల్ల యాంటీ బాడీలు తయారయినపుడు మాస్ట్‌సెల్స్ ద్వారా హిస్టామిన్ అనేపదార్థం విడుదల అవుతుంది. అలర్జీ బాధలకు ఈ హిస్టామిన్ రసాయనమే మూలకారణం. అలర్జెన్స్ గాలిలో ఉన్నప్పుడు కళ్లలో, ముక్కుల్లో దురద, ఊపిరితిత్తుల్లో బాధలు కలుగుతాయి. **అలర్జీ తీవ్రతను బట్టి మూడు రకాలున్నాయి:** మామూలు, ఎక్కువ, అతిఎక్కువ అలర్జీలున్నాయి. **1.మామూలు రకం:** ఏభాగానికి చెందిన అలర్జీ అయినా అక్కడ ఉండే బాధలు. ఉదా॥ కళ్లు, దురద, ఎర్రవగుట, నీరు కారటం. **2. ఎక్కువ:** కొంచెం ఎక్కువగా ఉంటుంది. ఇతర శరీర భాగాలకు వ్యాపిస్తుంది. ఆయాసం, ఒళ్లంతా దురద ఉండవచ్చు. **3.అతిఎక్కువ:** ఇదిచాలా తక్కువ కేసుల్లోచూడవచ్చు, కాని తీవ్ర పరిణామం ఉంటుంది. శీఘ్రంగా స్పృహకోల్పోవటం, కళ్లదురద, ఒళ్లు దురద, కడుపునొప్పి,వాంతులు, విరేచనాలు, కొంకర్లు

**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**



పోవటం, వాపు,శ్వాసలోఇబ్బందులు, తల తిరగటం, బ్లడ్‌ప్రషర్, నాడీ వేగంతగ్గటం, ఒక్కో సారి ప్రాణం కూడా పోవచ్చు. **అలర్జీ అందరికీ ఉంటుందా?** తల్లిదండ్రుల నుంచి పిల్లలకు వంశపారంపర్య ఆస్తిగా పరిగణించవచ్చు. తల్లిదండ్రులకు ఇద్దరికీఉంటే 75 శాతం మందిపిల్లలకు అలర్జీ రావచ్చు. ఒక్కరికే ఉంటే 50 శాతం వరకు వ్యాధివచ్చే అవకాశముంది. వ్యాధి లక్షణాలు. తుమ్ములు, ఆయాసం, శ్వాసలో ఇబ్బందులు, కొంకర్లు పోవటం, వాంతులు కావటం, వ్యాధితీవ్రతను బట్టి లక్షణాలనుమారవచ్చు.

**హోమియోచికిత్స:** హోమియోపతిలో అలర్జీకి అద్భుతమైన చికిత్సఉంది. అలర్జీ ఏకారణం వల్ల వస్తుంది. ఎంతతీవ్రంగా ఉంది. తీవ్రతనుబట్టి మందులు ఇవ్వడం జరుగుతుంది. ఆర్సెనిక్ ఆల్బ్, అక్టాయురిన్స్,రస్టాక్స్,ఆరమ్‌డైపిలమ్,అలియంసెప, ఇప్రికియు, బెల్లడోన, నెట్రమ్‌మూర్ మందులు అలర్జీ నివారణకు ఉపకరిస్తాయి. వ్యాధి కారణాలు, లక్షణాలను బట్టి హోమియోలో ఇంకా చాలా మందులు ఇస్తాం.



# డయాబెటీస్ - ఆయుర్వేదం

ఎవరుచెప్పారు? డయాబెటీస్ వ్యాధి ఇక జీవితాంతం సమస్య అని, ఇప్పుడు స్టార్ ఆయుర్వేద మీకొరకు తీసుకొని వచ్చింది. ప్రపంచ ప్రామాణికమైన అత్యున్నత సౌకర్యాలు కలిగిన వైద్యం. దీనితో మీ సమస్యలన్నీ పరిష్కార మవుతాయి.

ఈ రోజు భారతదేశంలో ప్రతి 100 మందిలో 14 మంది డయాబెటీస్ బారిన పడుతున్నారు. ఈ వ్యాధి దుష్ఫలితాలు. విపరీతమైన దాహం. అధిక మూత్రవిసర్జన. ఆకలి ఎక్కువగా ఉండటం, ఎంత ఆహారంతీసుకున్నా శక్తి లేక పోవడం, బలహీనంగాఉండటం. బరువు తగ్గడం, నీరసం, నిస్సత్తువ, చూపు మందగించటం, మబ్బుగా, మసకగా కనిపించటం, ఎక్కువ అలసట, కాళ్ళు లాగడం, ఏదైనా దెబ్బలు (గాయాలు) తగిలితే త్వరగా తగ్గక పోవడం. కొన్నేళ్ళ తర్వాత శరీరం లోని గుండె, మెదడు, కాళ్ళు, చేతలలోని పెద్ద రక్తనాళాలు దెబ్బ తినడం. చిన్న రక్తనాళాలు దెబ్బతిన్నందు వల్ల కంటిలోని రెటీనా దెబ్బ తినటం. నరాల బలహీనత, కళ్లుమంటలు, మానసిక, సెక్స్ సమస్యలు.నిత్యం వాడే షుగర్ వ్యాధి నిరోధక పాశ్చాత్య రసాయనాలు చర్మంమీదమచ్చలు, తలనొప్పి, జీర్ణ సంబంధిత సమస్యలకు కారణమవుతా యి. దాంతో పాటు అవాంఛిత ఫలితాలు కలగవచ్చు. కానీ ఆయుర్వేదంతో ప్రతికూల ఫలితాలుండవు. ఇది ఎంత ప్రభావపూర్వకమో, అంత శాశ్వతంకూడా. ఇప్పుడు స్టార్ ఆయుర్వేద సరికొత్త ఫార్ములాతో మీ ముందుకు వచ్చింది. ప్రకృతిలో ఉన్న వన మూలికలనుపయోగించి, 36సం॥ల అనుభవం తో లక్షలమంది పేషెంట్లకు ఉపశమనం కలిగించిన మందులు ఇప్పుడు మీఅందుబాటు లోకి వచ్చాయి. మీరు ఎనేళ్ళ నుండి బాధపడు తున్నారు, ఇది అనువంశి కమా లేదా మానసిక ఒత్తిడి వల్ల వచ్చిందా? రోగలక్షణాలకు మీ వ్యాధి తీవత్రకు మా నిపుణులైన డాక్టర్లు అమూలాగ్రం పరిశీలించి, మందులు ఇస్తారు. ఈ మందులు మొదలు పెట్టాక వాటిని మెల్లమెల్లగా పాశ్చాత్య రసాయనిక మందులు తగ్గించబడతాయి. ఈ అత్యాధునిక ఫార్ములాతో కూడిన మందులు వల్ల మీకు సరికొత్త జీవితం ఖాయం. డయాబెటీస్‌ను వ్యాధిగా భావించ కండి. అది కేవలం మీరు చేయువలసిన జీవితవిధానాలలో మార్పులను సూచిస్తుంది. మీ జీవితంలో మార్పును తీసుకు వచ్చి దానిని కంట్రోలులో ఉంచడమే కాదు. ప్రీ-డయాబెటిక్స్‌తో పూర్తిగా తగ్గించవచ్చు.

ఉదా॥ అత్యాధునిక స్టార్ ఆయుర్వేద మందులతో పాటు పీచుపదార్థాలు అధికంగా తీసుకోవడం, ఉప్పు, చక్కెర సంబంధిత పదార్థాలు అధికంగా తీసుకోవడం, వ్యాయామం చేయుడం ద్వారా డయాబెటీస్‌ను శాశ్వతంగా పరిష్కరిచవచ్చు. సంప్రదాయ, అత్యాధునిక టెక్నాలజీ, అత్యాధునిక మందులు 36 సం॥ల అనుభవం కలిగిన ఆయుర్వేద డాక్టర్‌లు ఇప్పుడు స్టార్ ఆయుర్వేదలో మీకు అందు బాటులోఉన్నారు. డయాబెటీస్ గురించి బాధ పడకండి. దానిని మీరు సరైన శ్రద్ధతో కంట్రోలు లో ఉంచు కోకపోతే మెల్లిమెల్లిగా అది మీ శరీరాన్ని కబలిస్తుంది. 5000 ఏళ్ల ఆయుర్వేద వైద్య విధానం ఇప్పుడు అత్యా ధునిక టెక్నాలజీరూపంలో మీ సేవకై వచ్చింది మా స్టార్ ఆయుర్వేద.

**డా. మనోహర్.** M. D (Ayurveda)
**స్టార్ ఆయుర్వేద**

వెంట మాటల ప్రవాహం.

"తల్లిపాలు తాగని పిల్లల్లో ఉబ్బసవ్యాధి లక్షణాలు ఎక్కువగా ఉంటాయి. డయేరియా వంటి వ్యాధులవల్ల కలిగే శిశుమరణాల నివారణలో తల్లిపాలు ఎంతగానో తోడ్పడతాయి. పిల్లలకు మొదటి ఆరునెలలూ తల్లిపాలే సరిపోతాయి. ఇంకేం ఇవ్వనక్కర్లేదు. తల్లిపాలలో నీరు, నాణ్యమైన మాంసకృత్తులు, కొవ్వు, పిండి పదార్థాలు లాక్టోజ్ రూపంలో ఉంటాయి. జలుబు, దగ్గు, శ్వాససంబంధ ఇబ్బందులు, అలర్జీ, ఊబకాయం, మధుమేహంవంటి వ్యాధులనుంచి తల్లిపాలు రక్షణ కల్పిస్తాయి" తల్లిపాల విశిష్టత గురించి భార్యకున్న ఇంత విషయపరిజ్ఞానం చక్రవర్తిని ఆశ్చర్యానికి గురిచేసింది. ఇన్ని విషయాలు ఎక్కడ తెలుసుకుందా? అనిపించింది.

"ఏమండి... చాలామంది తల్లులు బిడ్డకు పాలిస్తే అందం తగ్గిపోతుందన్న భ్రమలో ఉంటారు. కానీ పిల్లలకు పాలివ్వకపోవడంవల్ల కోరి ప్రమాదాలు కొని తెచ్చుకుంటున్నట్టు గ్రహించరు. పాలివ్వకపోవడంవల్ల రొమ్ము, గర్భాశయ ముఖద్వార కేన్సర్‌లకు గురయ్యే అవకాశం ఉంది. ఎముకలు గుల్లబారిపోతాయి. చక్కెర వ్యాధి బారినపడొచ్చు. పిల్లలకు పాలిస్తే గర్భిణీగా ఉన్నప్పుడు శరీరంలో పేరుకుపోయిన కొవ్వు నిల్వలు కరుగుతాయి. ఇలాంటి ప్రమాదాలేవీ తల్లికి ఉండవు" తల్లి నోటినుంచి వస్తున్న ఒక్కో మాట జాహ్నవి గుండెల్లో శూలాల్లా గుచ్చుకుంటున్నాయి. తను పాలివ్వడానికి నిరాకరించడం ఎంత ప్రమాదమో తల్లి విడమరిచి చెబుతుంటే తన కన్నబిడ్డ విషయంలో తను ఎంత తప్పు చేసిందో తెలిసొచ్చింది జాహ్నవికి. గుండె బరువెక్కింది. పశ్చాత్తాపంతో హృదయం ఆర్ద్రమైంది. కళ్ళల్లో కన్నీరు పెల్లుబికింది.

"సారీ... అమ్మా" అంది.

"నాకెందుకుతల్లీ సారీ. అదేదో నీ కొడుక్కే చెప్పు" నీ బిడ్డేకాదు. ఏ బిడ్డకైనా అందాల్సిన సమయంలో తల్లిపాలు అంది తీరాలి. నిరాకరించే అధికారం ఏ తల్లికీ లేదు. నాకే అధికారం ఉంటే, దీనిపై చట్టంకూడా చేద్దును" అంది విద్యాధరి.

"జాహ్నవి చంటాణ్ణి ఆర్తిగా గుండెలకు అదుముకుంది. గబగబా వాడి నోటికి స్తన్యం అందించింది. ఆ పసివాడు ఆబగా పాలుతాగుతుంటే జాహ్నవిలో పాలధారలు ఉరకలెత్తాయి. చంటాడు కాళ్ళూపుతూ పాలుతాగుతున్న దృశ్యం జాహ్నవిలో ఏదో తెలియని మాతృత్వ పరవశానికి గురిచేసింది. ఆ అనుభూతి మాటలకందనిది. ప్రకృతి ప్రసాదించిన తల్లీబిడ్డల అనుబంధానికి ఇదే తొలిమెట్టు. దీన్ని తోసిరాజని ఇన్ని రోజులూ ఎలా ఉండగలిగాననుకుంది. తను చేసింది మామూలుతప్పు కాదనిపించింది. కళ్ళు తెరిపించిన అమ్మకు మనసులోనే కోటి క్షమాపణలు చెప్పుకుంది.

సెల్:92914 01521




# ముచ్చటైన సాయంత్రం... మూడు పుస్తకాల ఆవిష్కరణ

అక్టోబర్ 27, గురువారం... చలి పూర్తిగా కమ్ముకోని చల్లని సాయంత్రం... హైదరాబాద్ బంజారాహిల్స్ రోడ్డు నంబర్ 8, సప్తపర్ణి చక్కనిలోగిట్లో జంటనగరాల సాహిత్య ప్రియులు, రచయితలు, రచయిత్రులు సరదాగా సమావేశమయ్యారు. బాధ్యతలు తీరిన వయసులో, అయిదారేళ్ళక్రితం ఆలస్యంగా రచన ఆరంభించినా, గుర్తుంచుకోదగ్గ కథలతో, నవలలతో, పాఠకుల ప్రశంసల్నీ, పోటీల్లో బహుమతుల్నీ పొందిన అనురాధ (శ్రీమతి సుజల గంటి), రాసిన 'పునీతులు', 'సప్తపది', 'మనసా ఎటులోర్తునో' నవలల ఆవిష్కరణ సభ ఆహ్లాదకర వాతావరణంలో ఓ ఆత్మీయ వేడుకలా సాగింది. ముఖ్య అతిథిగా విచ్చేశారు ప్రముఖ కథా రచయిత, 'నవ్య' వారపత్రిక సంపాదకులు శ్రీ ఎ.ఎన్.జగన్నాథశర్మ.

ఎన్నో దశాబ్దాలుగా తెలుగునాట కథ, నవలలాంటి వచన రచన ప్రక్రియల్లో రచయిత్రులు పోషించిన పాత్ర అమోఘమైనదని ఆయన ఉదాహరణపూర్వకంగా వివరిస్తూ, తనను ప్రభావితంచేసిన రచయిత్రుల గురించి, వారి రచనల గురించి పేర్కొన్నారు.

తమ రచనలద్వారా తెలుగునాట పాఠకుల సంఖ్య పెంపొందించిన ఘనత నిస్సందేహంగా రచయిత్రులదేనని చెబుతూ, ప్రస్తుత క్రియాశీల రచయిత్రులు సమస్యల్ని కొత్త కోణంలో చిత్రించేందుకు ప్రయత్నించాలని జగన్నాథశర్మ సూచించారు.

అనంతరం నవలల పరిచయ కార్యక్రమం జరిగింది. 'పునీతులు' నవలను ప్రముఖ కవి, రచయిత సుధామ, 'సప్తపది' నవలను ప్రముఖ రచయిత్రి పొట్లూరి విజయలక్ష్మి, 'మనసా ఏటులోర్తునో...' నవలను డాక్టర్ కె.బి.లక్ష్మి ప్రేక్షకులకు పరిచయం చేశారు.

ప్రతికూల కుటుంబపరిస్థితుల నేపథ్యంలో ఆత్మన్యూనతకు గుర్రై, మాదకద్రవ్యాలకు బానిసగామారి, చివరికి ఓ స్వామీజీ బోధనల ప్రభావంతో సాధారణ జీవనస్రవంతిలో కలిసిన ఓ వ్యక్తి జీవితాన్ని 'పునీతులు' నవలలో చిత్రించారు రచయిత్రి సుజల గంటి. అదేవిధంగా అర్థంపర్థంలేని కారణాలతో ఆవేశంతోకూడిన అనాలోచిత నిర్ణయంద్వారా విడాకుల వరకు వెళ్ళిన ఓ వివాహబంధం తిరిగి గాడిలో పడినవైనం 'సప్తపది'లోను, జీవిత చరమాంకంలో తల్లి మనసుపొరల్లో మరో వ్యక్తి ఉన్న సంగతిని సానుభూతితో గుర్తించి, తల్లి మనసుకు సాంత్వన చేకూర్చేందుకు ఆమె కుమార్తెచేసిన ప్రయత్నాన్ని 'మనసా ఎటులోర్తునో'లోను సామాన్య పాఠకుల హృదయాల్ని సైతం హత్తుకునేలా సుజల గంటి అక్షరబద్ధం చేశారు. సభకు ఆత్మీయ అతిథి, ప్రముఖ వైణికవిద్వాంసుడు అయ్యగారి శ్యామసుందరరావు సంగీత, సాహిత్యాల మైత్రిని గురించి మాట్లాడారు. చివరిలో రచయిత్రి తన జీవితంలో గుర్తుంచుకోదగ్గ వ్యక్తులకు తన మూడు నవలలను అంకితమిచ్చిన సందర్భాన్నీ, తన సాహిత్య వ్యాసంగంలో తన అనుభవాల్ని క్లుప్తంగా తెలియజేసి, పుస్తక ప్రచురణకర్త జ్యోతి వలభోజును సత్కరించారు. ప్రముఖ రచయిత్రి మంథా భానుమతి ఈ సభను నిర్వహించారు.

ప్రముఖ రచయిత్రి మన్నెం శారద అరవయ్యో పుట్టినరోజు వేడుక ఈ వేదికమీద జరపడం సభ ముగింపులో ఒక హైలైట్. గంటిమూర్తి వందన సమర్పణతో కార్యక్రమం ముగిసింది.

**-ఓలేటి శ్రీనివాసరావు భాను**

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## అన్ని 'అలర్జీ' సమస్యలకు సరైన పరిష్కారాలు



డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

ప్రపంచంలో దాదాపుగా ఎక్కువ శాతం ప్రజలు తమ జీవితకాలంలో ఏదో ఒక సందర్భంలో ఏదైనా ఒక అలర్జీ బారిన పడుతూనే ఉంటారు. ఉన్నట్టుండి వరుసబెట్టి తుమ్ములు రావడం, ముక్కు నుండి నీరు కారడం, జలుబు, కళ్ళు ఎరుపెక్కడం, ముఖంలో వాపు, చర్మంపైన దద్దుర్లు రావటం, దురద పెట్టటం, గొంతు గరగర, శ్వాసలో ఇబ్బందులు, ఆయాసం వంటి లక్షణాలన్నీ అలర్జీ వలననే కలుగుతుంటాయి. ఇవి కొన్ని సార్లు స్వల్పమైన అనారోగ్య సమస్యలుగానే అనిపించినప్పటికీ – వీటిని నిర్లక్ష్యం చేసి, తరచూ వీటి బారిన పడితే, అవి తీవ్రమైన ఆరోగ్య సమస్యలకు దారితీయటం వలన, ఒక్కోసారి ప్రాణాంతకంగా మారే ప్రమాదం పొంచి ఉంటుంది. వీటిని తొలిదశలోనే గుర్తించి, తగిన చికిత్స అందించడం ద్వారా ఆ వ్యాధుల నుండి పూర్తిగా బయటపడటమే కాకుండా, ఇతర దుష్ప్రభావాల నుండి కూడా మనల్ని మనం కాపాడుకునే అవకాశం ఉంటుంది.



సహజంగా అలర్జీ అనేది మానవ శరీరంలోని రోగనిరోధక వ్యవస్థ యొక్క అసందర్భ ప్రతిచర్య. అనగా అలర్జీ కలిగించే పదార్థాలు ఉదా: పూలమొక్కల నుండి వచ్చే పుప్పొడి రేణువులు, దుమ్ము–ధూళి, కొన్ని రకాల ఆహార పదార్థాలు (పాలు, గుడ్లు, సోయా, చేప మొ॥వి), కొన్ని రకాల మందులు (యాంటీబయాటిక్స్, బి.పి. మందులు మొ॥వి), రబ్బరు లేదా ఇతర సరిపడని పదార్థాలను తాకడం, జంతుస్పర్శ, వాతావరణ మార్పుల వలన మన శరీరంలో నిరంతరం కొనసాగుతూ ఉండే సాధారణ క్రియకు అదనంగా మొదలయ్యే ప్రతిక్రియనే 'అలర్జీ' అని అంటారు. ఈ అలర్జీ కలిగించే పదార్థాన్ని 'అలర్జెంట్' అని, అలర్జీకి కారణమైన ప్రతిచర్యను 'అలర్జిక్ రియాక్షన్' అని అంటారు.

మనం పీల్చే గాలి, త్రాగే నీరు, తినే ఆహారంతో పాటుగా లోనికి చేరుకునే ఎన్నో క్రిములతో మన తెల్లరక్తకణాలు తీవ్రంగా పోరాటం చేస్తూ, ప్రతి నిత్యం మన ఆరోగ్యాన్ని సంరక్షిస్తుంటాయి. వ్యాధి నిరోధకశక్తికి అసలైన ప్రతీకలుగా నిలిచే ఈ తెల్లరక్తకణాలు, కొందరిలో పొరబడి, మన శరీరానికి ఏ మాత్రం  హాని తలపెట్టని పదార్థాల పట్ల కనబరిచే సున్నిత ప్రతిస్పందననే  'అలర్జీ' లేదా 'హైపర్ సెన్సిటివిటీ' అని అంటారు.

**కారణాలు:** అలర్జీ సమస్యలకు గల పూర్తి కారణాలు తెలియరాలేదు. కానీ జన్యుపరమైన అంశాలు, వంశపారంపర్యత మరియు వాతావరణ మార్పులు మొ॥ అంశాల వలన అలర్జీ కలిగే అవకాశాలు ఉంటాయని అనుభవపూర్వకంగా తెలుస్తోంది.

**అలర్జీ సమస్యలు - వివిధ రకాలు:-**

**శ్వాసకోశ అలర్జీ:** మన చుట్టూ ఉండే వాతావరణంలోని దుమ్ము, పుప్పొడి రేణువుల వలన, ఎప్పుడన్నా ఒకటి–రెండు తుమ్ములు రావడం సహజం. కానీ అలర్జీ బాధితులకు మాత్రం వరుసగా తుమ్ములు రావడం, ముక్కు నుండి నీళ్ళు కారడం, ఒక్కోసారి కళ్ళు ఎర్రబడి, అదేపనిగా నీరు కారడం జరుగుతుంది. 'అలర్జిక్ రైనైటిస్'గా పిలువబడే ఇలాంటి పరిస్థితిని గనుక అశ్రద్ధ చేస్తే ముక్కు దిబ్బడ, శ్వాస ఆడకపోవడం, కళ్ళె పడటం, ముఖం వాపునకు గురికావటం మరియు తలనొప్పి వంటి సమస్యలు ఎదురవుతాయి. ఇంతటి సమస్యాత్మకమైన పరిస్థితినే 'అలర్జిక్ సైనసైటిస్' అంటారు. అటుపై క్రమంగా – ఈ వ్యాధి గాలి గొట్టాలలోకి చేరి, ఊపిరితిత్తులకు కూడా సోకడం వలన, పొడి దగ్గు ప్రారంభమై, అటు తరువాత కళ్ళెతో కూడిన దగ్గుగా మారుతుంది. వైద్య పరిభాషలో దీనినే 'అలర్జిక్ బ్రాంకైటిస్' అని పిలుస్తారు. ఈ పరిస్థితికి ఆయాసం, పిల్లి కూతలు వంటి లక్షణాలు కూడా తోడైతే, అప్పుడది 'అలర్జిక్ ఆస్తమా' క్రింద మారుతుంది.

**స్కిన్ అలర్జీ:** అలర్జీ కలిగించే అనేక రకాల అంశాల వలన చర్మం ప్రభావితమవుతుంది. అంటే ముఖ్యంగా కొన్ని రకాల మందులు వాడటం, ఇన్ఫెక్షన్‌లు, కొన్ని రకాల ఆహారాలు లేదా ఏదైనా సరిపడని వస్తువు శరీరానికి తగిలిన వెంటనే చర్మంపై దురద, దద్దుర్లతో పాటు చర్మం ఎర్రబడటాన్ని గమనించవచ్చు. కొన్ని నిమిషాల నుండి కొన్ని గంటల వరకు పైలక్షణాలు కనపడి, అటు తరువాత పూర్తిగా మాయమవుతాయి. కానీ ఒక్కోసారి ఇవి ప్రమాదకరంగా మారిపోయే అవకాశం ఉంది.

**జీర్ణకోశం అలర్జీ:** కొన్ని రకాల ఆహార పదార్థాలు ఒంటికి సరిపడక పోవడంతో – జీర్ణకోశ అలర్జీ తలెత్తడం వలన ముఖ్యంగా నీరసం, వికారం, మలబద్ధకం వంటి లక్షణాలతో పాటు వాంతులు లేదా విరేచనాలు అయ్యేందుకు కూడా అవకాశం ఉంది.

**నిర్ధారణ పరీక్షలు:** రక్తపరీక్ష (CBP, WBC, IgE యాంటీబాడీస్), ప్యాచ్‌టెస్ట్, స్కిన్ ప్రిక్ టెస్ట్, X-RAY-PNS, CT SCAN-PNS, PFT పరీక్షల ద్వారా వివిధ అలర్జిక్ వ్యాధులను నిర్ధారించవచ్చు.

**హోమియోకేర్ చికిత్స:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో మాత్రమే లభించే అధునాతన జెనెటిక్ కాన్‌స్టిట్యూషనల్ వైద్య విధానం ద్వారా అసమతుల్యతలతో ఉన్నటువంటి రోగనిరోధక శక్తి స్థాయిలను సరిచేసి, తద్వారా మరోసారి తిరగబెట్టని రీతిలో అన్ని రకాల అలర్జిక్ వ్యాధులను పూర్తిగా నయం చేయవచ్చు. హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యంతో శరీరంలోని రోగనిరోధక శక్తి సమతుల్యం కావటంతో పాటు పైన తెలిపిన అలర్జిక్ పదార్థాలను సైతం  తట్టుకునేలా, అత్యంత సమర్థవంతంగా – బాడీ ఇమ్యూన్ సిస్టమ్ బూస్ట్ అవుతుంది. తద్వారా అన్ని ప్రతికూల పరిస్థితులలో సైతం ఆరోగ్యం నిలకడగా ఉండటం జరుగుతుంది.

టోల్ ఫ్రీ 1800 108 1212
కన్సల్టేషన్ ఉచితం 955 000 1199
www.homeocare.in






- రాజశుక

మరో ఐదు నెలల్లో ఉత్తరప్రదేశ్ శాసనసభకు ఎన్నికలు జరగబోతున్నాయి. ఇటువంటి సమయంలో పార్టీలో కుమ్ములాటలు, కుట్రలు ప్రారంభం కావడం పార్టీ విజయావకాశాలను బలహీనపరుస్తోంది. అఖిలేశ్, శివ్‌పాల్‌ల మధ్య గత కొద్ది నెలలుగా నిప్పు రాజుకుంటోంది. తన ఆదేశాలను, ఉత్తర్వులను కొందరు అధికారులు బేఖాతరు చేస్తున్నారని, దరిమిలా కొన్ని అభివృద్ధి కార్యక్రమాలు అమలు కావడంలేదని శివ్‌పాల్ కొద్ది నెలలుగా అందరికీ చెప్పుకుంటున్నారు. ప్రభుత్వంలోని సీనియర్ అధికారులపై అదుపు ఉన్న ముఖ్యమంత్రిని ఉద్దేశించే ఆయన ఈ వ్యాఖ్యలు చేస్తున్నారన్నది సుస్పష్టం. ఒకరినొకరు విమర్శించుకోవడం, ఒకరి తప్పులు మరొకరు ఎన్నడం అనేది 2014 లోక్‌సభ ఎన్నికల తరువాత నుంచి ప్రారంభమైంది. 2009 ఎన్నికల్లో 23 సీట్లు సంపాదించిన అధికార సమాజ్‌వాది పార్టీ 2014లో ఐదు సీట్లు మాత్రమే సంపాదించుకోగలిగింది.

# భస్మాసురుని పాత్రలో సమాజ్‌వాది

**ఇంతకాలం తండ్రి నీడలో కాలక్షేపం చేస్తున్న అఖిలేశ్ తన సత్తా నిరూపించుకోవడానికి తప్పటడుగులు వేస్తున్నట్లు కనిపిస్తోంది.**

**ఒక పక్క ఎన్నికలు దగ్గర పడుతున్నాయి. మరోపక్క నవంబర్ 5న లక్నోలో సమాజ్‌వాది పార్టీ రజతోత్సవాలు ప్రారంభం కాబోతున్నాయి. ఇటువంటి కీలక సమయంలో పార్టీ నిట్టనిలువునా చీలే పరిస్థితి ఏర్పడింది.**

పార్టీలోని రెండు వర్గాలు పట్టూ విడుపూ లేకుండా వారి వారి వాదనలతో భీష్మించుకు కూర్చున్నారు. ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి అఖిలేశ్ యాదవ్ ఇటీవల తన పినతండ్రి శివ్‌పాల్ యాదవ్‌ను, మరో ముగ్గురు మంత్రులను పదవుల నుంచి తొలగించడంతో అటు పార్టీలోనూ, ఇటు మంత్రివర్గంలోనూ చీలికలు తలెత్తాయి. ఇటీవలి వరకూ తన తండ్రి ములాయం సింగ్ యాదవ్, పినతండ్రులు, పార్టీలోని ఇతర బంధువుల నీడలో కాలక్షేపం చేసిన అఖిలేశ్ యాదవ్ హఠాత్తుగా తన సత్తా చూపించుకోవడానికి ప్రయత్నాలు మొదలుపెట్టడం ఓ పెద్ద సంక్షోభానికి నాంది పలికింది. తాను ప్రధానమంత్రి పీఠం అధిష్ఠించాలన్న ఆశతో ములాయం తన కుమారుడిని రాష్ట్ర ముఖ్యమంత్రి పదవిలో కూర్చోబెట్టారు. చివరికి ఆయన అనుకున్నది జరగలేదు.

అఖిలేశ్ యాదవ్ తన పినతండ్రి శివ్‌పాల్ యాదవ్‌పై కత్తి దూయడం అటు శివ్‌పాల్ యాదవ్‌కే కాక, తన తండ్రి, పార్టీ అధినేత ములాయం సింగ్ యాదవ్‌కు కూడా ఓ సవాలుగా మారింది. ఆయన శివ్‌పాల్ యాదవ్ తదితరులను మంత్రివర్గం నుంచి తొలగించిన మరుక్షణం అఖిలేశ్ సన్నిహితుడు, పార్టీ ప్రధాన కార్యదర్శి రామ్‌గోపాల్ యాదవ్‌ను పార్టీ నుంచి ఆరేళ్ళపాటు బహిష్కరించారు. అఖిలేశ్‌కు బాహాటంగా వత్తాసు పలకడమే కాకుండా, అఖిలేశ్‌కు అనుకూలంగా ములాయంకు రెండు లేఖలు రాయడం కూడా రామ్‌గోపాల్ బహిష్కరణకు కారణమైంది. ఇది ఇలా ఉండగా, ములాయం సన్నిహితుడు అమర్ సింగ్, ములాయం రెండవ భార్య ఈ ఇద్దరు నాయకుల మధ్య చిచ్చు పెడుతున్నారంటూ అఖిలేశ్ వర్గీయులు కొందరు తీవ్ర ఆరోపణలు మొదలుపెట్టారు. అయితే, ఈ ఇద్దరి విభేదాలతో తనకేమీ సంబంధం లేదంటూ అమర్ సింగ్ ప్రకటన చేశారు. రామ్‌గోపాల్‌కు పార్టీ నుంచి ఉద్వాసన చెప్పడం వెనుక అమర్‌సింగ్ హస్తముందని అఖిలేశ్ వర్గీయులు అభిప్రాయ పడుతున్నారు. సమాజ్‌వాది పార్టీకి ఢిల్లీలో అంటే కేంద్రం స్థాయిలో సంధాతగా ఉన్న అమర్‌సింగ్ తన వర్గీయుల ద్వారా అఖిలేశ్‌ను బలహీనపరిచేందుకు కృషి చేస్తున్నారని అఖిలేశ్ సన్నిహితులు భావిస్తున్నారు.

## అంతర్గత కుమ్ములాటలు

గత లోక్‌సభ ఎన్నికల్లో పార్టీ దెబ్బతినడాన్ని దృష్టిలో పెట్టుకుని పార్టీ సీనియర్ నాయకుల్లో కొందరు అఖిలేశ్‌పై విమర్శలు సంధించడం ప్రారంభించారు. అఖిలేశ్‌ను పదవి నుంచి తొలగించి తానే ముఖ్యమంత్రి పదవి చేపట్టాలని ఈ సీనియర్ నాయకులంతా ములాయంసింగ్ యాదవ్‌పై ఒత్తిడి తీసుకువచ్చారు. అయితే, ములాయం తన కుమారుడు అఖిలేశ్‌కే అండగా



నిలిచారు. పైగా ఎన్నికల్లో సరైన పనితీరును, సామర్థ్యం ప్రదర్శించనందుకు ములాయం కొందరు సీనియర్ నాయకులను పార్టీ పదవుల నుంచి తొలగించారు. మొదటి నుంచీ తండ్రి చాటు బిడ్డగానే ఉంటూ వచ్చిన అఖిలేశ్ కొన్ని ప్రాజెక్టులు, పదవులు, నియామకాలు వగైరాల విషయంలో తండ్రిని కూడా కాదనే స్థితికి చేరుకున్నాడు. ఇది పార్టీ సీనియర్ నాయకులకు, ముఖ్యంగా ములాయం-శివ్‌పాల్ వర్గీయులకు కంటగింపైంది.

గత సెప్టెంబర్ 12న అఖిలేశ్ తన మంత్రివర్గంలోని ఇద్దరు శక్తిమంతమైన సభ్యులు గాయత్రీ ప్రసాద్ ప్రజాపతి, రాజ్ కిశోర్ సింగ్‌లను పదవులనుంచి తొలగించారు. ఆ మరునాడు ఆయన శివ్‌పాల్‌కు సన్నిహితుడైన ప్రభుత్వ ప్రధానకార్యదర్శి దీపక్ సింఘాలను పదవి నుంచి తప్పించారు. అంతేకాదు, శివ్‌పాల్ అధీనం నుంచి కీలక ప్రజా పనుల శాఖ, నీటి పారుదల శాఖలను లాగేశారు. ఇది చూసి వెంటనే రంగంలోకి దిగిన ములాయం సింగ్ సమాజ్‌వాది పార్టీ రాష్ట్ర శాఖ అధ్యక్ష పదవి నుంచి అఖిలేశ్‌ను తొలగించి, ఆయన స్థానంలో శివ్‌పాల్‌ను నియమించారు. కొద్ది రోజులకే శివ్‌పాల్ తన అధీనంలోని కొన్ని శాఖలకు, పార్టీ పదవులకూ రాజీనామా చేశారు. ఆ తరువాత లక్నోలోని పార్టీ ప్రధాన కార్యాలయంలో సమావేశం జరిగినప్పుడు అఖిలేశ్ వర్గీయుల, శివ్‌లాల్ వర్గీయుల మధ్య బాహాబాహీ, ముష్టాముష్టీ చోటు చేసుకుంది. ఇది పార్టీ ప్రతిష్ఠను బజారుకీడ్చింది.

చివరికి ములాయం జోక్యం చేసుకుని, సెప్టెంబర్ 26న ప్రజాపతికి మంత్రివర్గంలో మళ్లీ అవకాశం కల్పించారు. శివ్‌లాల్‌ను మాత్రం పార్టీ అధ్యక్షుడిగా కొనసాగించారు. కాగా, అక్టోబర్ 1న అఖిలేశ్ మరోసారి శివ్‌లాల్ మీద విరుచుకుపడ్డారు. ఆయన అధీనం నుంచి సాంఘిక సంక్షేమం, చిన్న తరహా నీటి పారుదల శాఖలను తప్పించారు. ఈ శాఖలను ఇతర మంత్రులకు పంచారు. తమ పార్టీతో క్వామీ ఏక్తా దళ్ విలీనం చెందినట్టు జూన్ 21న శివ్‌పాల్ ప్రకటించారు. అఖిలేశ్ దీన్ని గట్టిగా వ్యతిరేకించారు. విలీనం నిర్ణయాన్ని రద్దు చేస్తూ సమాజ్‌వాది పార్లమెంటరీ బోర్డు ఒక తీర్మానం చేసింది. శివ్‌పాల్ మాత్రం విలీనం జరిగిపోయిందని, దీని గురించి ప్రత్యేకంగా ప్రకటన జారీ చేయాల్సిన అవసరం లేదని వ్యాఖ్యానించారు.

## పట్టువదలని పినతండ్రి

అంతేకాదు, 81 మంది సభ్యుల సమాజ్‌వాది పార్టీ రాష్ట్ర కార్యనిర్వాహక సమితిలో అంతా తన వారికే శివ్‌పాల్ అవకాశం కల్పించారు. అఖిలేశ్ వర్గీయులందరినీ ఒక్క వేటుతో తొలగించారు. వచ్చే ఎన్నికల్లో ముఖ్యమంత్రి అభ్యర్థి ఎవరని ఓ సమావేశంలో విలేఖరులు ములాయం సింగ్‌ను ప్రశ్నించగా, శాసనసభ ఎన్నికల తరువాత పార్టీ పార్లమెంటరీ బోర్డు, శాసనసభ్యులు కలిసి నిర్ణయం తీసుకుంటారని ఆయన సమాధానం ఇచ్చారు. కాగా, పార్టీ జాతీయ ఉపాధ్యక్షుడు కిరణ్మయ్ నందా మాత్రం 2017 శాసనసభ ఎన్నికల్లో అఖిలేశ్ యాదవే ముఖ్యమంత్రి అభ్యర్థి అని అధికారికంగా ప్రకటించారు. మొత్తానికి పార్టీలో విభేదాలు ఇక చక్కదిద్దలేనంత స్థాయికి చేరిపోయాయి.



ఈ విభేదాలు, గొడవలతో పార్టీ పరిస్థితి భారతీయ జనతా పార్టీ, బహుజన్ సమాజ్ పార్టీల కంటే బలహీనపడిపోయింది. సమాజ్‌వాది పార్టీ ఎన్నికల ప్రచారం కూడా క్రమంగా పక్కదారి పడుతోంది. ప్రభుత్వ వ్యతిరేకతే కాకుండా, బీజేపీ, బీఎస్‌పీల నుంచి కూడా గట్టి వ్యతిరేకత ఎదురవుతోంది. నవంబర్ మొదటి వారం

**ఐదు నెలల్లో ఉత్తరప్రదేశ్ శాసనసభకు ఎన్నికలు జరుగనున్న కీలక సమయంలో సమాజ్‌వాదీపార్టీ నిట్టనిలువునా చీలే పరిస్థితి ఏర్పడింది. ముఖ్యమంత్రి అఖిలేశ్ యాదవ్ వైఖరి పార్టీలో పెద్దసంక్షోభానికి నాంది పలికింది. రాష్ట్రంలో ముస్లిం ఓటర్లు, అగ్రశ్రేణివర్గం ఓటర్లు పార్టీకి దూరమయ్యే అవకాశాలున్నాయని సమాజ్‌వాదీ వర్గాలు ఆందోళన చెందుతున్నాయి. ఆ పార్టీ రజతోత్సవ వేడుకలవేళ దాని పయనం ఎటు?**

నుంచి పార్టీ రజతోత్సవాలు ప్రారంభం అవుతాయని, ఆ తరువాత నుంచి ఎన్నికల ప్రచారం కూడా ఊపందుకుంటుందనీ పార్టీ పెద్దలు ప్రకటించగా, నవంబర్ మొదటి వారం నుంచి తాను సమాజ్‌వాది వికాస్ రథ్‌యాత్ర కార్యక్రమాన్ని చేపట్టనున్నట్టు అఖిలేశ్ ప్రకటించారు. అంటే, పార్టీ రజతోత్సవాల్లో అఖిలేశ్ పాల్గొనబోవడం లేదని అర్థమవుతోంది.

సమాజ్‌వాది పార్టీలోని ఈ విభేదాలు, కుమ్ములాటలను కాంగ్రెస్ సన్నిహితంగా పరిశీలిస్తోంది. ఈ కుమ్ములాటలవల్ల తమ పార్టీ ప్రయోజనం పొందడం ఖాయమని ఆ పార్టీ నేతలు బాహాటంగానే చెప్పుకుంటున్నారు. గత రెండు దశాబ్దాల నుంచి తమ అంతర్గత విభేదాలను అవకాశంగా తీసుకుని సమాజ్‌వాది, బహుజన్ సమాజ్ పార్టీలు లబ్ధి పొందుతున్నాయని, ఈసారి తమ వంతు వచ్చిందని కాంగ్రెస్ నేతలు ప్రచారం చేసుకుంటున్నారు. సమాజ్‌వాది పార్టీకి ముస్లిం ఓట్లు దూరమవుతాయని, బీఎస్‌పీ కూడా అంతర్గత కుమ్ములాటలతో అవస్థలు పడుతున్నందువల్ల, ముస్లింలు, బలహీనవర్గాల ఓట్లు తమకు పడడం ఖాయమని ఉత్తరప్రదేశ్ కాంగ్రెస్ ఉపాధ్యక్షుడు రాజారాం పాల్ ఆశాభావం వ్యక్తం చేశారు. కాంగ్రెస్ పార్టీకి బలమైన ఓటు బ్యాంకుగా ఉన్న ముస్లింలు, దళితులు, బ్రాహ్మణులు 1992లో బాబ్రీ మసీదు కూల్చివేత జరిగినప్పటి నుంచి సమాజ్‌వాది, బీఎస్‌పీ పార్టీలకు మారిపోయారు. ఉత్తరప్రదేశ్‌లో 20 శాతం ఉన్న ముస్లిం ఓటర్లు తాము సమాజ్‌వాది పార్టీతో ఉండి ప్రయోజనమేమీ లేదని, ఈసారి బీఎస్‌పీకే ఓటు వేయాలని భావిస్తున్నారు. కనీసం పది శాతం ముస్లింలు బీఎస్‌పీకి ఓటు వేసినా అక్కడి రాజకీయ పరిస్థితి మారిపోతుంది. బ్రాహ్మణులను కూడా తమ వైపు తిప్పుకోవడానికి బీఎస్‌పీ నాయకురాలు మాయావతి రకరకాలుగా ప్రయత్నం చేస్తున్నారు.

బ్రాహ్మణులతో సహా వివిధ అగ్రశ్రేణి వర్గాలు ఈసారి బీజేపీవైపు కూడా మొగ్గు చూపే అవకాశం ఉందని సమాజ్‌వాదిపార్టీ వర్గాలు ఆందోళన చెందుతున్నాయి. ఉత్తరప్రదేశ్‌లో ఎటువంటి పరిస్థితుల్లోనూ బీజేపీని అధికారంలోకి రాకుండా చూడాలని సమాజ్‌వాది పార్టీ గట్టి పట్టుదలతో ఉంది. ఈసారి ఏదో విధంగా అధికారంలోకి రావాలని బీజేపీ గట్టిగా భావిస్తోంది. కాంగ్రెస్ కూడా తమ బలం పెంచుకునేందుకు తాపత్రయపడుతోంది. ప్రభుత్వ ఏర్పాటులో తమకు కూడా పాత్ర ఉండాలని అది భావిస్తోంది. బీజేపీ అధికారంలోకి రాకుండా ఉండేందుకు కాంగ్రెస్ అవసరమైతే బీఎస్‌పీ, ఎస్‌పీలతో చేతులు కలుపుతుందని కాంగ్రెస్ నాయకులు ప్రకటనలు చేస్తున్నారు. శక్తిమంతమవుతున్న ప్రత్యర్థుల వ్యూహాలకు ప్రతివ్యూహాలను రచించుకోవాల్సిన స్థితిలో సొంత పార్టీలో కుమ్ములాటలతో సతమతం కావడం సమాజ్‌వాదికి ఒక విధంగా దురదృష్టం, అశుభ శకునమే మరి!

నవ్య

# మహానంది 6



-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**నంది గమ్యం లేని వాడిలా నగర వీధుల్లో నడుస్తూ ఉండిపోయాడు. విశాలమైన వీధులు. వీధి వీధికీ, ప్రధాన ప్రదేశాలలో ఆలయాలు. శివుడు, విష్ణువు, శ్రీరాముడు, ఆంజనేయుడు, ఆదిశక్తి...అందరూ ఆలయాలలో కొలువుదీరి ఉన్నారు. నగరంలో శివ భక్తులు ఉన్నారు. విష్ణు భక్తులున్నారు. రామ భక్తులున్నారు. ఆదిశక్తి భక్తులున్నారు. శైవమూ, వైష్ణవమూ, శాక్తేయమూ అన్నీ ఉన్నాయి. తన కామరూప నగరంలో ప్రధాన దేవత కామరూపాంబికే! వీధి వీధికీ భవనాలలో, ఆలయ నిర్మాణాలలో తేడాలున్నాయి. తాను నాలుగైదు వీధులలో పర్యటించినట్టున్నాడు.**

నంది కడుపులో రగలడం ప్రారంభించిన ఆకలి అతనికి సమయాన్ని గుర్తు చేస్తోంది. తను పర్యటించినవన్నీ ప్రధానమైన, సుసంపన్నమైన వీధులు. ఎత్తయిన, విశాలమైన భవనాలు ఆ విషయాన్ని కళ్ళకు కడుతున్నాయి. ఇవన్నీ అడిగిన వారికి, చేయిచాచిన వారికి భిక్షం పెట్టే గృహాలున్న వీధులు! ఈ వీధులలో ఉన్నవన్నీ తను ఎక్కలేని సోపానాలూ, తొక్కలేని గడపలూ ఉన్న సంపదసదనాలు! తను అతి సామాన్యులు నివసించే ఉపవీధులకు చేరుకోవాలి. అసామాన్యులు తనలాంటి 'అనాథ'లను ఆదరించరు! ఆదరించాలని ఆశించడం కూడా ధర్మం కాదు. తన విశ్లేషణకు తానే నవ్వుకుంటూ నంది నేలబారుగా ఉండే ఉపవీధులనూ, సామాన్య ప్రజలు నివసించే వాడలనూ అన్వేషిస్తూ ముందుకి సాగాడు.

చాలాసేపటికి, వందల గజాల పొడవు ఉన్న విశాలమైన వీధి చివరికి చేరుకున్నాడు నంది. ఎదురుగా ఎత్తైన గోపురంతో బ్రహ్మాండమైన ఆలయం ఉంది. వీధి సన్నగిల్లి, కుడివైపు తిరిగింది. నంది వినయంగా దాన్నీ అనుసరించాడు. అతనిలో నిద్ర లేచిన ఆకలి పూటకూళ్ళ గృహాన్ని వెతకమంటోంది. తనున్నది మహానగరం. పూటకూడు దొరక్కపోదు. నంది నడుస్తున్నాడు. జనం అటూ యిటూ నడుస్తున్నారు. ఇళ్ళ ముందున్న అరుగుల మీద కూర్చున్న పురుషులు తాంబూలాలు సేవిస్తున్నారు. రాత్రి భోజనాలు ముగించినట్టున్నారు. నంది ఉపవీధి చివరికి చేరుకున్నాడు.

"రండహో! తక్కువ వెల! చక్కని భోజనం! ఆరగించండి! ఆరగించండి!" ఎవరో పురుషుడు అరుస్తున్నాడు. ఆ ప్రకటనను ప్రతిధ్వనిస్తున్నట్టు డప్పు మోగింది. ఆ ప్రకటన నంది చెవులకు శ్రావ్యమైన సంగీతంలా వినిపించింది. ఉపవీధిలోంచి వినిపిస్తోంది ఆ ఆహ్వానం! నంది సందులోకి తిరిగి వేగంగా అడుగులు వేశాడు.

ఎర్రటి తలపాగా కట్టుకున్న పొట్టి వ్యక్తి, ఇందాక పలికిన పలుకుల్ని అక్షరం ముక్క భేదం లేకుండా బిగ్గరగా పలికి, డప్పు మీద చిన్న కర్రతో చప్పుడు చేశాడు. అతను ఒక ప్రహరీ ముందు నిలుచున్నాడు. అతనికి దగ్గరగా ఉన్న ప్రధాన ద్వారం రెండు వైపులా కాగడాలు వెలుగుతున్నాయి. మనుషులు చరచరా లోపలికి వెళ్తున్నారు; నడకలో ఆకలిని తెలియజేస్తూ. ఆరగించిన వ్యక్తులు బరువుగా, నెమ్మదిగా తాంబూలాలు రుబ్బుతూ వస్తున్నారు! నంది ప్రధాన ద్వారం వైపు వెళ్ళాడు.

"వెళ్ళండి బాబూ! వేడి చల్లారిపోతుంది!" నంది వైపు చిరునవ్వుతో చూస్తూ అరిచాడు పొట్టి వ్యక్తి. నంది ప్రధాన ద్వారానికీ, గృహద్వారానికీ మధ్య ఉన్న ఆవరణను దాటుతూ, త్రేన్చుకుంటూ వస్తున్న వ్యక్తులను తప్పించుకుంటూ వెళ్తున్నాడు. తాలింపుల ఘుమఘుమలు అతన్ని కమ్మగా ఆహ్వానిస్తున్నాయి.

నంది గుమ్మం దాటి, భోజనశాలలోకి అడుగుపెట్టాడు. వంటకాల సువాసనలు గుబాళిస్తూ అతని మీద దండయాత్ర చేశాయి. దీర్ఘచతురస్రాకారంలో ఉన్న భోజనశాల చాలా పొడవుగా ఉంది. నేల మీద పీటలు వేసి ఉంటారన్న నంది ఊహ సరికాదంటున్నాయి. చలువరాతి పలకలతో రూపొందిన ఎత్తుగా, పొడవుగా ఉన్న అరుగులు. అరుగులకు అటువైపున, గోడలకు ఆను కుని నిర్మించబడిన సన్నటి అరుగు భోక్తలకు ఉన్నతమైన ఆసనాలుగా ఉన్నాయి. ముగ్గురు వ్యక్తులు రకరకాల పదార్థాలు వడ్డిస్తున్నారు. ఒక వ్యక్తి, భోజనం ముగించిన వాళ్ళ ముందున్న అరిటాకులను జాగ్రత్తగా మడతపెట్టి తీసి వేస్తున్నాడు.

భోజనాలు చేయబోయే వ్యక్తులూ, ముగించిన వ్యక్తులూ భోజనశాల కుడివైపున ఉన్న ద్వారం గుండా అవతలకి వెళ్తున్నారు. చేతులు శుభ్రం చేసుకొని వస్తున్నారు. నంది వాళ్ళను అనుసరిస్తూ వెళ్ళి చేతులూ, కాళ్ళూ శుభ్రం చేసుకుని, ఒక వడ్డించిన విస్తరి ముందు కూర్చున్నాడు. కాసేపట్లో రెండు పచ్చళ్ళు, రెండు వేపుళ్ళు అరిటాకు మీద ప్రత్యక్షమయ్యాయి. ఒక వ్యక్తి ముద్ద పప్పు వడ్డించాడు. పెసరపప్పుతో చేసిన పప్పు! క్షణాల్లో వడ్డన పూర్తయింది. మంచుముద్దలా ఉన్న తెల్లటి అన్నం, అప్పడం, వడియాలు, బుడమ వరుగులు, గారె... ఒక మధ్య వయస్కురాలు వచ్చింది. "నెమ్మదిగా, అవసరమైంది అడిగి వడ్డించుకుని, కడుపారా భోంచేయండి, నాయనా!" అంటూ నవ్వు ముఖంతో చెబుతూ, ధారాళంగా అన్నం మీద నెయ్యి పోస్తూ వస్తోంది. నంది ఆమెనే చూస్తున్నాడు. ఆమె ఒక వృద్ధుడి ముందు నిలుచుంది.



"ఏం? వదిన పుట్టింటి కెళ్ళిందా, అలిగి? మన భోజనానికొచ్చావ్?" అంది.

"నీ వదినగారి వంటకాలు ఆరగించి, నోరు చెడిపోయింది అపరంజీ! నీ చేతి వంట తినాలని పించి వచ్చాను! ఆమెగారు అలగలేదు; పుట్టింటికి వెళ్ళాలేదు. వెళ్ళిపోతే బాగుణ్ణు!" వృద్ధుడు పచ్చడి కలుపుతూ అన్నాడు.

### జరిగిన కథ

కామరూపరాజ్య సర్వసైన్యాధ్యక్షుడు రుద్రాక్షుడు. మహారాజు న్యాయ విచారణ జరిపి అతణ్ణి రాజద్రోహిగా నిర్ధారించి యావజ్జీవ కారాగారశిక్ష విధించాడు. అతడి కుటుంబాన్ని కూడా రాజద్రోహ పరివారంగా ప్రకటించాడు. కుమార్తె దీపాంకురకు అంతఃపుర శౌచాలయాలు శుభ్రం చేసే శిక్ష, కొడుకు నందికి రాజ్యబహిష్కార శిక్ష విధిస్తాడు రాజు. పొరుగురాజ్య గ్రామికుడు భజరంగి ఇంట్లో ఆశ్రయం పొందుతాడు నంది. భజరంగి అల్లుడు నందిపై కక్షకట్టి రాజభటులకు అప్పగించే పనిలోపడతాడు. దాంతో ఆ ఇల్లు వదిలి తన కర్తవ్యాన్వేషణలో ముందుకు సాగుతాడు నంది. ఆ తర్వాత......

అపరంజి...పూటకూళ్ళమ్మ...ఈమే కాబోలు! నంది ఆమెనే చూస్తూ అనుకున్నాడు. ఇళ్ళూ, ఇల్లాళ్ళూ ఉన్నవాళ్ళు కూడా అపరంజి భోజనాన్ని ఇష్టపడతారన్నమాట! నంది భోజనం ప్రారంభించాడు.

అందరూ భోజనం చేస్తున్నారు. నిశ్శబ్దం తాండవిస్తోంది. ఆ నిశ్శబ్దం అపరంజి వంటకాల రుచిని తెలియజేస్తోంది. ఉన్నట్టుండి టకటకమన్న అడుగుల చప్పుడు ఆ నిశ్శబ్దాన్ని భగ్నం చేసింది.

“రేయ్ ఏదిరా అది, అపరంజి?” ఒక కంఠం బిగ్గరగా అంది. అది కంఠధ్వనిలా లేదు. కొడవలి మీద రాస్తున్న ఆకురాయి చేసే శబ్దంలా ఉంది! నంది తలెత్తి చూశాడు.

నల్లటి ధోవతి. నల్లటి అంగీ. ఎర్రటి తలపాగా ధరించిన భారీ వ్యక్తి ఠీవీగా నిలుచున్నాడు. చేటంత ముఖం. మెలితిరిగిన బుర్ర మీసాలు. తాంబూల చర్వణంతో ఎరుపెక్కిన పెదవులు. ఎర్రటి కళ్ళు. నడుముకు ఒర. ఒరలో కత్తి.

అతని వెనక నలుగురు దృఢకాయులు నిలుచున్నారు. మోకాళ్ళ దాకా ఉన్న పొట్టి గోచీలు ధరించారు. నడుముల పైన శరీర భాగాలు నల్లగా మెరుస్తున్నాయి. అందరివీ కుండల్లాంటి బొజ్జలు.

“రేయ్ నిన్నే!” ఆ వ్యక్తి మళ్ళీ అరిచాడు. “విదారకులుగారు దయచేశారని మీ అపరంజికి చెప్పరా!”

వడ్డిస్తున్న వ్యక్తి భయం భయంగా చూస్తూ, చేతుల్లోని గిన్నె కింద పెట్టేసి, లోపలికి పరిగెత్తాడు. అందరూ తినడం మాని అతని వైపు, అతని సేవకుల వైపు చూస్తున్నారు. నంది అప్పడం నములుతూ వాళ్ళనే చూస్తున్నాడు.

కాసేపట్లో అపరంజి, పరుగున వచ్చి, గడప మీద నిల్చొని, ద్వార బంధానికి ఆనుకుంది.

“ఏం? మళ్ళీ వచ్చావు?” అందామె విదారకు



**పూటకూళ్ళ సత్రం యజమానురాలు ఆదరంగా పదార్థాలు వడ్డిస్తుంటే నంది సహా యాత్రికులు కడుపారా భోంచేస్తున్నారు. అదే సమయంలో వచ్చాడు విదారకుడు. ఋణం తీర్చేసినాగానీ వడ్డీచెల్లించమంటూ అక్రమానికి పాల్పడ్డాడు. భోంచేస్తున్న యాత్రికుల నుంచి బలవంతంగా మూడేసి వరహాలు వసూలు చేశాడు. అతడి వెంట వచ్చిన ఓ దృఢకాయుడు నందిపై కూడా జులుం చేశాడు. అప్పుడు ఏం జరిగింది?**

డితో. “నీ ఇంటిల్లిపాదికీ ఈ పూట భోజనాలు పంపించేశానుగా; ఉచితంగా!”

“నీ మొగుడు చేసిన అప్పు తీరేదాకా వస్తూనే ఉంటాను; నువ్వు ఇస్తూనే ఉంటావు అపరంజీ!” విదారకుడు గర్వంగా అన్నాడు. “నేను ‘చాలు’ అనేదాకా నా ఇంటికి నీ నిత్య అన్నదాన కార్యక్రమం సాగుతూనే ఉంటుంది!”

“అప్పు ఇంకా మిగిలి ఉన్నట్టు కలగన్నావా? పోయిన వారం ఉన్నదంతా ఊడ్చుకుని, నా మొగుడి కాలు విరిచేశావు. రుణం చెల్లిపోయిందన్నావు. వచ్చే అమావాస్య దాకా ముప్పొద్దులా నీ ఇంట్లో అందర్నీ మేపమన్నావు వడ్డీ కింద! తాగొచ్చావా? మరిచిపోయావా?” అపరంజి ధైర్యంగా, ఎగతాళిగా అంది.

“అలా అన్నానా? అయితే అప్పుడు తాగొచ్చి ఉంటాన్లే! నీ అప్పు ఇంకా నిలువెత్తుంది! ఊ! తీసుకురా! కక్కు!”

“ఆ! ఇది అన్యాయం! చిల్లిగవ్వ ఇవ్వనింక!” అపరంజి కోపంగా అంది.

అపరంజి భోజనం కోసం ప్రత్యేకంగా వచ్చానన్న వృద్ధుడు లేచి, వాళ్ళ దగ్గరగా వెళ్ళాడు. విదారకుడి ముఖంలోకి నిదానించి చూశాడు. “నాకు తెలిసీ, అపరంజీ, ఆమె భర్తా చాలా ఏళ్ళుగా నీ రుణం తీరుస్తూనే ఉన్నారు. ఆ రుణం నుండి పోయిన వారం నువ్వు విముక్తి కలిగించావని ఆ దంపతులు నాకు చెప్పారు కూడా...ఇంక వదిలెయ్...”

విదారకుడు తల కొద్దిగా వాల్చి వృద్ధుడి ముఖంలోకి చిరునవ్వుతో చూశాడు. “పెద్దవాడివి. ముందుగా పోయేవాడివి; చెప్తున్నావు. అపరంజిని వదిలేస్తాను. అదీ, దాని మొగుడూ ఇవ్వాల్సింది నువ్విస్తావా?”

“విదారకా...అన్యాయం చేస్తున్నావు...”

“ఒరేయ్ కబంధూ, ఈ ముసలి పీనుగను వాడి విస్తరి ముందు కూలేయ్!” విదారకుడు ఆజ్ఞాపించాడు.

విదారకుడి భటుడు ఒకడు ముందుకు వచ్చాడు. వృద్ధుడి మెడమీద చేతిని వేసి, మొరటుగా తోసుకుంటూ వెళ్ళాడు. రెండు చలువరాతి పలకల మధ్య ఉన్న సందు గుండా అతన్ని లోపలికి తోసి, అతని విస్తరి ముందు కూర్చునేలా బలంగా అదిమాడు. వృద్ధుడి వైపు ఎగతాళిగా నవ్వుతూ అతని విస్తరిలో ఉన్న గారెను తీసి నోట్లో కూరుకుని నములుతూ వెళ్ళిపోయాడు.

“ఇంకా ద్వారబంధాన్నే వాటేసుకుని ఉన్నావేంటి? వెళ్ళు! వెళ్ళి పైకం తీసుకురా!” విదారకుడు అపరంజి వైపు గుడ్లురుముతూ అన్నాడు.

“ఎందుకలా మా ఉసురు పోసుకుంటావు? పైకం లేదు...తీరిపోయిన అప్పు తీర్చమనడం ధర్మం కాదు...”

“పైకం లేదా? తింటున్నారుగా! వీళ్ళ వద్ద తీసుకుని చెల్లు చేసుకుంటాను. నా అప్పు తీరిందని నాకు అనిపించేదాకా, రెండుపూటలా వచ్చి, తిన్నవాళ్ళ నుండి తీసుకుంటూ ఉంటాను!” విదారకుడు వెటకారంగా నిర్లక్ష్యంగా అన్నాడు. సేవకుల వైపు తిరిగాడు. “ఊ! కానివ్వండ్రా!” అన్నాడు ఆజ్ఞాపూర్వకంగా.

ఒక సేవకుడు వంటశాలలోంచీ పెద్ద చారు గిన్నెతో వచ్చాడు. అపరంజి ఆ గిన్నెను తీసుకుని, అన్నం తీసుకురావడానికి అతడిని పంపించి, చారుగిన్నెతో గుమ్మం దాటి ముందుకు వచ్చింది. విదారకుడి బంట్లు భోజనాలు చేస్తున్న వాళ్ళ వైపు బెదిరింపుగా వెళ్తున్నారు.

“ఎవ్వరూ సొమ్ము ఇవ్వకండి. మీరు తింటున్న తిండి నాది. ప్రతిఫలం నాకు రావాలి!” అపరంజి బిగ్గరగా హెచ్చరిస్తూ, చారు వడ్డించడానికి ముందుకు కదిలింది.

విదారకుడు హుంకరించాడు. అతని చెయ్యి కొండచిలువలా కదిలింది. అపరంజి చేతుల్లోని పెద్ద గిన్నెను అవలీలగా లాగి, నేల మీదికి విసిరి కొట్టాడు. భళ్ళున చప్పుడైంది. చారు నేలమీద కాలువ కట్టింది. భోజనాలు చేస్తున్న వాళ్ళు నిర్ఘాంతపోయి చూస్తున్నారు.

“నోరు తెరిస్తే ఆ గిన్నెను విసిరినట్టు నిన్నూ విసిరేస్తాను!” విదారకుడు అపరంజిని గుడ్లురిమి చూస్తూ గర్జించాడు.

అపరంజి అప్రయత్నంగా రెండడుగులు వెనక్కి వేసింది.

విదారకుడి సేవకులు నలుగురూ భోక్తల వరుసల ముందు సర్దుకున్నారు.

“ఊ...తే! మూడు వరహాలు!” ఒక సేవకుడు భోక్తల వరుసలో మొదటి వ్యక్తి ముందు ఆగి, చెయ్యి చాపి బెదిరింపుగా అన్నాడు.

“మూడా! రె...రె..రెండు వరహాలే కదా..?” భోజనం మానేసి భయంగా చూస్తున్న వ్యక్తి అన్నాడు.

“అది అపరంజి మూల్యం. మా నాయకుడి మూల్యం మూడు వరహాలు! తే!” సేవకుడు మొరిగినట్టు అన్నాడు.

“అన్నం పెట్టింది అపరంజి. ఆ..ఆమెకే ఇస్తాను!” ఆ వ్యక్తి ధైర్యంగా అన్నాడు.

సేవకుడి చెయ్యి ముందుకు దూసుకెళ్ళింది. ఆ వ్యక్తి పీకను పట్టుకుని, బలంగా నొక్కుతోంది. అతను ఉక్కిరిబిక్కిరి అవుతున్నాడు. రెండు క్షణాల అనంతరం వణుకుతున్న ఎడమచేత్తో రొంటిన దోపుకున్న నాణేలు తీసి సేవకుడి వైపు చాచాడు. సేవకుడు బిగ్గరగా నవ్వుతూ నాణేలు తీసుకుని, అతని పీక వదిలేశాడు.

“ఇంక మేయ్!” అన్నాడు మరొక వ్యక్తి ముందుకు జరుగుతూ.

నంది తినడం ఆపి, జరుగుతున్న నాటకం మౌనంగా చూస్తున్నాడు. నల్లటి, వెడల్పాటి బొజ్జ అతని చూపులకి అడ్డు వచ్చింది. నంది తల మెల్లిగా పైకి లేచింది. కారు నలుపు సేవకుడు నల్లరాతి స్తంభంలా తన ముందు నిల్చున్నాడు. బుర్రమీసాల కింద నల్లటి పెదవుల మధ్య గార కట్టిన పళ్ళు రోత పుట్టించేలా కనిపిస్తున్నాయి. అతని బోడిగుండు బోర్లించిన నల్ల కుండలా




## వొక రహస్య భాష

కనులు తూనీగ రెక్కల్లా
ఊగుతూ
మనసును రెపరెపలాడిస్తుంటే
రెప్పల పరదాల కింద
ఆశలు తొణికిసలాడుతూ
ముందుకు నడుపుతున్నాయి-

వొక
పూలు రాల్చిన చిరునవ్వు
గలగలా జారే సెలయేటి
పలుకులు
అలా గుండెల్లోకి
చల్లని గాలిని రువ్వుతున్నాయి

నీవు కనిపిస్తే చాలు
తోరణాలతో ముస్తాబైన
ఇంటిలా వెలిగిపోతాను

ఈ వాకిట్లో ముగ్గులు
నీ తొలి యవ్వనపు సిగ్గులు
నాలో వసంతరాగాన్ని
ఆలపించాయి.

నా ముందే
గంతులేసే లేడిపిల్లలా
ఎగిరొస్తుంటే
ఈ చందమామ సంబరాన్ని
రంగరించుకున్నాను

తడితడి గాలులు
మొగలి పూరేకులు
నా చుట్టూ శ్వాసను



నీ పరిమళంతో ముంచేశాయి.

రాగాలు అల్లుకున్న
నీ వొడిలో
వొక రహస్యభాషతో
ఆత్మసౌందర్యపు శ్వాసతో
నిండి పోవాలనుంది

కలల అంచున
నాలో మునిగిపోయే
నీకై ఇక నేను

-గవిడి శ్రీనివాస్
సెల్: 087227 84768

ఉంది. అతని కుడిచెయ్యి నందివైపు వెళ్ళింది.

"ఊ! మూడు వరహాలు!" బొంగురు కంఠంతో అన్నాడతను. అతని కళ్ళు నిప్పు కణికల్లా ఉన్నాయి. చెమట వాసనా, మద్యం వాసనా కలిసి అతని శరీరం నుండి వెలికి చిమ్ముతున్నాయి. అతని ఎడమ చెయ్యి కప్పను కబళించే నల్లత్రాచులాగా కదిలింది. నంది విస్తరిలోని గారె మీద ఆనింది అతని అరచెయ్యి.

నంది ఎడమ చెయ్యి చివాల్న కదిలి, అతని మణికట్టును పట్టుకుంది. నంది బిగించిన పట్టు అతని ముఖం మీద తన ప్రభావాన్ని క్షణంలో చూపించింది. ఆశ్చర్యంతో అతని రక్తనేత్రాలు విచ్చుకున్నాయి. బాధతో నోరు తెరుచుకుంది. అది నోరు కాదు. మండుతున్న చిన్న పొయ్యి! నంది పట్టులోంచీ చేతిని విడిపించుకోడానికి గుంజుకుంటూ, బాధతో అరిచాడతను.

"గారె నాది. ముట్టుకుంటే వేళ్ళు విరిగిపోతాయ్!" నంది అతని కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు.

నందికి సమాధానం చెప్పడానికన్నట్టు అతని కుడిచెయ్యి పిడికిలిగా బిగుసుకుని కదిలింది. నంది కుడిచెయ్యి అతని ఎడమ చేతిమీదుగా సాగి, కదిలిన చేతిని మధ్యలోనే అడ్డుకుంది. సేవకుడి రెండుచేతుల్నీ బలంగా మెలిపెట్టాడు నంది ఒకేసారి. సేవకుడు రాతిదెబ్బ తిన్న పందిలా అరిచాడు.

భోజనశాలలో ఉన్నవాళ్ళందరూ శిలాప్రతిమల్లా, కదలికలు లేకుండా చూస్తూ ఉండిపోయారు. నంది చేతులు బలమైన మోకులను పురిత్రిప్పినట్టు సేవకుడి చేతుల్ని బలంగా మెలిపెడుతూనే ఉన్నాడు. అతని అరుపు మూలుగుగా మారిపోయింది. అతని కళ్ళల్లో భయమూ, ఆశ్చర్యమూ రెండు ముదురు రంగుల్లా కనిపిస్తున్నాయి. మోచేతుల వద్దా, భుజాల వద్దా ఎముకలు కరకరమంటూ కఠోరంగా చప్పుడు చేశాయి. అతను భీకరంగా అరిచాడు. మెలిపెట్టిన చేతుల్ని నంది గజబలంతో తనవైపు ఒక్కసారిగా గుంజాడు. కలుక్కుమంటూ వింత శబ్దం వినిపించింది. నంది సేవకుడిని కర్రల్లాగా బిగుసుకుపోయిన అతని చేతల ద్వారా బలంగా వెనక్కి తోశాడు. అతను చెట్టులా నేలమీద కూలిపోయాడు. మూలుగుతూ, మెలికలు తిరుగుతున్నాడు.

అప్పటిదాకా నివ్వెరపాటుతో రాతి విగ్రహంలా ఉండిపోయిన విదారకుడు తెప్పరిల్లాడు. భోజనశాలలో అతని కంఠం ప్రతిధ్వనించింది. "కబందా! ముగ్గురు వెళ్ళండి. వాడి కాళ్ళూ, చేతులూ, మెడా విరిచేయండి!"

గున్న ఏనుగుల్లా తనవైపు వస్తున్న ముగ్గుర్నీ చిరునవ్వుతో చూస్తూ, నంది చలువరాతి పలకను దాటి ఇవతలకి వచ్చాడు. భోజనాలకు కూర్చున్న వాళ్ళంతా లేచి నిలుచుని, నోళ్ళు వెళ్ళబెట్టి చూస్తున్నారు. కోడెదూడ మీదికి దండయాత్ర చేస్తున్న కారు దున్నపోతుల్లా ముగ్గురు వీరులు నందిని చుట్టుముట్టారు. ఆరు చేతులు ఒకేసారి నంది వైపు దూసుకు వచ్చాయి. నంది కిందకి వంగాడు. అతని కాళ్ళు మహా వేగంతో కదిలే యంత్ర భాగాల్లా కదిలాయి. ముగ్గురు నల్లయోధుల మూడు మోకాళ్ళను గురి తప్పకుండా నంది పాదాలు మెరుపు వేగంతో తాకాయి. అవి నంది తన్నులు కావు; బాగా బలిసిన కంచరగాడిద తన్నులు! ముగ్గురి మోకాళ్ళు రెప్పపాటు వ్యవధిలో విరిగాయి. మోకాలి చిప్పలు తమ స్థానాల నుండి కదిలిపోయాయి. మూడు బొంగురు కంఠాలు మూడు గాడిదలు ఓండ్రపెట్టినట్టు బృందగాన పద్ధతిలో అరిచాయి. అవి గావు కేకలు కావు; చావు కేకలు. ముగ్గురూ నేలమీద పడి కొండచిలువల్లా మెలికలు తిరుగుతున్నారు.

శిష్యుల పరిస్థితి చూసి, నివ్వెరపోయి కోలుకున్న విదారకుడు రంకె వేస్తున్నట్టు అరుస్తూ నంది వైపు దూసుకు వచ్చాడు. నంది కుడికాలు అతని వేగాన్ని నియంత్రిస్తూ పొట్టమీద బలంగా తన్నింది. విదారకుడు విసురుగా అయిదారు అడుగుల దూరం వెనక్కి వెళ్ళి వెల్లకిలా పడిపోయాడు.

నంది అతనివైపు చూడలేదు. ముందుకు వంగి కబందుడు అనే బంటుని బోర్లా తిప్పాడు. అతని రెండు చేతుల్నీ అతని వెనక్కి, పైకి లాగాడు. ఒక్కొక్క చేతినే శక్తి కొద్దీ పైకి లాగుతూ భుజం మీద, చేతి సంధి దగ్గరగా పాదాన్ని ఉంచి బలంగా తొక్కాడు. కబందుడి చేతిని నంది చేతులు మెలిపెట్టి పైకి లాగుతున్నాయి. పాదం తొక్కుతూ కిందకి నొక్కేస్తోంది. కబందుడి భుజాన్ని అంటిపెట్టుకున్న చెయ్యి తన కీలు లోంచీ కదిలిపోయింది. కబందుడు భీకరంగా అరుస్తూనే ఉన్నాడు. అతని రెండో చేతికీ అదే గతి పట్టింది.

కింద కూలిపోయిన విదారకుడు పైకి లేచి, కాళ్ళూ, చేతులూ కూడదీసుకునే సరికి మిగిలిన ఇద్దరు బంట్లకూ భుజాలవద్ద కీళ్ళు ఊడిపోయాయి. ముగ్గురు కర్ణకఠోరంగా ఆర్తనాదాలు చేస్తున్నారు. తేరుకున్న విదారకుడు నిప్పులు కక్కుతూ చూస్తూ నందివైపు గంభీరంగా అడుగులు వేస్తున్నాడు. అంతులేని ఆగ్రహం అతని చేతుల్ని పిడికిళ్ళుగా బిగించింది.

అరచేతుల్లోకి గోళ్ళని గుచ్చుతూ బిగుసుకుపోతున్న పిడికిళ్ళను విడదీయడానికి ప్రయత్నిస్తూ, ఆవేశంతో ఊగిపోతూ, తనవైపు వస్తున్న విదారకుడికి ఎదురుగా గెంతాడు నంది. నంది తన చేతుల్ని అచేతనంగా చేసే ప్రయత్నం చేస్తాడనుకున్న విదారకుడు అసంకల్పితంగా చేతుల్ని వెనక్కి లాక్కున్నాడు.

నంది కుడి చెయ్యి కదిలింది. విదారకుడు ధరించి ఉన్న ఖడ్గాన్ని ఒరలోంచీ సర్రున ఇవతలికి లాగింది. తన పొరపాటు గ్రహించిన విదారకుడు ఆశ్చర్యంతో నోరు తెరిచాడు. నంది చెయ్యి వేగంగా కదిలింది. కత్తి మెరుపులా మెరుస్తూ దూసుకెళ్ళింది. భోజనశాల అటువైపు చివర ఉన్న మూసిన తలుపులో చప్పుడు చేస్తూ పిడి దాకా గుచ్చుకుపోయింది.

విదారకుడు తన ఖడ్గం ప్రయాణించిన వైపు చూస్తూ ఉండిపోయిన కళ్ళను నంది వైపు మళ్ళించాడు. ఆగ్రహం అతని కళ్ళను నెత్తురు గుంటల్లా



## అత్తకి నచ్చని సినిమా!

**కో**డలు ఐశ్వర్యారాయ్‌కీ, అత్త జయాబచ్చన్‌కి ఎప్పటి నుంచో పడడం లేదన్న వార్తలు బాగా హల్‌చల్ చేస్తున్నాయి. ఇవన్నీ పుకార్లే అని కొందరు కొట్టి పారేసినా, ఐష్ సినిమా ప్రివ్యూలో మాత్రం అవి నిజాలే అని తేలిపోయాయని అంటున్నారు బాలీవుడ్ జనాలు.

ఐష్ సినిమా 'యే దిల్ ముష్కిల్ హై' సినిమా మీద జరిగిన రచ్చ అంతా ఇంతా కాదు. ఈ సినిమాలో నటించడం బచ్చన్ కుటుంబానికి ఇష్టం లేదన్న వార్తలు కూడా వచ్చాయి. వీటికి ఫుల్ స్టాప్ పెట్టే ఉద్దేశంతో ఐష్, రాయ్ ఫ్యామిలీకీ, బచ్చన్ ఫ్యామిలీకి కలిపి ఓ స్పెషల్ షో వేయించింది.

అందరూ సినిమా బాగుందని మెచ్చుకున్నా జయాబచ్చన్ మాత్రం పెదవి విరిచేసిందట! తనకు నచ్చలేదని చెప్పినట్టు వార్తలు బాగా వినిపిస్తున్నాయి. ఎంతయినా అత్తగారు కదా! కోడలి సినిమాలు అంత త్వరగా మెచ్చుకోలేదని అంటున్నారు. ఎంతయినా జయాబచ్చన్ పెద్దమనసు చేసుకుని ఉంటే బాగుండేదని మరికొందరు అంటున్నారు.

చేసింది. ఏం జరుగుతుందో ఊహించేలోగా నంది కుడిచేతి వెనక భాగం వెడల్పాటి, దళసరి అట్లకాడలా విదారకుడి ముఖం మీద చెవులు పగిలేలా చప్పుడు చేసింది. విదారకుడు పిచ్చివాడిలా చూశాడు. అతని నాసికా రంధ్రాలలోంచీ రక్తం రెండు కాలువ లుగా జారుతోంది. చిట్లి నుజ్జు నుజ్జు అయిపోయిన పెదవుల నుండీ ఉబుకుతున్న రక్తంతో కలిసి, గెడ్డం మీదుగా కారసాగింది నాసిక రక్తం. విదార కుడు ముఖాన్ని కిందకి వాల్చాడు. అతని నాలుక కదిలింది. నాలుగు పళ్ళు, రక్తంతో తడిసి దానిమ్మ గింజల్లాగా ఎర్రబడిన పళ్ళు నేల మీదికి రాలాయి. బొట్లు బొట్లుగా కారుతున్న నెత్తురు నేలరాలిన పళ్ళమీద పడుతోంది.

భయంకరంగా మారిన ముఖాన్ని పైకెత్తి, నందిని మింగేసేలా చూశాడు విదారకుడు. నంది చూపులు అతని చూపుల్ని లాగిపట్టాయి. నంది కాలు ఏనుగు తొండంలా పైకి లేచింది. విదార కుడి ఛాతీమీద సమ్మెటలా తాకింది. విదారకుడు వెల్లకిలా పడిపోయాడు. నంది దగ్గరగా నడిచి, చెట్టు బోదెలా ఉన్న అతని శరీరానికి రెండు వైపులా కళ్ళు ఉంచి, నిలుచుని, తలవాల్చి అతని ముఖంలోకి చూశాడు.

"అపరంజి లాంటి అబలలనూ, అసహాయు




లనూ, కష్టపెట్టి పీడించడానికి భగవంతుడు నీకు ఈ చేతులు ఇవ్వలేదు. నువ్వు దుర్వినియోగం చేస్తున్న చేతుల్ని నిరుపయోగంగా మార్చేస్తాను!"

విదారకుడి పెదవులు కదిలాయి. నెత్తురు బుడగలుగా వెలికి వచ్చింది. అర్థం లేని, అర్థం కాని శబ్దాలు అతని నోట్లోంచీ వెలువడుతున్నాయి. వద్ద న్నట్టు చేతుల్ని అటూ ఇటూ ఊపసాగాడతను. భయంతో నిండిన కళ్ళు నందిని ప్రార్థిస్తున్నాయి.

నంది మాట్లాడకుండా కిందకి వంగాడు. విదారకుడి చేతుల్ని రెండు చేతుల్లో బిగించాడు. మణికట్ల దగ్గర ఎముకలు ఒరిపిడిగా చప్పుడు చేశాయి. నంది పట్టులో ఇరుక్కున్న విదారకుడి చేతులు పురెక్కిస్తున్న తాళ్ళలా మెలి తిరుగు తు.న్నాయి. విదారకుడు భయంకరంగా అరుస్తు న్నాడు. బలిసిన భుజాల దగ్గర ఎముకలు పెళ్ళు మన్నాయి. నంది చేతుల్ని వదిలేశాడు. పురి వదులైన తాళ్ళలా అవి నేలమీదికి వాలిపోయాయి. విదారకుడు అరవడం లేదు. బరువుగా ఊపిరి పీల్చుకుంటున్నాడు. దున్నల్లాంటి మల్లయోధుల్ని అదుపులో పెట్టుకుని, బలహీనుల మీద ప్రతాపం చూపించే నాయ

కుడు బాధ భరించలేక, స్పృహ తప్పాడు!

భోజనశాల ఉన్నట్టుండి హర్షధ్వానాలతో, కర తాళ ధ్వనులతో మారుమ్రోగింది. ఆరగించడం మరిచిపోయిన వ్యక్తులు ఎంగిలి చేత్తో చప్పట్లు కొడుతున్నారు.

నంది వంగి, విదారకుడి కాళ్ళను పట్టుకుని బరబరా గుమ్మంవైపు లాక్కెళ్ళాడు. గుమ్మం పక్కగా, ఆవరణలో అతన్ని పడవేసి, లోపలికి వచ్చాడు. అతన్ని చూసి భోక్తలు విదారకుడి తొత్తుల్ని కాళ్ళు పట్టి మొరటుగా గుమ్మంవైపు లాక్కు వస్తున్నారు!

నంది అపరంజి వైపు చూశాడు. ఆమె కళ్ళూ నోరూ తెరుచుకునే ఉన్నాయి. వడ్డించే వ్యక్తులు గుంపుగా ఆమె వెనక నిలుచుని నంది వైపు విచి త్రంగా చూస్తున్నారు.

"అమ్మా...ఈ దరిద్రులు ఇంక నీ జోలికి రారు. ఇక నుండీ వాడి కొంపకు నైవేద్యం పంపకు!"

"నాయనా...దేవుడిలా వచ్చావు...." అపరంజి కంఠం వణికింది.

"నువ్వూ, నీ సహాయకులూ ఆత్మరక్షణ ఉపా యాలు నేర్చుకోండి.."

అపరంజి బలహీనంగా నవ్వింది. "వాళ్ళను నువ్వు చూశావుగా! వాళ్ళది ఏనుగుల బలం! ఎది

రించగలమా?"

"ఉపాయాలు నేర్చుకోండి అన్నాను. వాటికి బలం అవసరం లేదు. ఉదాహరణకి సలసల కాగిన నూనె. ఎర్రగా కాలిన కాడలు.. కనీసం తెర్లుతున్న నీళ్ళు! బొగ్గులు కాలిన నిప్పులు, దూరం నుండీ నిప్పుల వర్షం, తైల వర్షం!"

"ఔను! అవునవును!" భోజనశాలలో ఉన్న ఎన్నో కంఠాలు అరిచాయి.

"ముందు కడుపారా భోం చేయి నాయనా!" అపరంజి అంది.

"తప్పకుండా అమ్మా...ఆ యోధాగ్రేసరుల పుణ్యం...ఆ కలి రెట్టింపయ్యింది!" నంది చిన్నగా నవ్వాడు.

"చేతులు కడుక్కో నాయనా, మురికి వెధ వల్ని ముట్టుకున్నావు" అపరంజి అంది.

నంది అవునన్నట్టు తల ఆడించి, అక్కణ్ణించీ కదిలాడు. విస్తర్ల ముందు లేచిపోయిన వ్యక్తులు పొరపాటు పడకుండా ఎవరి విస్తర్ల ముందు వాళ్ళు కూచున్నారు. నంది ముందున్న విస్తరిని తీసివేసి కొత్త విస్తరి వేసి, సరికొత్తగా స్వహస్తా లతో అపరంజి వడ్డించింది.

భోజనం ముగించి, నంది అపరంజికి రెండు వరహాలు ఇవ్వబోయాడు. అపరంజి తల అడ్డంగా ఊపింది.

"వద్దు నాయనా. సమయానికి దేవుళ్ళా ఆదు కున్నావు. నీకు అన్నం అమ్ముకోను!"

"నేను ధర్మాన్ని అమ్ముకోను" నంది చిరు నవ్వుతో అన్నాడు.

అపరంజి అర్థం కానట్టు చూసింది. భోజనాలు ముగించిన వాళ్ళందరూ ఆ ఇద్దరి చుట్టూ చేరారు.

"బలవంతుడు బలహీనుడ్ని ఆదుకోవాలి. ధనవంతుడు ధనహీనుడ్ని ఆదుకోవాలి. శక్తి ఉన్నవాడు శక్తిలేని వాళ్ళ కోసం తన శక్తిని ఉప యోగించాలి. అధర్మాన్ని ఎదిరించాలి. అది ధర్మం. నేను శారీరకంగా శక్తి ఉన్నవాణ్ణి. ఆ శక్తి దేవుడిచ్చింది. ఉన్న వస్తువును దానం చేసినట్టు మనిషి తోటి మానవులకోసం తన శక్తిని దానం చేయాలి! నేను చేసింది వీరోచిత కార్యం. అది నా ధర్మం! దానికి ప్రతిఫలం తీసుకుంటే, ధర్మాన్ని అమ్ముకున్నట్టే!" నంది ఎడమ చేత్తో అపరంజి చేతిని పట్టుకుని, కుడిచేత్తో నాణేలను ఉంచాడు.

"ఇంత మంది ఉన్నాం. ఆ విదారకుడి ఆగడా లను అణచలేక పోయాం! ఎక్కడి నుండో ఊడి పడిన ఈ యువకుడు ఆ పని చేశాడు. మాధ వుడు మానవ రూపంలో సాయం చేస్తాడన్నది నిజం!" విదారకుడి మీద తిరగబడిన వృద్ధుడు అన్నాడు.

"చూశారా! ఆనందంలో అన్నీ మరిచిపోయాను" అపరంజి అంది "నీ పేరేమిటి నాయనా?"

"నంది"

"నంది..చక్కటి పేరు! అందుకే వాళ్ళ కొమ్ములు విరిచావు! ఏ ఊరు నాయనా?"

భజరంగి చెప్పిన ధర్మ సూక్ష్మాన్ని గుర్తు చేసు కుంటూ నంది తన గురించి ఎంత చెప్పాలో అంతే చెప్పాడు.

"ఇక్కడికి ఎందుకొచ్చావు?" అపరంజి కుతూ హలంతో అడిగింది.

"నేను ప్రవాసిని కదమ్మా...ఆకలికి అన్నం, నిద్రకు నీడా కావాలిగా! వెతుకుతూ వచ్చాను"

"నేను మాత్రం మా కోసమే దేవుడు నిన్ను పంపించాడనీ, నువ్వు వచ్చావనీ అనుకుంటాను. మేడపైన విడిది గదులు కూడా ఉన్నాయి. ప్రవా సుల సౌకర్యం కోసమే అవి. అద్దె నామమాత్రమే. నువ్వు హాయిగా ఉండొచ్చు!" అపరంజి అంది.

"సంకోచించకుండా ఉండు నాయనా. నువ్వి క్కడున్నావని తెలిస్తే ఆ విదారకుడు ఇటువైపు కన్నెత్తి చూడడు!" వృద్ధుడు అన్నాడు.

"ఔను! ఈ తాత అన్నది నిజమే! విదార కుడూ, అతగాడి సేవకులూ కుంటుతూ, పడుతూ లేస్తూ, మూలుగుతూ వెళ్ళిపోయారు. ఇంక ఇటు వైపు చచ్చినా రానేరామంటూ కబందుడు విదారకు డితో అంటూంటే విన్నాను" అప్పుడే లోపలికి పరు గెట్టుకుంటూ వచ్చిన ద్వారపాలకుడు అన్నాడు, డప్పు మీద ఉత్సాహంగా ఒక దెబ్బ వేస్తూ.

"రా నాయనా... మేడ మీద నీ విడిది చూపి స్తాను. ఒక పగలూ, ఒక రాత్రీ ఒక వరహా మాత్రమే!" అపరంజి చొరవగా నంది చేతిని పట్టుకుంది. నంది ఆమె వెంట కదిలాడు.

**(ఇంకా వుంది)**





# సెల్‌తో నిద్రలేమి?

ఎలక్ట్రానిక్ పరికరాలు ఉపయోగించే చిన్నపిల్లలు, టీనేజర్లలో నిద్రలేమి సమస్య చాలా ఎక్కువగా ఉంటుందని కెనడా యూనివర్సిటీవారు ఇటీవల నిర్వహించిన పరిశోధనల్లో వెల్లడైంది. మామూలుగా చిన్న పిల్లలు, టీనేజర్లలో నిద్రలేమి ఉండదనీ, కానీ సెల్‌ఫోన్లు, వీడియోగేములు, కంప్యూటర్లు, టీవీల కారణంగా చిన్నతనంలోనే వారిలో నిద్రలేమి సమస్య తలెత్తుతోందనీ వారు అంటున్నారు. 14నుంచి 16 సంవత్సరాలు గల సుమారు 1200 మంది హైస్కూలు విద్యార్థుల మీద వీరు సంవత్సరం పాటు సర్వే నిర్వహించారు. వీరిలో సగానికి పైగా విద్యార్థులకు రోజులో రెండు గంటల కన్నా ఎక్కువగా సెల్‌ఫోన్‌లో మాట్లాడడం, వీడియోగేమ్‌లు ఆడడం, కంప్యూటర్ చూడడం వంటి అలవాట్లు ఉన్నాయి. సంవత్సరం పాటు వీరి నిద్రా సమయాన్ని పరిశీలించారు. వీరిలో 14 శాతం మంది రాత్రి సమయంలో గంట నుంచి రెండు గంటల పాటు నిద్ర తక్కువ పోవడం, చాలాసేపు నిద్ర పట్టకపోవడం వంటి సమస్యలతో బాధపడడాన్ని గుర్తించారు. వీరిలో ఈ నిద్రలేమికి ఎలక్ట్రానిక్ పరికరాలు ఉపయోగించడమే అని వీరు స్పష్టం చేస్తున్నారు. తల్లిదండ్రులు తమ పిల్లలు ఉపయోగించే ఎలక్ట్రానిక్ పరికరాల మీద ఓ కన్నేసి ఉంచాలని వీరు సూచిస్తున్నారు. చిన్నతనంలోనే నిద్రలేమికి గురికావడం వలన భవిష్యత్తులో పలు ఆరోగ్యసమస్యలకు గురికావలసి వస్తుందని వారు హెచ్చరిస్తున్నారు.

# శబ్దకాలుష్యంతో ఊబకాయం?

శబ్దకాలుష్యంతో ఊబకాయం వచ్చే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయని నిపుణులు హెచ్చరిస్తున్నారు. శబ్దకాలుష్యం కారణంగా ఊబకాయం ఒక్కటే కాదనీ గుండెజబ్బులు, రక్తపోటు కూడా వచ్చే అవకాశాలు ఉన్నాయంటున్నారు. దీనికి కారణం ఉందని వారు చెబుతున్నారు. ఎక్కువసేపు పెద్ద పెద్ద శబ్దాలు వచ్చే ప్రాంతాలలో సంచరించడం లేదా నివసించడం వలన ఒత్తిడి ఎక్కువ అవుతుందనీ, ఒత్తిడి పెరిగితే గుండెజబ్బులు, రక్తపోటు వచ్చే ప్రమాదం ఉన్న సంగతి తెలిసిందేననీ వారు గుర్తు చేస్తున్నారు. ఇక ఊబకాయం ఎలా వస్తుందన్న ప్రశ్నకు వారు ఇలా సమాధానం చెబుతున్నారు. కొన్ని సందర్భాలలో ఒత్తిడి కారణంగా తెలియకుండానే ఎక్కువ ఆహారం తీసుకుంటారని, దీని కారణంగా శరీరానికి కావలసిన క్యాలరీలకన్నా అధికమొత్తంలో క్యాలరీలు శరీరంలోకి చేరి క్రమేపీ అధిక బరువుకు, ఊబకాయానికి దారి తీస్తుందని వారు స్పష్టం చేస్తున్నారు. అందువలన బస్టాండులు, ఫ్యాక్టరీలు ఉన్న ప్రాంతంలో నివాసం ఉండకూడదని వారు సూచిస్తున్నారు.




# బ్రేక్‌ఫాస్ట్ మరిచిపోతే...

ఉదయాన్నే చేసే బ్రేక్‌ఫాస్ట్‌ని మరచిపోయినా, అసలు చేయకపోయినా గుండెపోటు వచ్చే అవకాశం ఎక్కువగా ఉందని అంటున్నారు హార్వర్డ్ పరిశోధకులు. సుమారు 27వేల మంది మీద సుదీర్ఘ కాలం పాటు వీరు పరిశోధనలు నిర్వహించారు. వీరిని రెండు గ్రూపులుగా విభజించి ఒక గ్రూపువారికి ఉదయాన్నే అల్పాహారం అందించారు. రెండవ గ్రూపు వారికి అల్పాహారాన్ని ఇవ్వలేదు. కొన్ని రోజుల తరువాత వీరిని పరిశీలించగా, అల్పాహారం తీసుకోని వారిలో 13 శాతం మందిలో గుండె సంబంధిత సమస్యలను గుర్తించారు. అల్పాహారం తీసుకోని వారిలో అధికబరువు, ఒత్తిడి ఎక్కువగా ఉండడాన్ని వీరు గమనించారు. ఈ రెండు సమస్యలే గుండె సంబంధిత సమస్యలకు కారణమై ఉండవచ్చని వీరు ఊహిస్తున్నారు. ఉదయం బ్రేక్‌ఫాస్ట్‌కీ, గుండె జబ్బులకీ ఉన్న సంబంధం గురించి వీరు ఇంకా పరిశోధనలు నిర్వహిస్తున్నారు.





# మృత్యువుకు దగ్గర చేసే అతి నిద్ర

నిద్రలేమి ఆరోగ్యానికి ఎంత హానికరమో, అతినిద్ర కూడా అంతే హాని చేస్తుందని సిడ్నీ పరిశోధకులు హెచ్చరిస్తున్నారు. రాత్రి సమయంలో తొమ్మిదిగంటలకు మించి నిద్రపోయేవారు మృత్యువుకు దగ్గరవుతారన్న విషయం వీరి పరిశోధనలో వెల్లడైంది. అతిగా మద్యం సేవించడం కన్నా కూడా అతిగా నిద్రపోవడమే ఎక్కువ ప్రమాదకరమని వారు అంటున్నారు. రోజుకు ఆరు గంటల పాటు నిద్రపోతే సరిపోతుందని వారు చెబుతున్నారు. ఇంతకు మించి నిద్రపోయే ప్రతి గంటా ప్రాణానికి హాని చేస్తుందని వారు స్పష్టం చేస్తున్నారు. ఎక్కువ సేపు నిద్రపోయేవారు త్వరగా బరువు పెరుగుతారని, ఇదే పలు ప్రాణాంతక వ్యాధులకు కారణం అవుతుందని వారు అంటున్నారు.

-అవినాష్



# అ'ద్వి'తీయం

-బాలాజీ.ఎం

**'హలో! హలో!' కారిడార్లో పిలుస్తూ వస్తున్నాడతను. ఆమె చూసింది కానీ, ఎవర్నో పిలుస్తున్నాడనుకుంది. లిఫ్టులోకెళ్ళి గ్రౌండ్‌బటన్ నొక్కింది. అప్పటికే లిఫ్ట్‌డోర్స్ సగం మూసుకున్నాయి.**

**వేగంగా వస్తున్న అతనిచేతిలో బ్యాగ్, సగం ఇన్ చేసిన షర్టు, సరిగ్గా దువ్వని తల... లేటైనట్టుంది. అప్పటికే లిఫ్ట్ కిందికి దిగనారంభించింది.**

లిఫ్ట్ పైకి రావడానికి బటన్ ప్రెస్‌చేసి అసహనంగా నిలబడి, వాచ్‌మన్‌వైపు చూశాడు. స్టెయిర్ కేస్ నుండి దిగబోతుంటే ఫోను మోగింది. అక్కడే నిలబడి ఫోన్లో మాట్లాడుతుంటే లిఫ్ట్ పైకొచ్చింది. ఫోన్లో మాట్లాడటం ముగించి, వేగంగా లిఫ్ట్‌లోకి వచ్చేశాడు. లిఫ్ట్‌లో అంతకుముందు కిందికి వెళ్ళినామె అలాగే నిలబడి ఉంది.

'ఆర్యూ గోయింగ్ అప్?!' అడిగాడు సందేహంగా.

'నో.. గ్రౌండ్ వోన్లీ' అంది, మళ్ళీ గ్రౌండు బటన్ నొక్కి.

రెండుకాళ్ళ మధ్య బ్యాగుంచుకుని, షర్టును సరిగ్గా ఇన్ చేసుకుంటుంటే... అతని మెడలో వేలాడుతున్న స్టెత్‌జారి ఆమె పాదాలదగ్గర పడింది. అతను వంగి తీసుకునేంతలో ఆమే కిందకి వంగింది. సినిమాల్లో నాయికా నాయకుల్లా ఒకళ్ళ తల మరొకరికి 'డీ' కొట్టలేదుగానీ, ఆమె శరీరంనుండి వస్తున్న ఈవా బాడీస్ప్రే వాసన, అతను వాడిన షాంపూ వాసన, ఓల్డ్ సింథాల్ సబ్బు వాసనల్ని ఒక్కక్షణం పరస్పరం ఆస్వాదించారు.

స్టెత్‌తీసి, అతనికిద్దామని ఆమె లేవబోతుంటే, అతను నిలబడటానికి లేచాడు. ఆమె ఎద అందాలు అతని మొహానికి దగ్గరగా, ఆల్మోస్ట్ తగలబోయేంతలో ఆమె వేగంగా వెనక్కి జరిగి, స్టెత్ అతనికిచ్చింది.

'థాంక్యూ!'

'ఇట్స్ ఓ.కే' అంది పక్కకితిరిగి. అప్పుడామెని పరిశీలనగా చూశాడతను. కాటన్‌శారీ, మ్యాచింగ్ బ్లౌజ్, ఎత్తు, రంగు, మంచి పర్సనాలిటీ. థర్టీప్లస్ ఉండొచ్చు అనుకున్నాడు. మళ్ళీ ఆమెని చూద్దామనుకునేంతలో ఆమె అతని వైపు తలతిప్పింది. దాంతో చూపు మరల్చాడతను.

మెడలో స్టెత్ అతను డాక్టరని చెప్పకనేచెబుతోంది. ఎత్తైన జుట్టు, కళ్ళజోడు, గుబురుమీసాలు,

పచ్చనిగెడ్డం.. మంచిఎత్తు, సోగ్గాడే చిన్నినాయనా సినిమాలో డాక్టరు క్యారెక్టరులో నాగార్జునలా ఉన్నాడనుకుందామె.

అంతలో లిఫ్ట్ గ్రౌండ్ ఫ్లోర్‌లో ఆగింది.

బైటికి వచ్చి 'బై ద బై... థాంక్యూ అండ్ నైస్ టు మీట్యూ! ఐయామ్ డాక్టర్ శ్రీరాం. కార్పొరేట్ హాస్పిటల్‌లో పనిచేస్తున్నాను. ఈ మధ్యనే ఇక్కడ ఫ్లాట్‌కొన్నాను"అన్నాడు.

'ఐయాం పల్లవి.. బ్యాంకాఫీసర్. నేనూ ఈ ఫ్లాట్స్‌లోనే మీరున్న ఫ్లోర్‌లోనే ఉంటున్నాను'.

'ఐ.సీ.. సీయూ' అని కారు తీసుకుని వెళ్ళాడు.

ఆమె కారు తీసుకుని అతనివెనుకే బయల్దేరింది.

ఐదు నిమిషాలపాటు కొత్త పరిచయపు హ్యాంగోవర్లో ఒకరి గురించి ఒకరు ఆలోచిస్తూనే ఉన్నారు.

•••

మరుసటిరోజు ఐదునిమిషాలు ముందుగానే లిఫ్టదగ్గరికి వచ్చాడు శ్రీరాం. పల్లవి అదే సమయానికి వస్తుందనుకున్నాడు. ఆమె కన్పించలేదు. సెల్లార్‌లో కారు తీస్తుంటే... 'గుడ్మాణింగ్ డాక్టర్ పల్లవి పిలుపు విన్పించి, తిరిగి చూశాడు. అప్పటికే ఆమె కారులో కూచుంది.

'హలో గుడ్మాణింగ్'

"ఈ రోజు బ్యాంకులో మీటింగుంది.."

'అందుకే తొందరగా బయల్దేరా!' అంది.

'ఓ.కే.. బై..' అన్నాడు.

•••

మర్నాడు... లిఫ్టదగ్గర నిలబడి ఫోన్లో మాట్లాడుతున్నాడు శ్రీరాం. లిఫ్ట్ కిందికీ పైకీ వెళ్తోందికానీ, పల్లవికోసం ఎదురు చూస్తున్నట్టు అక్కడే నిలబడ్డాడు.

ఐదు నిమిషాల తర్వాత.. ఈవా స్ప్రే వాసన మొదట మంద్రంగానూ, తర్వాత గాఢంగానూ వస్తుంటే తల తిప్పాడు. అప్పటికే పల్లవి అక్కడికొచ్చేసింది. 'గుడ్మాణింగ్' అంది.

'హలో! గుడ్మాణింగ్ అని.. ఫోన్లో.. 'ఓ.కే. మీరు హాస్పిటల్‌కి రండి' అని ఫోనాఫ్ చేసి.. లిఫ్ట్‌లోకి వచ్చాడు.

ఆమె కట్టుకున్న డార్క్‌గ్రీన్ కాటన్‌శారీ బావుందనుకున్నాడు. అతను వేసుకున్న బ్లాక్ ప్యాంటు, వైట్‌చెక్స్ షర్టు నిజంగానే పల్లవికి బావున్నాయన్పించి.. వెంటనే 'మీ డ్రెస్ బావుంది రోజు' అంది.

'థాంక్యూ! యూ టూ లుకింగ్ గుడ్ టుడే.' నవ్వింది పల్లవి.

"మీరు ఏ బ్రాంచిలో పన్జేస్తున్నారు!"

"ఆబిడ్స్"

లిఫ్ట్ సెల్లార్లో ఆగింది.

•••

అదుగో....! అప్పట్నించీ ఇద్దరికీ టీనేజ్ పునరాగమనమైనట్టు... ఉదయాలు లిఫ్ట్ దగ్గర మాటలతో, పలకరింపులతో పరిచయం పెరగసాగింది.

ఆరోజు సాయంత్రం ఇద్దరూ ఒకేసారి వచ్చారు. కారు పార్క్ చేస్తుంటే కనిపించిన పల్లవినిచూసి 'హలో! ఏమిటివాళ తొందరగా వచ్చారు?' అన్నాడు.

"నేను రావటం మామూలే.. మీరు రావటమే మిరకిల్".

"అవునండీ! బహుశా మీతోకలిసి టీ తాగడానికేమో.. త్వరగా వచ్చాను".

'వై నాట్.. మన పరిచయానికి ఇవ్వాళ్టికి ఇరవై రెండ్రోజులు వయసొచ్చింది. లెటజ్ సెలబ్రేట్.. మా ఇంటికి రండి! టీ తాగుదాం' అంది పల్లవి.

'ష్యూర్!' అని ఆమె వెనకే ఫ్లాట్‌లోకి వచ్చాడు. హాల్లోకి అడుగు పెడుతూనే అంతా కలియజూసి 'వావ్! హాలు చాలా బావుంది.. బాగా మెయిన్‌టెయిన్ చేస్తార్లల్లే ఉంది' అన్నాడు.

'కూచోండి!' అని ఫ్యానేసి.. టీవీ ఆన్ చేసింది. పది నిమిషాల తర్వాత టీ, బిస్కెట్స్ తెచ్చి అతని ముందుంచింది. ఇద్దరూ టీ తాగుతుంటే... 'మీ హజ్బెండూ... పిల్లలూ...' అడిగాడు.




'లేరు. ఐయాం ఎలోన్'

'అంటే!'

'పోయినేడాది వరకూ. అమ్మ తోడుండేది. ఆర్నెల్ల క్రితం... ఆమె మా నాన్న దగ్గరకెళ్ళిపోయింది'.

'ఓ...!' అన్నాడు.

'మీకెంతమంది పిల్లలు? మీ వైఫ్ డాక్టరేనా?'

"......" శ్రీరాం మొహం సీరియస్‌గా మారింది.

గబగబా టీ తాగి, ఎవరో పిలుస్తున్నట్టు... 'సీయూ... థాంక్యూ...' అంటూ వెళ్ళిపోయాడు.

అతనెందుకెళ్ళిపోయాడో అర్థం కాలేదు పల్లవికి. ఫ్యామిలీ గురించి చెప్పటం ఇష్టంలేక వెళ్ళాడేమో.. అనుకుంది.

•••

మర్నాడు శ్రీరాం లిఫ్టదగ్గర కన్పించలేదు. సాయంత్రం అతని ఫ్లాట్ దగ్గరకెళ్ళి చూసొద్దామనుకుందికానీ సభ్యత కాదేమోనని విరమించుకుని ఫోన్ చేద్దామనుకుంటే.. అతని నెంబరు తీసుకోలేదు.

ఎందుకో అతన్ని చూడాలనిపించింది.

అసలు ఎందుకు అతనిగురించి ఆలోచిస్తోంది? ఇన్నేళ్ళూ కలగని చలనం.. ఇప్పుడెందుకు కలుగుతోంది. అపార్టుమెంటు జీవితాలు తగరపు కాగితాల్లాంటివి. ముట్టుకుంటే శబ్దం... ముట్టకుంటే నిశ్శబ్దం... అంటీ ముట్టకుండా ఉన్నవాళ్ళకే ఇక్కడ జీవితం అనుకుంది.



మరుసటిరోజు లిఫ్ట్‌దగ్గర కన్పించి 'హలో' అన్నాడు శ్రీరాం. అతని చేతిలో ట్రావెల్ బ్యాగుంది.

'నిన్న కన్పించలేదేం' అడిగింది పల్లవి.

'బిజీ... అండీ! రాత్రొచ్చేసరికి లేటైంది'.

'... ... ...'

ఆమె ఇంకేదైనా అడుగుతుందనుకున్నాడు.

'..... ... ...'

ఊరెళ్తున్నాడు కాబోలు... చెబుతాడని ఆశించిందామె.

లిఫ్ట్‌దిగి 'బై' చెప్పి వేగంగా వెళ్ళిపోయాడు.

కారు డ్రైవ్‌చేస్తున్న పల్లవికి అతని ఆలోచనలు వెంబడిస్తుంటే... కంట్రోల్... కంట్రోల్ అనుకుంది.

●●●

ఆ తర్వాత నాలుగు రోజులు శ్రీరాం కన్పించలేదు.

పల్లవికి తెలియకుండానే అసంకల్పితంగా శ్రీరాం గురించి ఆలోచిస్తోంది. రోజు రోజుకీ అతన్ని మిస్సవుతున్న భావన.. మనసు మూలాల్లో ఏదో కదలిక. ఎంత వద్దనుకున్నా అందమైన అతని రూపం కళ్ళముందు కనిపిస్తోంది.

టీనేజ్‌లోకూడా ఇంతగా చలించలేదేమో!

మంచంమీద వెల్లకిలా పడుకుని ఆలోచిస్తోంది.

'ఏంటీ! ప్రేమా?' మనసు ప్రశ్నించింది.

ఛా! మూడుపదుల వయసులో ప్రేమా? దోమా?

'ప్రేమకి వయసుతో పనేంటి? మనసుండాలంటే!' మనసు బదులిచ్చింది.

అతిగా ఆశ పడకు అని లైటాఫ్ చేసి పడుకుంది పల్లవి.

నిద్రపట్టడం లేదు. దిండుని గట్టిగా కౌగలించుకుంది, అది శ్రీరాం అన్న ఫీల్‌తో.

ఒక్కసారి కలలోకి రావయ్యా! అనుకుంటూ బలవంతంగా కళ్ళు మూసుకుంది. అంతే! మరుక్షణంలో పక్కన శ్రీరాం ప్రత్యక్షమయ్యాడు.

కలయా! నిజమా! అనుకునే లోపలే శ్రీకృష్ణుడిలా అల్లరి మొదలెట్టాడు.

మధువొలకబోసే.. ఈ చిలిపికళ్ళు... అంటూ మూసుకున్న పల్లవి కళ్ళమీద ముద్దులుపెట్టి తెరిపించాడు. మత్తుగా కళ్ళుతెరిచింది. పక్కనే ఆమెవైపు తిరిగి పడుకున్న శ్రీరాం... చూపుడు వేలుతో ఆమె నుదురు నుండి కనుబొమల మధ్యగా.. కోటేరు ముక్కుమీదుగా, కిందికిదించి, విల్లులా వంగిన ఎర్రని పెదాలపైకితెచ్చి, మృదువుగా ఉన్న ఆమె రెండు పెదవుల్ని బొటనవేలు, చూపుడు వేళ్ళతో చిదిమి పట్టుకున్నాడు. పల్లవి ఒళ్ళంతా శృంగార రసధార స్రవిస్తూ.... ఝల్లుమనడం మొదలైంది. అమాంతం ఆమెని తనవైపు తిప్పుకుని గాఢకౌగిలిలో బంధించగానే, ఊపిరాడని ఎద ఎత్తులు అతనిఛాతికి నొక్కుకుపోతుంటే... సుదీర్ఘ శ్వాసతీసుకుని కళ్ళు మూసుకుంది. వేళ్ళతో పట్టుకుని ఆమె అధరాల్ని అలాగే తన పెదవుల్లో బంధించి... అధరం.. మధురం.. మధురం అధరం అంటూ మధువు గ్రోలుతున్న కృష్ణుడిలా.. అతను.. అతని చర్యకి పులకించి, పల్లవిస్తున్న రాధలా పల్లవి... మారిపోయారు. పల్లవికి కొత్తలోకంలో తేలిపోతున్నట్టుంది.

ఆమె ఆస్వాదిస్తోంది. అతను ఆఘ్రాణిస్తున్నాడు. రెండు నిమిషాల తర్వాత ఆమె అధరాలు వదిలి... కళ్ళలోకి సూటిగా చూశాడు. కొత్తగా సిగ్గు పుట్టుకొచ్చినట్టు.. మొహం పక్కకి తిప్పుకుంది.

'సిగ్గూ పూబంతీ.. విసిరే సీతామాలచ్చీ' అంటూ ఆమెతల తనవైపు తిప్పుకున్నాడు. అతని చూపుల్ని తట్టుకోలేక.. కళ్ళు దించుకుని, అదురుతున్న తడి పెదవుల్ని అతనికి అందించింది.

అతనిచేతులు ఆమె శరీరంలోని అణువణువూ శ్రుతిచెయ్యటం మొదలెట్టాయి. ఆమె తనువంతా శృంగార సరస నాట్యం చెయ్యటం ఆరంభించింది. ఆ మోహావనలో తడుస్తూ..

చినుకు... చినుకు పడుతూ ఉంటే... తడిసి... తడిసి ముద్దవుతుంటే అంటూ... ఒకరిలో ఒకరు ఐక్యమవుతూ... ఇద్దరిమధ్య అడ్డుపడుతున్న వస్త్రాల్ని తొలగిస్తూ తనువులో తనువు కలిపేసి.. స్వర్గపుటంచుల్లో విహరిస్తున్న తరుణంలో పల్లవికి చప్పున మెలకువ వచ్చింది.

కలలో తనువుని, మనసుని ఆవహించిన మత్తు మెలకువ వచ్చాక కూడా గమ్మత్తుగానే ఉంది పల్లవికి.

కలే...! అయినా కలకాలం గుర్తుండేలా తనువుని, మనసుని వదిలి వెళ్ళనని మొరాయిస్తోంది. ఇన్నాళ్ళు చలించని మనసు శ్రీరాంకి లొంగిపోతున్నట్టనిపిస్తోంది. ఎటుచూసినా శ్రీరాం... శ్రీకృష్ణుడిలా కన్పిస్తూ 'కెమ్మోనిపై తేనె ఒలికించనా... తనవి కలిగించనా... మనసు కరిగించనా .. కేరింతలాడించి సోలించనా' అని అడుగుతున్నట్టనిపిస్తోంది.

మంచం మధ్యలో ఎంతసేపు కూచుందోగానీ... సెల్‌ఫోన్‌లో టైం చూసింది. అర్ధరాత్రి రెండు.

అంతే! మరేం ఆలోచించకుండా.. బాత్రూంకెళ్ళి, షవర్‌తిప్పి చన్నీళ్ళ తల స్నానం చేసొచ్చింది.

మనసుని మలినం చేసిన మోహమంతా ప్రక్షాళనమైె స్నానంతో మురికి కొట్టుకుపోయిందన్న భ్రమతో మనసుకి కట్టుబాట్ల సంకెళ్ళు బిగించి, మనసులో తిష్టేసుక్కూచున్న శ్రీరాం రూపాన్ని బలవంతంగా బైటికినెట్టి కళ్ళు మూసుకుంది. చలిలో, చన్నీళ్ళ స్నానానికి వెంటనే జలుబు పట్టేసింది. లేచి కబోర్డ్‌లోంచి యాంటీ కోల్డ్ మాత్ర తీసివేసుకుంది. ఐదు నిమిషాల్లో అప్పటివరకూ ఆవహించిన శృంగార సెడేషన్ తగ్గి, ట్యాబ్లెట్ తాలూకు సెడేషన్ పెరిగి... గాఢ నిద్రలోకి జారుకుంది.

●●●

ఆ రోజు ఆదివారం.. ఉదయాన్నే కాలింగ్‌బెల్ శబ్దం చేస్తుంటే, బద్ధకంగా నిద్రలోనే వచ్చి తలుపు తీసింది పల్లవి.

ఎదురుగా శ్రీరాం... ఒక్క సెకను ఆమె కళ్ళలో




నిన్న మొన్నటి వరకూ నీ రూపే తెలీదు
నా తలపుల్లో నీ ఊసే లేదు
అలలకలల్లో నిద్రపోతున్న కడలిమీదికి
ఓ అరుణోదయంలా వచ్చావు
నీ మాటలతో పాటలతో
నా చుట్టూ ఓ కాంతి వలయాన్ని నిర్మించావు
నా గతానికి గ్రహణం పట్టించి
నీ ఊహల ఉయ్యాలలోనే ఊగులాడుతున్నాను
ఊగే ఊగే పైకెగసే
అంబరాన్నే అందుకోవాలనుకుంటున్నాను
కవి హృదయకంపనను జీవసారంలానో
కర్పూర పరిమళంలానో అందించు

## జ్ఞాన నేత్రం

దిగులు చీకట్లలో కూర్చున్న నాపై
కొత్త ఆశాకిరణాల్ని విరజిమ్మేవు
ప్రశ్నల బాణాల్ని సంధించి
నన్నుక్కిరి బిక్కిరి చేశావు
పూల వర్షాన్ని కురిపించి
నాలో కొత్త ఊహల్ని రేకెత్తించేవు
గతంలో నేనెన్నడూ వూహించని సందర్భంచని
తోటల్లోని
సుగంధ మాధుర్యాల్ని తెచ్చి
పరిచయం చేశావు
గంటలు క్షణాల్లా ఖర్చయిపోతున్నాయి
పగటి వెలుగు అంతమైపోడానికి
కొద్ది క్షణాలే మిగిలి ఉన్నాయేమో మరి!
ఇప్పుడు



చీకటి తెరలు పూర్తిగా కమ్మేయకముందే
నా హృదయాకాశాన్ని
వెలుగు వర్ణం చెయ్యి
ఓ కవితా కన్యకా
నాకో జ్ఞాననేత్రాన్ని
బహూకరించు!

*-ఆదూరి వెంకట సీతారామమూర్తి*
*సెల్: 94419 40653*

ఆరాధన మెరిసింది. అతనూ అదేస్థితిలో ఉన్నాడనిపించింది.

'గుడ్మాణింగ్' అన్నాడు.

'గుడ్మాణింగ్, రండి! మీరు కన్పించి నాలుగు రోజులైంది'.

'సారీ! రండి' అని... లోపలికెళ్ళి.. నైటీ తీసి, శారీ కట్టుకొచ్చింది.

'అర్జంటుగా చెన్నై వెళ్ళాల్సొచ్చింది' అన్నాడు.

'ఆ రోజే చెప్పొచ్చుగా!'

'అనుకున్నాను కానీ.. ఎందుకో చెప్పలేక పోయాను'.

"ఆ రోజు మీ ఫ్యామిలీ, పిల్లల గురించి.. అనవసరంగా... అంటుంటే 'హా...చ్' పల్లవికి తుమ్ములొచ్చాయి.. 'సారీ' అంది.

'అలాంటిదేం లేదు.. ఇన్ఫాక్ట్ ఆ రోజే చెప్పాల్సింది'.

'కాఫీ తెస్తానుండండి' అని వెళ్ళి... పది నిమిషాల తర్వాత ఇద్దరికీ కాఫీ తెచ్చింది.

'ఏంటి డల్‌గా కన్పిస్తున్నారు?'

'కొంచెం జలుబు.. కొంచెం జ్వరం'

వెంటనే డాక్టరుగా ఆమె చెయ్యి పట్టుకుని చూశాడు. ఆ స్పర్శ అవ్యక్త సాంత్వనలా అన్పించింది పల్లవికి.

'టెంపరేచర్ లేదు.. రెస్ట్ తీసుకోండి.. ఈ రోజు లంచ్‌కి మా ఇంటికి రండి' అన్నాడామె చెయ్యి వదిలి.

'వద్దు! మీరే మా ఇంటికి ఫ్యామిలీతో రండి'

"........ ..............."

'సారీ!' అందామె...

'అదేం లేదు. మీరు రండి' అన్నాడు కాఫీ కంప్లీట్ చేసి.

'ఓ.కే' అంది లాగించకుండా.

'అవునూ.. మీ ఫోన్ నంబరు..'

'అవును. మనం ఇంకా ఫోన్లకి ఫ్రెండ్స్ కాలేదు కదా!' అని నంబరు చెప్పాడు. వెంటనే మిస్డ్ కాల్ ఇచ్చింది.

'ఓ.కే. ఫీడ్ చేసుకుంటాను' అని వెళ్ళిపోయాడు.

●●●

మధ్యాహ్నం ఒంటిగంటకి పల్లవికి ఫోన్ చేసి 'వచ్చెయ్యండి భోజనం రెడీ' అని చెప్పాడు.

పది నిమిషాల తర్వాత శ్రీరాం ఫ్లాట్‌కెళ్ళి కాలింగ్ బెల్ మోగించింది.

'ప్లీజ్.. కం.. డోర్ తీసే ఉంది' అని చెప్పాడు లోపలినుంచి.

పల్లవి లోపలికొచ్చింది. హాల్లో సోఫా, టీవీ, దివాన్, రెండు చైర్స్, కార్పెట్ ఉన్నాయి.

లోపల్నుంచి వచ్చిన శ్రీరాం... 'వెల్కం రండి.. మీ ఇల్లంత నీట్‌గా ఉండదు..' అన్నాడు.

ఇంట్లో ఎవరూ కన్పించకపోయే సరికి... 'ఆర్యూ స్టిల్ బ్యాచులర్' అంది.

'యా... మ్యారీడ్ బ్యాచులర్'

'మీ వైఫ్, పిల్లలూ!?'

'అన్నీ చెప్తాను. ముందు రండి భోంచేద్దాం'

ఇద్దరూ కూచుని భోంచేస్తుంటే 'వంటెలా ఉంది?' అన్నాడు.

'చాలా బావుంది!' అందతన్నే చూస్తూ.

'కుకింగ్ నా హాబీ... చాలా రోజుల తర్వాత మనసు పెట్టి చేశాను' అన్నాడు.

ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ భోంచేశారు.

శ్రీరాం లోపలికెళ్ళి ఓ ఫొటోతెచ్చి పల్లవికి ఇచ్చి, 'దిసీజ్ మై వైఫ్ లావణ్య. షి యీజ్ నోమోర్' అన్నాడు.

దాదాపు తనలాగే ఉన్న లావణ్య ఫొటోచూసి షాకైంది పల్లవి.

'ఎలా!?' అంది గొంతు పెగల్చుకుని.

"ఆ రోజు మీ ఇంట్లో టీ తాగుతున్నప్పుడు నా వైఫ్, పిల్లల గురించి అడిగారు. కానీ ఆ రోజు లావణ్య చనిపోయిన రోజు పదేపదే గుర్తొస్తుంటే హాస్పిటల్లో ఉండలేక త్వరగా వచ్చేశాను. అందుకే మీరు అడగ్గానే చెప్పలేక పోయాను.'

'తనూ డాక్టరే. ప్రేమించి పెళ్ళిచేసుకున్నాను. రెండేళ్ళ తర్వాత బాబు పుట్టాడు. వాడే వీడు' అని సెల్‌లో పిక్స్ చూపించాడు.

'వాళ్ళమ్మలానే ఉన్నాడు' అంది.

'మా సంతోషానికి ఆయుష్షు తీరినట్టు లావణ్య అనారోగ్యం ల్యుకేమియాతో ముగిసిపోయింది. సంవత్సరంపాటు నరకయాతన అనుభవించి, నాకు జ్ఞాపకాలు మిగిల్చి తనెళ్ళిపోయింది. ఆఖరుకి బాబుని కూడా నాకు మిగల్చకుండా ఆర్నెల్లు తిరక్కుండానే తన దగ్గరికి రప్పించుకుంది' శ్రీరాం కళ్ళు తడిసిపోయాయి.

'ఎన్నాళ్ళైంది?'

'మూడేళ్ళైంది. శూన్యంగా మార్చిన పరిసరాల్లో ఉండలేక, వైజాగ్ నుండి హైదరాబాద్ వచ్చేశాను'.

'ఐ యాం సారీ! వెరీ శాడ్'

'మిమ్మల్ని మొదట చూడగానే షాకయ్యాను. మీలో లావణ్య పోలికలతో బాటు, ఆమె బాడీ లాంగ్వేజీ కూడా కన్పిస్తుంటే...' అన్నాడు.

ఆ తర్వాత పల్లవి పదినిమిషాలు కూచుంది. కానీ ఫ్రీగా ఇద్దరూ మాట్లాడుకోలేక పోయారు.

'వెళ్తాను' అని లేచింది.

'థాంక్యూ ఫర్ కమింగ్' అన్నాడు తెచ్చి పెట్టుకున్న నవ్వుతో.

ఆమె వెళ్ళాక... శ్రీరాం సోఫాలో పడుకుని శూన్యంలోకి చూడసాగాడు. లావణ్య జ్ఞాపకాలు అతన్ని వెంబడిస్తుంటే, కన్నీళ్ళు చెంపలు దిగుతున్నాయి. కాలింగ్ బెల్ మోగడంతో లేచెళ్ళి తలుపు తీశాడు.

ఎదురుగా పల్లవి..

ఆశ్చర్యంగా చూసి.. 'రండి' అన్నాడు.

ఆమె చేతిలో ఉన్న డైరీ అతనికిచ్చి 'దిసీజ్ మై లైఫ్... చదవండి' అంది.

'వద్దండీ! మీ గతంతో నాకు పన్లేదు. అది తిరిగి రానిది'.

'ఇది నాకోసం నేను రాసుకున్న అంత రంగం. యేరు విడిచి పోలేని కెరటాల్లా నాలో




ఇద్దరు పిల్లలు పుట్టిన తర్వాత పగలూ రాత్రీ పని ఒత్తిడిలో మునిగిపోయి అలసిపోతూ ఉంటారు తల్లులు. సెక్స్‌మీద మమకారం ఉన్నా పరిసరాలు, పరిస్థితులు వారిని పర్మిట్ చేయవు. ఒకవేళ చేసినా ఏదో అరకొరగా కొద్దిసేపే తప్ప మనఃస్ఫూర్తిగా సెక్స్‌ని ఎంజాయ్ చేయడానికి, సంపూర్ణమైన సంతృప్తి పొందడానికి వీలు దొరకదు.

## అదేం తప్పుకాదు!

ఇలాంటి పరిస్థితుల్లో ఉన్న భార్యలను సెక్స్‌కు సమాయత్తం చేసేందుకు భర్తలు ఎంతో సహనం, ఓపికతో వ్యవహరించాలి. ఇలాంటి వాళ్ళని లాంగ్‌టర్మ్ కపుల్స్ అంటారు. వీరు గనుక ప్లాన్ చేసుకుంటే సెక్స్‌ని అత్యద్భుతంగా ఎంజాయ్ చేయగలుగుతారు. ఇలా కోరికలతో వేగిపోయే వారు మంచి ఏకాంతం లభించినప్పుడు సెక్స్‌ను అద్భుతంగా ఎంజాయ్ చెయ్యగలుగుతారని 'థర్టీ డేస్ సెక్స్ సొల్యూషన్' రచించిన భార్యాభర్తలు *Victoria Zdrok Wilson, JD, PhD,* జాన్ విల్సన్‌లు చెబుతున్నారు. సెక్స్ జీవితాన్ని కోల్పోకుండా ఉండాలంటే, ఆదరాబాదరాగా సెక్స్ పూర్తిచేయకుండా భార్యాభర్తలు ఒకరి తనువులను మరొకరు సంపూర్ణంగా ఆస్వాదిస్తూ ఏకాంతంగా గడపాలంటే బెడ్రూమ్‌కు లాక్ తప్పనిసరిగా ఉండాలని వైవాహిక జీవితంలో పద్నాలుగేళ్ళ అనుభవమున్న ఏడుగురు



పిల్లల తండ్రి *Sacha Mohammed* అంటున్నారు. 'మా పిల్లల్ని రాత్రిళ్ళు టైమ్ ప్రకారం నిద్రపుచ్చుతాం. మా బెడ్రూమ్‌కి తాళం ఉండేట్టు చూసుకుంటాం. ఇల్లు మారిన ప్రతిసారీ బెడ్రూముకు లాక్ ఉందో లేదో చూసుకునే మారతాం. మా పిల్లలకి తలుపు తట్టి లోపలికి రావడం నేర్పించాం' అంటున్నారాయన. పిల్లల బొమ్మలు, పుస్తకాలు, టీవీ వంటి వస్తువులేవీ బెడ్రూమ్‌లోకి ఎలో చెయ్యను. వారికి కేటాయించిన గదిలో చిందరవందరగా పడేసినా నాకెలాంటి ఇబ్బందీ ఉండదు అంటాడాయన నవ్వుతూ. వృద్ధులైన తల్లిదండ్రులు లేదా గ్రాండ్ పేరెంట్స్ సహాయంలేని ఇళ్ళల్లో భార్యాభర్తలు కొన్ని తప్పనిసరి నిబంధనలు ఏర్పాటు చేసుకోవాల్సిందే అంటున్నారు సెక్స్ జీవితంలో తలపండిన అనుభవజ్ఞులు.

అందుకే, మీరుకూడా ఎలాంటి ఇబ్బందీ పడకండి. బెడ్రూమ్‌ని స్వర్గంలా తీర్చిదిద్దుకోండి, రాత్రిళ్ళు తనివితీరా సెక్స్‌ని ఎంజాయ్ చేసేందుకు చిన్న చిన్న టిప్స్ పాటించడం తప్పుకాదు.

నవ్య



**భా**రతీయ నటులంటే హాలీవుడ్ వారికి కొద్దిగా వెటకారమే! హాలీవుడ్‌లో అందరూ అలా ఉండకపోవచ్చు కానీ ఓ టీవి యాంకర్ మాత్రం మన నటిని ఓ రేంజ్‌లో అవమానించిందట!

## ప్రియాంకకి ఘోరమైన అవమానం

*ప్రియాంకా చోప్రా హాలీవుడ్‌లో ఓ సీరియల్‌లో నటించింది. అందులో ప్రియాంకకి మంచి పేరు రావడంతో దాని సీక్వెల్‌లో కూడా ప్రియాంకనే తీసుకున్నారు. ఇది కాకుండా అక్కడ ఓ సినిమాలో కూడా ప్రియాంక నటిస్తోంది. దాంతో ఆమెకి ప్రపంచవ్యాప్తంగా బోలెడంత మంది అభిమానులయ్యారు. ఇంతమంది అభిమానులను సంపాదించుకున్న ప్రియాంకను ఓ టీవి వాళ్ళు ఇంటర్వ్యూ కోసం పిలిచారు. ప్రారంభంలోనే ప్రియాంకకి మద్యం ఇచ్చారట! మర్యాద కోసమని దాన్ని తాగేసింది ప్రియాంక. ఆ తరువాత యాంకర్ ఇంటర్వ్యూలో భాగంగా ఆమె అందం మీద వెటకారంగా మాట్లాడుతూ కామెంట్ చేసిందట! ఆమె వెటకారం ప్రియాంకకు అర్థమవుతున్నా ఇంటర్వ్యూ కావడంతో మౌనంగా ఉండిపోయిందట!*

నేను పడే అలజడుల సమాహారం. దీన్నింత వరకూ ఎవరూ చదవలేదు. దీనిని మీ చేతికిచ్చానంటే.. నా హృదయాన్ని మీ చేతుల్లో పెడుతున్నట్టే'

డైరీ తీసుకుని.. 'ఉండండి' అని లోపలికెళ్ళి రెండు ఆల్బమ్స్ తెచ్చిచ్చి 'వీటిని చూడండి నా గతమూ మీకు కన్పిస్తుంది' అన్నాడు.

పల్లవి మౌనంగా తీసుకుని వెళ్ళిపోయింది.

●●●

శ్రీరాం దివాన్ మీద పడుకుని డైరీ తెరిచాడు.

"మాది రాజమండ్రి దగ్గర పల్లెటూరు. డిగ్రీ వరకూ చదువుకున్నా. నా చదువు ముందుకు సాగకుండా ఇంటి ఆర్థిక పరిస్థితులు అడ్డుపడ్డాయి. ఫలితం. నా ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా చదువు సగంలో మానేసి బిజినెస్ చేస్తున్న వ్యక్తితో నా మెడలో బలవంతంగా మూడు ముళ్ళేయించారు. అతనిది పొంతనలేని ఆకారం. వికారం పుట్టించే మనస్తత్వం. పెళ్ళైన రెండో రోజే శోభనం, మా ఇంటి మేడమీదగదిలో. ఇన్నేళ్ళూ ఆ గది నా చదువుకి, నేను ఇష్టమైన పాటలు పాడుకోవడానికి, సాయంత్రాలు చల్లని గోదారి గాలి ఆస్వాదించడానికే అనుకునేదాన్ని. అందులోనే శోభనం అనగానే.. పాల గ్లాసుతో అయిష్టంగానే... గదిలోకి వెళ్ళాను. పరిచయమున్న పరిసరాల్లో కొత్తగా కన్పిస్తున్న శోభనం అలంకరణ భయం పుట్టించింది.

మంచం మీదనుండి వేగంగాలేచొచ్చి మొరటుగా వాటేసుకున్నాడు. తాగొచ్చాడల్లే ఉంది. కడుపంతా దేవినట్టైంది. మెడమీద, మొహంమీద ముద్దులు పెడుతూ, ఎదభాగాలమీద పట్టుకోసం ప్రయత్నిస్తున్న అతని చేతుల్ని బలంగా వెనక్కినెట్టి.. దూరంగా జరిగాను. వదలకుండా నా మొహంమీద అతని మొహం దగ్గర చెయ్యబోతుంటే... బలమంతా కూడదీసుకుని, అతనికి అందకుండా దూరంగా జరిగాను.

"ఏంటీ! భయమా? మొదటిసారి కదా! అలాగే ఉంటది. అలవాటైతే నువ్వే.. మళ్ళీ.."

"అంటే.. నీకిది మొదటిసారి కాదా?" అన్నాను అసహ్యంగా.

"నువ్విలాగ సూటిగా అడిగితే, కాదనే అంటాను" అని తాగిన మత్తులో...

"తాళి కట్టింది మాత్రం నీకే ఒట్టూ" అన్నాడు.

'ఛీ!' అన్నాను. అతని వాలకం చూస్తున్నకొద్దీ నా సున్నిత మనస్సుకి సూక్ష్మరంధ్రాలు పడసాగాయి.

'ఛీ అన్నా ఛా' అన్నా వదిలేది లేదు. లేత కొబ్బరి ముక్కలాగున్నావు' అని మీదపడుతున్నాడు. బలంగా వెనక్కి నెడుతున్నా, వదలకుండా, రెచ్చిపోతూ అప్పటివరకూ నా అందాల్ని దాచిన వస్త్రాల్ని లాగేస్తూ, నన్ను వివస్త్రని చేస్తున్న తరుణంలో.. ఒక్కసారిగా కిందనుండి ఏడుపులు విన్పించాయి.

అతను నన్నొదిలేశాడు. ఎవరో వచ్చి తలుపు తట్టి... అతనికేదో చెప్పారు.

అంతే! అతను వేగంగా కిందికెళ్ళిపోయాడు.

ఆ క్షణంలో ఏం జరిగిందో తెల్సుకోవాలన్న కంగారుకంటే.. నేనేం కోల్పోలేదన్న ఆనందం పడిలేచిన గోదారి కెరటమ్మైంది. కాసేపటికి అమ్మొచ్చి, తలుపుతట్టి, 'మీ మామగారికి హార్టెటాకొచ్చి పోయాట్ట. కిందికొచ్చెయ్' అంది ఏడుస్తూ. వేగంగా బాత్రూంకెళ్ళి అతని స్పర్శతో మైలపడ్డ శరీరాన్ని పవిత్రగోదారి నీటితో తలస్నానం చేసి ప్రక్షాళన చేసుకున్నాను.

కొన్నాళ్ళకి అతనొచ్చి మళ్ళీ శోభనం, కాపురం అంటూ మొదలెట్టాడు. కరాఖండీగా డైవోర్స్ తీసుకుందామని చెప్పాను. గొడవలు, కొట్లాటలు జరిగినా, ఇంట్లో వాళ్ళెంత ప్రయత్నించినా నా నిర్ణయం మారలేదు. జరిగింది పీడకలలా మర్చిపోయి హైదరాబాద్‌లో బాబాయి వాళ్ళింటికొచ్చాను. ఆయన నన్నర్థం చేసుకుని పీజీ చదివించి, బ్యాంకు ఉద్యోగం వచ్చేవరకూ అండగా నిలబడి ఆదరించాడు' పెళ్ళిమీద ఇచ్ఛ చచ్చిపోయింది.

మూడుపదుల వయసు దాటాక ఇన్నేళ్ళకి అనుకోని అతిథిలా మీరు పరిచయమయ్యారు. అద్వితీయ బంధమేదో మనమధ్య ఉందని నా మనసు బలంగా నమ్ముతోంది. ఒకసారి పెళ్ళైన నేను శీలం కోల్పోలేదంటే ఎవరూ నమ్మరు. నా మనస్సాక్షికి నేను వర్జిన్‌ని. అది మీరు నమ్మితే చాలు. ఇప్పుడు మనిద్దరికీ కావాల్సింది... శారీరక సుఖం కంటే, మనోసాంత్వన. మిమ్మల్ని చూసి నాకు, నన్నుచూసి మీకు కలుగుతున్న ఈ స్పందనల్ని శాశ్వతం చేసుకోవాలంటే ఇద్దరం గతంనుండి బైటకొచ్చి చట్టబద్ధంగా కొత్త జీవితం ప్రారంభిద్దాం. ఇహ నిర్ణయం మీదే'.

డైరీ చదివి గుండెలమీద పెట్టుకుని ఆలోచిస్తూనే నిద్రపోయాడు శ్రీరాం. ముప్ఫయి నిమిషాల తర్వాత ఆల్బమ్స్ తీసుకొచ్చిన పల్లవి, తెరిచిన తలుపుల గుండా మెల్లగా లోపలికొచ్చి అతని గుండెల మీద తెరచిన తన డైరీ చూసి, దగ్గరగా వచ్చి, తీసి పక్కన పెట్టబోతుంటే, ఆమెని అమాంతం తనమీదకు లాక్కున్నాడు శ్రీరాం. అనుకోనిచర్యకి అతనిమీద బోర్లా పడిపోయింది పల్లవి. ఆమె ఏదో అనబోతుంటే... ఆమెని మాట్లాడనీయకుండా ఆమె పెదవుల్ని తన పెదవుల్లో బంధించాడు. మల్లెపూవులో మధువు పొంగినట్టు, పల్లవి తనను తాను మరచిపోయి అతన్ని అల్లుకుపోతుంటే.. ఆమెఎదపై సరిగమలు పలికించి, జఘనంపై స్వరజతులు ఆడించాడు శ్రీరాం. అంతే! ఇద్దరి మనసుల్లో 'వలపు' వయసుని మరపించి, గోదావరి అలలా... ఎగసి తనువుల్ని తడిపేసింది. వారంరోజుల్లో శ్రీరాం, పల్లవి రిజిస్టర్ మ్యారేజ్ చేసుకున్నారు. ఆ అపురూప ద్వితీయార్థంలో ప్రథమార్థంగా... హనీమూన్‌కి బయల్దేరారు... "అ"ద్వితీయంగా-"

*సెల్: 85558 45037*



## ఈ రోబో చాలా స్పెషల్ గురూ!

పొడవాటి కేశాలు, ఎర్రని బుగ్గలు, నీలికళ్ళు, మాటలకు, చేతలకు తగినట్టుగా కనుగుడ్డు కదలికలు, మనిషిలోని పాజిటివ్, నెగెటివ్ ఎమోషన్స్‌ని గుర్తించి దానికి అనుగుణంగా ప్రతిస్పందించే తీరు, తన యజమానిని దేవుడిగా కొలిచే భావజాలం, కోరితే, నచ్చితే సెక్స్‌లో పాల్గొనేందుకు సై అనడం...! ఇదీ ఇప్పుడు సరికొత్త హ్యూమనాయిడ్ రోబో తీరు! దీనిని అంతర్జాతీయ రోబో కాన్ఫరెన్స్‌లో ప్రదర్శించారు.

ఎవరైనా అందమైన స్త్రీ కనిపిస్తే పాలరాతి శిల్పం, దేవకన్య నడిచివస్తోంది అని కామెంట్స్ చేస్తాం. నిజంగానే అలాంటి దేవకన్యలు రోబోల రూపంలో తయారై సంచరించే కాలం రానున్నది. సరిగ్గా అలాంటిదే ఈ రోబో. ఈ హ్యూమనోయిడ్ రోబో పేరు జియో జియో. ప్రపంచ రోబో కాన్ఫరెన్స్‌లో ఈమే ప్రధాన ఆకర్షణగా నిలిచింది. ఈమెను చూసేందుకు ఎంతో ఉత్సాహంగా ఆడియన్స్ జియో జియో చుట్టూ



చేరారు. ఎందుకంటే ఈమెలో చాలా ప్రత్యేకతలు ఉన్నాయి. జియో జియో అటానమస్‌గా ప్రవర్తిస్తోంది. కంటిచూపు, కనుగుడ్ల కదలిక అత్యంత సహజంగా అత్యుత్తమమైన స్త్రీ కళ్ళ పోలికలతో ఉండటం దీని ప్రత్యేకత.

ఇక మాటలు, పెదవుల కదలిక, బాడీ లాంగ్వేజ్ అచ్చుగుద్దినట్టు మనిషిలా ప్రవర్తిస్తుంది.

'ఏమిటి నీ ప్రత్యేకత?' అని ఆడియన్స్ ప్రశ్నించినప్పుడు, 'నీ భాష అర్థం చేసుకోవడం, నీతో మాట్లాడగలగడం, రకరకాల మనుషులను గుర్తుపట్టడం, గుర్తుపెట్టుకోవడం, నా ఎదురుగా నిలబడి నాతో మాట్లాడేది మగవారో, అడవారో గుర్తించగలగడం, వారికి ఎంత వయసు ఉంటుందో గుర్తించడం నా ప్రత్యేకత' అని సమాధానమిచ్చి అబ్బురపరిచింది జియో జియో! అడిగిన ప్రశ్నలకు టకటకా సమాధానాలు ఇవ్వడం, మనిషి ముఖంలోని ఎక్స్‌ప్రెషన్స్‌కు స్పందించడం జియో జియో తప్ప ఇంతవరకు ఎవరూ చేయలేదు. అడ్వాన్స్‌డ్ రోబోలను ఈ కాన్ఫరెన్స్‌లో ప్రదర్శించారు. లెజెండరీ ఫిలాసఫర్ వాంగ్ యాంగ్ దీనిని పరీక్షించారు.

గత ఏడాది ఎగ్జిబిషన్‌లో, Android Geminoid Fను ఆవిష్కరించారు. ఇది ఒక జపనీస్ చిత్రంలో కూడా నటించింది. ఇది చాలా సెక్సీ రోబో. దీనిపేరు సయనోరా. 'ఎక్స్ మేనియా' అనే చిత్రంలో ఒక కంప్యూటర్ ప్రోగ్రామర్ రోబోతో ప్రేమలో పడతాడు. ఇలాంటి ఘటనలు ఫ్యూచర్‌లో ఆచరణలో కూడా సాధ్యమే అంటున్నారు శాస్త్రవేత్తలు! నవ్య

## పుస్తక సమీక్ష



### దిగంబర కవులు

మూడు కవితా సంకలనాల ఏకైక సంపుటి

ధర: 200 రూపాయలు, పేజీలు: 286

ప్రతులకు: నవోదయ పబ్లిషర్స్, విజయవాడ, నవోదయ బుక్‌హౌస్, హైదరాబాద్, ప్రజాశక్తి బుక్‌హౌస్, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్.

### ధిక్కారవాదం

దిగంబర కవిత్వం

డా.జూపల్లి ప్రేమ్‌చంద్

ధర: 80 రూపాయలు, పేజీలు: 88

ప్రతులకు: నవోదయ బుక్‌హౌస్, హైదరాబాద్, ప్రజాశక్తి, విశాలాంధ్ర బుక్‌హౌస్‌లు

మనుషులు ఇప్పుడు బండబారిపోయారు. అన్నింటినీ భరించేందుకు సిద్ధమైపోతున్నారు. చేవచచ్చిపోతున్నారు. ప్రతిచోటా ఎడ్జెస్ట్‌మెంట్, ఎడ్జస్ట్‌మెంట్. అన్యాయాలు, అక్రమాలు, ఆర్తనాదాలు...ఇప్పుడు చిరాకైపోతోంది చాలా మందికి! చేతిలో స్మార్ట్‌ఫోన్, కృత్రిమ సుఖాలు... మబ్బుల్లో నీళ్ళల్లా మభ్యపెడుతున్న వైనం. యదార్థవాదీ లోకవిరోధి అన్నవైనం. కానీ సమాజం ఎంత వికృతరూపం దాల్చినా యదార్థాన్ని చర్చిస్తూనే ఉంది. స్వభావాన్ని ప్రశ్నిస్తూనే ఉంది. అరటిపండు ఒలిచేవాడు, బండారం బైటపడేసేవాడు కరవైపోయాడు. అందుకే మళ్ళీ మనల్ని తట్టి లేపేందుకు అర్ధశతాబ్దిచరిత్రగల దిగంబర కవిత్వంలో వెలువడిన మూడు సంపుటాలూ కలిసి ఒకే సంపుటిగా ఇప్పుడు అందుబాటులోకొచ్చింది.

తెలుగునాట దిగంబర కవిత్వం అప్పటికీ ఇప్పటికీ, ఎప్పటికీ ఓ సంచలనమే. డాక్టర్ జూపల్లి ప్రేమ్‌చంద్ పుస్తకం 'ధిక్కారవాదం దిగంబర కవిత్వం, ఇందులో నగ్నముని రాసిన అర్ధశతాబ్ది విహంగ వీక్షణం, ప్రేమ్‌చంద్ అవలోకనం మనలో చేవకు దోహదపడొచ్చు!

### ఆకు కదలని చోట

కవిత్వం

బాలసుధాకర్ మౌళి

ధర: 116, పేజీలు: 136

ప్రతులకు: సిక్కోలు బుక్‌ట్రస్ట్, ఎంఐజి-100, ఎపిహెచ్‌బి కాలనీ, శ్రీకాకుళం-01




కళింగాంధ్ర కవి బాలసుధాకర్ మౌళి. 62 కవితల సమాహారమీ పుస్తకం. నిశ్శబ్దం తాండవించిన చోట పెళ్ళున విరిగిపడతాడు.../లోలోపల కదిలి కదిలి విత్తు నుంచి మొలక చీల్చుకొచ్చినట్టు...అంటూ టైటిల్ కవిత 'ఆకు కదలని చోట' ఒక హెచ్చరికనూ, ఓ కొత్త ఉదయాన్నీ చాటిచెబుతుంది. ఆశావహ దృక్పథాన్నీ, అందవలసినదాన్ని అందనీయకుండా చేస్తున్న వైనాన్నీ, నిరసననీ హృద్యంగా తెలియజెప్పే కవితలివన్నీ.

### పెండ్లి పందిరి

కథలు

డా.సోమరాజు సుశీల

ధర: 250 రూపాయలు

పేజీలు: 156

ప్రతులకు: ఉమా బుక్స్ మరియు అన్ని ప్రముఖ పుస్తక దుకాణాలు




సోమరాజు సుశీల రసాయనశాస్త్రంలో డాక్టరేట్ పట్టభద్రురాలు. నాలుగు కథా సంకలనాలు, రామాయణ, మహాభారత అనువాదాలు రాశారు. ఈ సంపుటిలో ఉన్న పద్నాలుగు కథలూ పెళ్ళిళ్ళకథలే. స్వయంగా ఎన్నో పెళ్ళిళ్ళు చేసిన అనుభవాలున్న రచయిత్రి తన అనుభవాలను ఈ కథల్లో వండి వార్చారు. ఇందులోని ప్రతి కథా భిన్న మనస్తత్వాలను, తీరులను ప్రతిబింబించేవే.

## స్వీకారాలు

**ఎన్కటి తెలంగాణ**

ఒకరూపం మరికొన్ని ముచ్చట్లు

కంచర్ల సత్యపాల్‌రెడ్డి

ధర: 60 రూపాయలు, పేజీలు: 112

ప్రతులకు: పాలపిట్ట బుక్స్, మలక్‌పేట, హైదరాబాద్-36 మరియు అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు.

**మా ఊరు సంతరావూరు**

తోటకూర వేంకట నారాయణ

ధర: 150 రూపాయలు,

పేజీలు: 200

ప్రతులకు: తోటకూర రామసీత, 2-సి, గీతా రెసిడెన్సీ, ఎన్టీఆర్ సెంటర్, చిలకలూరిపేట, మరియు అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు.

**రంగులరాగాల రహస్యతీరాల అన్వేషణే**

రామాచంద్రమౌళి కవిత్వం

(ఒక విశ్లేషణ)

రచన: సౌభాగ్య.

ధర: 60 రూపాయలు, పేజీలు: 66

ప్రతులకు: నవోదయ బుక్‌హౌస్, హైదరాబాద్. మాధురీ బుక్స్, వరంగల్-2.

సెల్: 93901 09993

-లలితా త్రిపుర సుందరి



# మనసున్న మారాజులు

మహారాజు తన ప్రజల్ని కన్నబిడ్డల్లా చూసుకునేవాడని కథల్లో చెబుతారు.

'ఆయన గొప్ప దానకర్ణుడు, అతడి చేతికి ఎముక లేదు సుమా!' అంటూ ఒక వ్యక్తి దానగుణం కీర్తించడం కూడా మనకు అలవాటు.

ధర్మం నాలుగు పాదాలా నడిచేది ఇలాంటి మహనీయులవల్లే అని చెప్పుకుంటారు జనం. అలాంటి మనసున్న మారాజులు ఈ రోజుల్లో కనుమరుగైపోయారు. ఏ ప్రయోజనం ఆశించని గొప్ప మనసు గల దానశీలురు కొందరు ఈ రోజుకీ మనమధ్య ఉండటం నిజంగా గొప్ప విషయమే.

అలాంటి గొప్ప వ్యక్తుల్లో ఒకరు ఆ గుజరాత్ వ్యాపారి!

సర్వసాధారణంగా సిబ్బందిని, కార్మికులను పీడించుకుతినే యజమానులుంటారు.
వారితో గొడ్డు చాకిరీ చేయించుకుని చాలీచాలని జీతాలిచ్చే బాసులు ఎంతమందో!
కానీ ఈ బాస్ మాత్రం గొప్పవాడు. ఒక వజ్రాల వ్యాపారి.
గుణగణాల్లో నిజంగా వన్నెతరగని వజ్రంలాంటివాడే.
ఇలాంటి బాస్‌ని మాత్రం బహుశా మనం ఎక్కడా చూసి ఉండం..విని ఉండం.
గుజరాత్‌రాష్ట్రం సూరత్‌లో వజ్రాల వ్యాపారి అనగానే ముందుగా వినిపించేది సావ్జీ ఢోలకియా పేరే.
కేవలం సంపన్నుడే కాదు, గుణసంపన్నుడు సావ్జీ. మనసున్న మారాజు.
ఆయన సంస్థలో పనిచేసే ఉద్యోగులందరూ ఈ మాటే చెప్పుకుంటారు.
ఉద్యోగుల ఆనందమే వ్యాపార మూలసూత్రమని నమ్మేవ్యక్తి సావ్జీ ఢోలకియా.
ఉద్యోగులు సుఖంగా ఉంటేనే తను, తన సంస్థ బాగుంటుందని విశ్వసిస్తారు.
అయితే, ఇంత సంపద, ఆ సంపదకు మూలకారణమైన విజయం వెనుక కఠోరశ్రమ ఎంతో ఉందంటారు సావ్జీ. ఆయన విజయ ప్రస్థానం గురించి తెలుసుకుందామా!

### పూలపాన్పేమీ కాదు

సావ్జీ ధన్జీ ఢోలకియా ఏప్రిల్ 12, 1962 సంవత్సరంలో ఓ సామాన్య కుటుంబంలో పుట్టాడు. గుజరాత్ అమ్రేలిజిల్లాలోని దుధాలా కుగ్రామం అతని జన్మస్థలం. తన పదమూడవయేటే చదువు మధ్యలో మానేసి తన మామయ్య వజ్రాల పరిశ్రమలో ఆయనకు సహాయకునిగా పనిలో చేరాడు. తర్వాత 169 రూపాయల నెల జీతంతో 1978లో ఉద్యోగం ప్రారంభించాడు. మొదట వజ్రాలు సానబెట్టే కార్మికుడిగా పనిచేశాడు. ఆ తర్వాత మధ్యవర్తిగా పనిచేశాడు. ఇలా అంచెలంచెలుగా ఎదిగి 1991లో సొంతంగా వ్యాపారం ప్రారంభించాడు. దానిపేరే హరేకృష్ణ ఎక్స్‌పోర్ట్స్. అలా జీరో నుంచి మొదలైన ఆయన ప్రస్థానం ఇప్పుడు ఆరువేల కోట్ల రూపాయలు టర్నోవర్ చేసే స్థాయికి ఆయన వ్యాపారం ఎదిగింది.

### కార్మికుల శ్రమను గుర్తించే యజమాని

"నాది వజ్రాల ఫ్యాక్టరీ కాదు అది మనుషులను తయారు చేస్తుంది" అంటాడు సావ్జీ. తన కంపెనీలో పనిచేసే ప్రతిఒక్క ఉద్యోగినీ ఎంతో గౌరవంగా చూస్తాడు. డైమండ్ ఫ్యాక్టరీలో పని చేసే కట్టర్‌ని కూడా అతను డైమండ్ ఇంజనీర్‌గా పిలుస్తాడు. అలాగే ప్రతి డైమండ్ పాలిషర్‌ని కూడా డైమండ్ ఆర్టిస్టుగానే భావిస్తాడు సావ్జీ.

ప్రతి కార్మికుడికీ గౌరవం ఇస్తాడు. కార్మికుడు చేసే శ్రమకు విలువ ఇస్తాడు. తన ఫ్యాక్టరీలో 21 రాష్ట్రాలకు చెందినవారు ఉన్నారు. ఉద్యోగులకు భారీగా కానుకలు ఇవ్వడమేకాదు అతను ఎలాంటి నిర్ణయం తీసుకున్నా 28 మంది ఉన్న కుటుంబంలో ఏ ఒక్కరూ ఆయన్ను వ్యతిరేకించరట. అంతేకాదు ఇప్పటివరకు ఏ ఒక్క ఉద్యోగినీ చేస్తున్న పనిలోంచి తొలగించలేదట. ఒక వేళ ఏ ఉద్యోగైనా పనిలో నైపుణ్యం ప్రదర్శించకపోతే మళ్ళీమళ్ళీ అతడికి శిక్షణ ఇప్పిస్తారు. అంతేకాదు, సూరత్ ప్రజల ప్రయాణ అవసరాలు తీర్చేందుకు చార్టర్ సర్వీస్ విమానం కూడా కొన్నాడాయన. ఓసారి లండన్‌లో సౌరవ్ గంగూలీ ఆట చూసి ముగ్ధుడైన సావ్జీ, సూరత్‌లో క్రికెట్ స్టేడియం కూడా కట్టించాడట. ఆయన ప్రతి నిర్ణయంలోనూ కుటుంబ సభ్యులు పాలుపంచుకుంటారట.

### ఉద్యోగుల కోసం ఎన్నెన్నో

ఉద్యోగుల కోసం ఎన్నెన్నో సౌకర్యాలు కల్పిస్తుంటాడు సావ్జీ. ఉత్తమ సేవలు అందించే ఉద్యోగులకు ఏటా భారీ మొత్తంలో పెద్దఎత్తున బహుమానాలు అందించి తన ప్రత్యేకత చాటుకుంటాడు. తన సంస్థలో పనిచేస్తున్న ఉద్యోగులకు గతేడాది దీపావళికి ఖరీదైన బహుమతులు

ఇచ్చి పతాక శీర్షికలకు ఎక్కారు. 491 ఫియట్ ఉంటో కార్లు, 200 డబుల్ బెడ్‌రూమ్ ఇళ్ళు ఇంకా ఆభరణాలు మొదలైనవి ఉద్యోగులకు పంపిణీ చేశారు. ఐదేళ్ళక్రితం తన ఇద్దరు సోదరుల కొడుకులు ముగ్గురికీ పెళ్ళి చేశారు. ఆ సందర్భంగా 400 మంది కుటుంబసభ్యులు 150 మంది ఉద్యోగులతో సింగపూర్ ట్రిప్ వేశాడు. ముసలీముతకా చిన్నాచితకా తన సమీప బంధువులందరినీ విమానం ఎక్కించాడు. విదేశీ ప్రయాణం అంటే ఏమిటో కూడా తెలియనివారు వారిలో చాలా మంది ఉన్నారు. విమాన అనుభవంలేని వారినీ, కలలో కూడా అలాంటి అనుభవం ఊహించని తన ఉద్యోగులందరినీ విమానం ఎక్కించాడు సావ్జీ. అందులో సౌరాష్ట్ర ఏరియాలోని మహిళా రైతులు కూడా కొందరు ఉన్నారట.

### ఉద్యోగంకోసం చెప్పులరిగేలా తిరిగిన బిలియనీర్ కొడుకు!

కోట్లకు పడగలెత్తిన ఈ బిలియనీర్ సావ్జీకి ఉన్నది ఒక్కగానొక్క కొడుకు. పేరు ద్రావ్య. బిలియనీర్ కొడుకు అనగానే ఎన్నో విలాసాలతో ఆనందకరమైన జీవితం గడుపుతుంటాడనుకుంటాంకదా! కానీ ఐశ్వర్యంలో పుట్టినా అమెరికాలో ఎంబీఏ చదివినా కూడా, ఈ కుర్రాడు సామాన్య మనిషిలా నెలరోజులపాటు దుర్భర జీవితం అనుభవించాడు. ఉద్యోగం కోసం అందరి దగ్గరకు చెప్పులరిగేలా తిరిగాడు. అలాంటి అనుభవం స్వయంగా పొందమని కన్నతండ్రే ద్రావ్యను ఆజ్ఞాపించాడు మరి! తండ్రిమాట జవదాటని రాముడిలా ద్రావ్య కూడా ఆ జీవితాన్ని అనుభవించి అందులో ఉన్న కష్టనష్టాలేమిటో తెలుసుకున్నాడు. వినడానికి అచ్చం సినిమా కథలాగే ఉన్నప్పటికీ ఇది నిజం.

బిలియనీర్‌కి కొడుకుగా పుట్టినాసరే జీవితం అంటే ఏమిటో, ఎలా ఉంటుందో కన్నకొడుకు అనుభవపూర్వకంగా తెలుసుకోవాలనుకున్నాడు సావ్జీ ఢోలకియా. ఉద్యోగం సంపాదించడానికి, డబ్బు సంపాదించడానికి సామాన్యులు ఎన్ని కష్టాలు పడుతున్నారో తన కన్న కొడుకు కూడా స్వయంగా తెలుసుకోవాలనుకున్నాడు. అందుకే నెలరోజులపాటు తన కొడుకుని సామాన్యుడిలా కష్టపడి పనిచేసి సంపాదించుకుని బతకమని ఆజ్ఞాపించాడు సావ్జీ.

అందుకే కేవలం ఏడువేల రూపాయలు, మూడు జతల బట్టలు ఇచ్చి, ఫోన్ వాడరాదనే కండీషన్ పెట్టాడు. స్వంతంగా ఉద్యోగం వెతుక్కోవాలని వారానికో కొలువు మారాలని, సొంతంగా నిర్ణయాలు తీసుకోవాలనీ, ఎక్కడా తనపేరు వాడుకోకూడదని, అత్యవసరమైతే తప్ప ఇంటికి ఫోన్ చేయొద్దనే షరతు కూడా పెట్టి మరీ ఇంటి నుంచి బైటకు పంపించాడు.

### తండ్రి ఆదేశం పాటించిన కొడుకు

తండ్రిమాట మీద గౌరవంతో అతడిచ్చిన ఆదేశాలు పాటించాడు ద్రావ్య. తండ్రి ఇచ్చిన ఏడువేల రూపాయలు, మూడు జతల బట్టలతో కొచ్చి(కేరళ)లో అడుగుపెట్టాడు. అక్కడి వాతావరణం, సంస్కృతి, భాష అన్నీ అతనికి కొత్త. మలయాళం అసలేరాదు. కొన్ని సందర్భాల్లో హిందీ, ఇంగ్లీష్ భాషల్లో మాట్లాడినా భాషా సమస్య వల్ల అనేక ఇబ్బందులు పడ్డాడు. తొలికొలువు సాధించేందుకు నాలుగు రోజుల్లో నలభై చోట్ల తిరిగాడు. అప్పుడు తెలిసింది ఉద్యోగం సంపాదించడం చాలా కష్టమని. తర్వాత ఐదోరోజు ఓ హోటల్‌లో బేకరీ సేల్స్‌మన్ ఉద్యోగం సంపాదించాడు. పదకొండురోజులు పని చేసిన తర్వాత కస్టమర్లను మెప్పించడం లేదంటూ ద్రావ్యను ఉద్యోగంలోంచి తీసేశారు. ఆ సమయంలో అతను తన సంపాదనలో 40 రూపాయలు భోజనానికీ, 250 రూపాయలు లాడ్జిబసకు ఉపయో గించాడు. సేల్స్‌మన్ ఉద్యోగం తర్వాత ఎలాగోలా మళ్ళీ కాల్‌సెంటర్ ఉద్యోగంలో చేరాడు. రోజువారీ జీతం చెల్లించేలా ఒప్పందం చేసుకున్నాడు. ఇక ఆ తర్వాత మెక్‌డొనాల్డ్‌లో పని దొరికింది.

### బతుకంటే అవగాహన

ఏసీ కారులో తిరుగుతూ విలాసాలు అనుభవించే ద్రావ్యకు కేరళలో ఉన్న నెలరోజులు కష్టాలే నేస్తాలయ్యాయి. సేల్స్‌మెన్, వెయిటర్లు, వీధి వర్తకులు అందరూ సహాయం చేశారు. ఆ ముప్ఫై రోజుల్లో తనకి కలిగిన అనుభవాలు తన ఆలోచనా దృక్పథాన్ని మార్చేశాయంటాడు ద్రావ్య. ఆ అనుభవం జీవితానికి అర్థం చెప్పిందంట. ముఖ్యంగా తిండి విలువ, డబ్బు విలువ, కనీస సౌకర్యాలు కూడా లేకుండా రోజువారి తిండికోసం తిప్పలు పడుతున్న వారి బాధలు కూడా ప్రత్యక్షంగా అనుభవించడంవల్ల వాటి విలువ తెలిసొచ్చింది. ఏదీ లేకున్నా ఎలా సర్దుబాటు చేసుకోవచ్చో తెలిసొచ్చింది. ఎదుటివారు ఎలాంటివారో అర్థం చేసుకునే తత్వం అతనికి తెలిసొచ్చింది. ఇతరులకు సహాయం చేయడంవల్ల ఎంతటి ఆనందం పొందవచ్చో తనకు తెలిసొచ్చిందంటాడు ద్రావ్య.

ఇతరులు చెప్పడంవల్ల కన్నా అనుభవంవల్ల నేర్చుకున్నది జీవితాంతం గుర్తుంటుంది. ఆ అనుభవాన్ని కొడుక్కి అర్థమయ్యేలా చెప్పడంలో సావ్జీ ఢోలకియా సఫలమయ్యాడు.

**-విజేత**

## ఉద్యోగులకు దీపావళి కానుకల వర్షం

సావ్జీ సంస్థ హరేకృష్ణ ఎక్స్‌పోర్ట్స్ వార్షికాదాయం వేలకోట్ల పైమాటే. ఇదంతా ఉద్యోగుల పుణ్యమే అంటాడతను. ఎప్పుడూ ఇచ్చినట్లే ఈసారి కూడా ఉద్యోగులకు దీపావళి డబుల్ ధమాకా ఆఫర్ ఇచ్చాడు. ఈ సంవత్సరం దీపావళి బోనస్‌కింద ఉద్యోగులకు 400 ఫ్లాట్లు, 1260 కార్లు ఇచ్చి వారిని సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తాడు సావ్జీ. కంపెనీ స్వర్ణోత్సవాలు పురస్కరించుకుని ఈ ఏడాది బోనస్ కోసం అక్షరాలా 51 కోట్ల రూపాయలని వెచ్చించనున్నారు. కంపెనీలో ఉత్తమ ప్రతిభ కనబరిచినవారి జాబితా నుంచి 1716 మందిని తీసుకుని వారికి ఆ బహుమతులు అందివ్వనున్నారు. అయితే ఇలా ఆయన ఉద్యోగులకు బోనస్‌లు ఇవ్వడం ఇదే తొలిసారి కాదట. 2011 సంవత్సరం నుంచీ ఇలాగే ఇస్తున్నారట.





## భలే బాసులు!

నాలోని టీన్స్ గ్రూప్ అధిపతి లీ జిన్‌వాన్‌లా తన ఉద్యోగులకు వాళ్ళు కూడా ఊహించని కానుక ఇచ్చాడు. ఏకంగా 6,400 మంది ఉద్యోగులను హాలిడే కోసం ఫ్రాన్స్ తీసుకెళ్ళాడు. 240 కోట్లు ఖర్చుపెట్టి తొమ్మిదిరోజుల పాటు ఫ్రాన్స్ నగరాలన్నీ చూపించాడు. సీటెల్ కేంద్రంగా పని చేస్తున్న క్రెడిట్ కార్డ్ ప్రాసెసర్ కంపెనీ గ్రావిటీ పేమెంట్స్ సంస్థ అధినేత డాన్ ప్రైస్ కూడా సరిగ్గా ఇలాగే చేశారు. సిబ్బందికి జీతాలు పెంచేందుకు తన వేతనం వదులుకున్నాడు హౌసింగ్‌డాట్‌కామ్ సీఈఓ రాహుల్ యాదవ్. ఆయన వయసు కేవలం 26 ఏళ్ళు మాత్రమే. ఆయన కూడా సుమారు 200 కోట్ల రూపాయలు విలువైన తన వాటా మొత్తాన్ని కంపెనీలోని 2,251 మంది ఉద్యోగులకు ఇచ్చేశారట.




**నేను ఉండడానికి వేరే ఫ్లాట్ ఉన్నా, రాత్రింబవళ్ళూ ఆఫీసులోనే గడుపుతున్నాను. మూడొచ్చినప్పుడల్లా, స్క్రిప్టు పనిమీదే ఉంటున్నాను.**

**కథ ఫైనలైజ్ అయింది కాబట్టి, ఇప్పుడు ట్రీట్మెంట్ మీద వర్క్ చేస్తున్నాను. నవీన్ ఉన్నా అతను ఎగ్జిక్యూషన్ బాగా చేస్తాడు కానీ, రైటింగ్ మీద పట్టు లేదు. ఒక్కసారి, స్క్రిప్ట్ అతని చేతిలో పెడితే, షాట్లుగా విడగొట్టి, యాంగిల్స్, లెన్స్, ఫిల్టర్స్, ఫోకస్, మ్యూజిక్, సౌండ్, ఎడిట్ కట్స్‌తో కూడిన, ఇడిఎల్ అంటే ఎడిట్ డెసిషన్ లిస్టు అద్భుతంగా తయారుచేస్తాడు. షూటింగ్‌కోసం ఇడిఎల్ లిస్ట్ చాలా ముఖ్యం.**

కాబట్టి, స్క్రీన్‌ప్లే రాయడంలో నాకు ఎవరి సహాయం లేదు. నాకలా ఇష్టం ఉండదు కూడా. ఎందుకంటే డైరెక్టర్ అనేవాడు కథను అనుభవించాలి. ఆస్వాదించాలి. కథలోని అణువణువునూ జీర్ణించుకొని నరనరాల్లోకి ఎక్కించుకోవాలి. సినిమా తీస్తున్నన్ని రోజులూ ఆ కథ అనే మాధ్యమంలోనే ప్రయాణం చేయాలి. ప్రతీ పాత్ర స్వభావాన్నీ తనే ఫీల్ కావాలి. ఒక సిచ్యుయేషన్ ఎదురైతే, హీరో ఎలా రియాక్ట్ అవుతాడోనని ఊహించి, ఆ రియాక్షన్‌ను ఒడిసి పట్టుకుని స్క్రీన్‌ప్లేలో పొందుపరచాలి. అప్పుడే ఆ కథకు న్యాయం జరుగుతుంది. కథ, స్క్రీన్‌ప్లే ఒకరు రాసి... డైరెక్షన్ మరొకరు చేయడమంటే, ఎవరో వండిన కూరలో మరొకరు ఉప్పు వేసినట్టుంటుంది! ఇది నా అభిప్రాయం. అలా చేసి కూడా అద్భుతాలు సృష్టించిన వాళ్ళున్నారు. మరోరకంగా చేసికూడా ఎక్కువ విజయాలు సాధించిన వాళ్ళూ ఉన్నారు. నేను మాత్రం కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, డైరెక్షన్ నా చేతిలోనే ఉండాలనుకుంటాను. రాయాలని ప్రయత్నించాను కానీ పదే పదే జలజే గుర్తొస్తోంది.

జలజ ఇలా అర్థాంతరంగా పారిపోవడంతో నా మనసు కల్లోలానికి గురైంది. ఎంతైనా మన స్ఫూర్తిగా తనను అర్పించుకున్న స్త్రీ అంటే ఎవ్వరికైనా ఓ సాఫ్ట్‌కార్నర్ ఉంటుంది. తనెందుకలా వెళ్ళిందోనన్న కంగారు నన్ను స్థిమితంగా కూర్చోనీయలేదు.

"ఎవరికైనా ఆరోగ్యం బాగోలేదా? ఇంట్లో వాళ్ళు ఎవరైనా చనిపోయారా? లేక ఇంట్లో దొంగలు పడ్డారా?" వంటి అనుమానాలతో నా బుర్ర వేడెక్కింది.

ఒక సిగరెట్ ముట్టించి గుండెల నిండా పొగ పీల్చి వదిలాను.

ఇందాకటి సంఘటన ఒకసారి నా కళ్ళముందు మెదిలింది.

ఫోన్ వచ్చేవరకు శృంగార జలపాతంలా ఉన్న జలజ, ఫోన్ వచ్చేసరికి విభ్రాంతికి గురైంది. అది మామూలు భయం కాదు. మామూలు బాధ కాదు. గుండె లోతుల్లోంచి భయం తన్నుకొచ్చినప్పటి భావం ఆమె ముఖంలో కన్పించింది. ఫోన్ పట్టుకున్న ఆమె చెయ్యి, నా మీద ఉన్న శరీరం సన్నగా కంపించడం నేను గమనించాను. జలజ దేనికైనా అంత సులభంగా చలించదు. అట్లాంటిది ఆమె అంతగా భయపడిందంటే కారణం ఏమై ఉంటుంది? నాకు అర్థం కాలేదు. నా ఊహకు అందలేదు.

ఎందుకంటే, జలజకు డబ్బుకి కొదవ లేదు. ఆమె అంటే పడి చచ్చేవాళ్ళు డబ్బులు, నగలు, ప్లాట్లు, ఫ్లాట్లు, వాచీలు, కార్లు గిఫ్టులుగా ఇస్తుంటారు. వాటన్నింటిని ఆమె ఈజీగా తీసిపారేస్తుంది. కుటుంబసభ్యులనుకూడా పెద్దగా పట్టించుకోదు. వాళ్ళు ఇక్కడ లేరు కూడా. ఊళ్ళోనే ఉంచి డబ్బులు పంపిస్తుంది. తనను ఈ రొంపిలోకి దింపింది వాళ్ళేనని తల్లి దండ్రుల మీద కోపం జలజకు.

మరి ఇంకేం అయ్యుంటుంది?

నవీన్‌కి ఫోన్ చేశాను. 'నాట్ రీచబుల్'.

జలజ రెండు ఫోన్లకూ చేశాను. రెండూ 'స్విచ్ఛాఫ్' అనే వస్తున్నాయి.

నాక్కూడా భయం మొదలైంది. రాత్రి రెండు వరకు ఫోన్లు ట్రై చేస్తూనే ఉన్నాను.

ఎప్పుడు పడుకున్నానో తెలియదు. సోఫాలోనే పడి నిద్రపోయాను.

ఫోన్ రింగవుతుంటే లేచాను. నేను ఫోన్ అందుకోబోయే సరికే ఆగిపోయింది.



అప్పటికే తెల్లగా తెల్లారిపోయింది.

వాష్‌రూంకు వెళ్ళొస్తుంటే, తలుపు కిందనుంచి విసిరేసిన పేపర్ కనిపించింది. తీసి చూసేసరికి "టాలీవుడ్ నటి 'జలజ' హత్య" అన్న హెడ్డింగ్ కన్పించింది.

"ఓ మైగాడ్!" అంటూ నేను అక్కడే కూల బడిపోయాను.

ఇంతలో మళ్ళీ ఫోన్ మోగింది.

చూశాను. డీసీపీ మేడమ్ నంబరు...

"మేడమ్! గుడ్...." నా మాటను మధ్యలోనే ఆపి,

"వెంటనే ఆఫీసు వదిలి యాదగిరిగుట్టకు వెళ్ళు. ఎక్కడా సీసీటీవీల్లో పడకుండా జాగ్రత్త తీసుకో. క్యాప్ పెట్టుకో. కారు వాడొద్దు. మీ ఆఫీసు నుండి కొంచెం దూరం నడిచి ఆటో తీసుకో. ఫోన్ ఆన్‌లో ఉంచు. బట్ డోంట్ కాల్‌మీ! హర్రీయప్! గో మాన్... గో!" అని ఫోన్ కట్ చేసింది.

నాకు కాళ్ళూ చేతులూ వణకడం మొదలైంది.

అలాగే, పర్స్ తీసుకుని, ఆఫీసుకి తాళం వేసి బయటపడ్డాను. మా అపార్ట్‌మెంట్‌కు వెనుకవైపు ఒక సర్వీస్ ఎంట్రన్స్ ఉంది. అక్కణ్ణుంచి బయట పడి, గణపతి కాంప్లెక్స్ వెనుక నుండి సందుల్లో తిరిగి తిరిగి సత్యసాయి నిగమం దగ్గర ఆటో ఎక్కి ఎంజీబీయస్ బస్టాండుకు బయల్దేరాను.

యాదగిరిగుట్టకు వెళ్ళే బస్సులో కూర్చున్నాను కానీ, ఏ క్షణంలోనైనా పోలీసులొచ్చి నన్ను పట్టు కుని, బేడీలువేసి దించేస్తారేమోనని భయం భయంగా ఉంది. గుండె దడ తగ్గడంలేదు. డీసీపీ మేడమ్ నన్నెందుకు పారిపొమ్మన్నదో అర్థం కావడం లేదు. కొంపదీసి జలజను నేను హత్య చేశానేమోనని అనుమాన పడుతోందా ఏమిటి?

బస్సు కదిలి ఉప్పల్ దాటి వరంగల్ హైవే చేరుకున్నాక కొంచెం కుదుటపడ్డాను.

చేతిలో పేపరుంది కానీ, దాన్ని ఓపెన్‌చేసి చదవాలంటే మన సొప్పడం లేదు. మనసంతా చేదు గుళిక మింగిన నోరులా అయింది.

రాత్రి జలజ వచ్చినప్పుడు నేను ఏ బట్టలు వేసుకున్నానో ఆ బట్టలతోనే ప్రయాణం చేస్తున్నాను. ఇంకా ఆ బట్టల నుండి జలజ ఒంటి పరిమళమే వస్తోంది. అట్లాంటి జలజను హత్య చేయడమేమిటి?

"పాపం జలజ!" నా కళ్ళ నుండి నీళ్ళు కారడం ఆగలేదు. గుండెలను విషాద సంద్రంలోకి ఎవరో లంగరువేసి లాగుతున్నట్టు అనిపించసాగింది. వెక్కివెక్కి ఏడ వాలని ఉంది.

అప్పటికి కానీ నా గుండెల్లో గూడు కట్టుకున్న బాధ తీరేటట్టు లేదు.

**జరిగిన కథ**

ఆస్కార్ అవార్డుల పోటీల్లో అన్యభాషా చిత్రాల జాబితాలో అతడి చిత్రం ఎంపికైన సందర్భంగా అమెరికా వెళుతున్నాడతను. విమా నంలో కూర్చుని గతం గుర్తుచేసుకున్నాడు. అతడో తెలుగు దర్శకుడు. హైద్రాబాద్‌లో ఒక నిర్మాత ఆఫీసుఎదుట పడిగాపులు పడుతున్న సమయంలో జూనియర్ ఆర్టిస్ట్‌పై నిర్మాత హత్యాయత్నం దృశ్యాలను సెల్‌ఫోన్లో క్యాచ్‌చేశాడతను. డీసీపీ పుష్పాకిరణ్ మధ్యవర్తిత్వంతో నిర్మాత లొంగి వస్తాడు. పూటకు టికాణా లేని దర్శకుడి దశ తిరుగుతుంది. హంగులన్నీ సమకూర్చుకుని దేశం గర్వించదగ్గ గొప్ప సినిమా నిర్మించేందుకు కథా న్వేషణలో పడతాడతను. **ఆ తర్వాత.....**

అసలు ఈ సమయంలో నేను దగ్గరుండి జలజ విషయాలను చూసు కోవాలి. కానీ, డీసీపీ మేడమ్ ఆజ్ఞను మీరడానికి కూడా వీలులేదు. ఆమె నా శ్రేయోభిలాషి. వెల్‌విషర్. ఏదో జరిగి ఉంటుంది. ఏం జరిగి ఉంటుంది? ఈ హత్యలో నాకు తెలియకుండానే నా ప్రమేయం ఉందా? అందుకే నన్ను అక్కణ్ణుంచి పారిపొమ్మని చెప్పిందా?

డీసీపీ మేడమ్‌కి ఫోన్‌చేసి వివరాలు అడ గాలని ఉంది. కానీ, ఫోన్ చేయకూడదని మేడమ్ ఆజ్ఞ. నా మనసు కూడా అదే హెచ్చరించసాగింది. ఆమె అన్నివేళలా నా క్షేమం కోరుతుంది. ఇప్పు డున్న టెక్నాలజీతో అన్ని కాల్స్ ట్రేస్ అవుతాయి.



మాటలు రికార్డ్ అవుతాయి. ఇది హత్యకేసు. మామూలు హత్యకేసు కాదు. సంచలనం రేప బోయే సంఘటన. నేను ఆత్రుత అణచుకోలేక చేసే ఫోన్ వల్ల నేనూ, తనూ ఇద్దరం ప్రమా దంలో పడే అవకాశం ఉంది. అది పర్సనల్ ఫోన్ అయినా సరే! ఫోన్ చేయను.

కండక్టర్ లేపుతుంటే మెలకువ వచ్చింది.

యాదగిరిగుట్టలో దిగి లాడ్జిలో రూం తీసుకున్నాను. రూంలోకి వెళ్ళగానే టీవీ ఆన్‌చేశాను.

టీవీనిండా జలజ హత్య వార్తలే. తల వేయి ముక్కలైనట్టు అనిపించింది. కళ్ళు తిరగసాగాయి. ఆ దృశ్యాలు చూసి నాకు కడుపులో దేవేసినట్లయింది.

గబగబా బాత్‌రూంలోకెళ్ళి వాంతి చేసుకు న్నాను.

జలజను, మోతీనగర్లో పార్కుకు ఎదురుగా

ఉన్న అపార్ట్‌మెంట్‌లో తన సొంత ఫ్లాటులో ముక్కలు ముక్కలుగా నరికారు. తల, మొండెం వేర్వేరుగా పడి ఉన్నాయి.

సౌందర్య అధిదేవతైన జలజ అలా నిర్జీవంగా, ఘోరాతి ఘోరంగా, ముక్కలు ముక్కలుగా నరకబడి..

చిన్నపిల్లలు, ఆటల్లో గొడవలొచ్చి, ఎలా తమ చేతుల్లో ఉన్న రబ్బరు బొమ్మలను ముక్కలు ముక్కలుగా పీకి పడేస్తారో...

అలాపడి ఉంది. కొన్ని గంటల ముందు చైతన్య స్రవంతిలా, శృంగార రసాధిదేవతలా నన్ను లాలించిన ఆమె, ఖండఖండాలుగా నరకబడి రక్తపు మడుగులో పడి ఉంది. ఆమెను కేవలం హత్య చేయలేదు. ఎవరో గుండెల్లో గూడుకట్టుకున్న కసినంతా కనపడేలా నరికి పడేశారు.

నేను భోరుమని ఏడ్చాను.

ఆమె అంటే అంత కసి ఎవరికి ఉంటుంది! ఎవరో పర్వర్టెడ్ మైండ్‌కు తప్ప... ఈ ఘోర హత్య ద్వారా ఎవరికో ఏదో మెసేజ్ పంపడానికి చేసిన ప్రయత్నం లాగా కన్పించింది.

హాలంతా రక్తపు మడులున్నాయి. వాటిల్లో నుంచే నడిచారేమో, ఇంటినిండా బూట్లు, చెప్పుల మరకలున్నాయి. టీవీవాళ్ళకు ఓ మాస్‌మసాలా న్యూస్ దొరికింది. సినిమావాళ్ళకు సంబంధించిన చిన్న విషయాన్నే గోరంతలు కొండంతలుగా చేసి చూపించే టీవీ ఛానళ్ళకు ఇక పండుగే. ఈ సంఘటనను కాచి, వడపోసి, ఈకలు, పీకలు లాగి రెండు మూడురోజులపాటు వాళ్ళు నిద్రపోకపోవడమే కాదు, ప్రేక్షకులను కూడా నిద్ర పోనివ్వరు. ఛానల్స్ మధ్య ఉన్న విపరీతమైన పోటీ కారణంగా ఇన్వెస్టిగేటివ్ జర్నలిజం పీక్ స్టేజ్‌కి వెళ్ళింది. అయితే, ఫ్యాక్ట్స్‌తోపాటు రూమర్లు, అభూత కల్పనలు జోడించి ప్రసారం చేయడంతో ప్రజలు టీవీ ఛానల్స్‌లో ప్రసారమయ్యే విషయాలను యాజ్ ఇటీజ్‌గా నమ్మడం లేదు.

ఇంతలో సీన్లోకి డీసీపీ మేడమ్ వచ్చింది. నేను ఉలిక్కిపడ్డాను. నా కళ్ళు టీవీకి అతుక్కుపోయాయి.

మేడమ్ ముఖం చాలా సీరియస్‌గా ఉంది.

**జలజ ఫోన్ ఎత్తడం లేదు. ఆమెను ఫాలోచెయ్యమని పంపిన నవీన్ కూడా జాడలేకుండా పోయాడు. ఆ ఆలోచనలతో నిద్రపోయాడతను. తెల్లారిలేచి పేపర్ చూశాడు. అందులో వార్తచూసి భయభ్రాంతుడయ్యాడు. అంతలోనే డీసీపీ మేడమ్ నుంచి ఫోన్. ఆమె ఫోన్‌లో అతడికి ఏవో ఆదేశాలు జారీచేసింది. హర్రియప్ అంది. అతడిలో వణుకుమొదలైంది. పరుగుదీశాడు. ఇంతకీ అసలేం జరిగింది?**

ఆ సీనాఫ్ అఫెన్సును చూసి ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

కెమేరాకు అటువైపు తిరిగి, కళ్ళు తుడుచుకుని గాగుల్స్ పెట్టుకుంది. జలజ బాడీ ఉన్న, బాడీకాదు, బాడీ ముక్కలున్న గదిని క్షుణ్ణంగా పరిశీలించి బయటకు రాగానే, ఛానళ్ళ వాళ్ళు ఆమె చుట్టూ మూగారు.

"నో కామెంట్స్" అని చెప్పి తప్పించుకోవాలని చూసింది. కానీ వీలు కాలేదు. వాళ్ళు ఆమెను సతాయించసాగారు. డీసీపీ మేడమ్ మాట్లాడుతూ,

"ప్లీజ్! ఇటీజ్ టూ ఎర్లీ. మాకు ఇప్పుడే సమాచారం వచ్చింది. విచారణే ఇంకా మొదలు కాలేదు. నేనేం చెప్పగలను? కానీ ఈ ఘాతుకం ఎవరు చేశారో కానీ వాళ్ళు మాత్రం మనుషులు కారు. నరరూప రాక్షసులు. మీరు కోఆపరేట్ చేస్తే తొందర్లోనే ఛేదిస్తాం. ఎందుకంటే, ఇది ఆ అమ్మాయిని హత్య చేయడం కాదు. మన సమాజానికీ, పోలీసులకూ, మానవత్వానికీ విసిరిన సవాల్. మా దగ్గరున్న అన్ని అవెన్యూస్‌ను రంగంలోకి దించుతాం. తప్పక పట్టుకుంటాం. ఇంత దారుణమైన హత్య చేసిన వాళ్ళను తలుచుకుంటే ఒక స్త్రీగా నా రక్తం మరిగిపోతోంది. బ్లడీ బా.." అని చెప్పి నమస్కారం చేసి లోపలికి నడిచింది.

నాకు ఏడుపు ఆగలేదు.

ఈ మధ్యకాలంలో నా జీవితంలోకి ప్రవేశించిన ఇద్దరు అమ్మాయిలు, ఇలా ఒకే కేసులో ఒకరు హత్య చేయబడి, మరొకరు అదే హత్యకేసును ఛేదించే పనిలో, మధ్యలో నేను ఇలా ముద్దాయిలా ఇరుక్కుపోవడం, అంతా కాకతాళీయమా, లేక ఇది మరో గొప్ప మార్పుకు దారి తీస్తుందా?

బహుశా మేడమ్‌కి చాలాముందే ఈ సంఘటన గురించి తెలిసి ఉంటుంది. కానీ, నాకు జలజకు సంబంధం ఉందని, నేను సమస్యల్లో ఇరుక్కుంటానని ఎలా ఊహించిందో, నన్ను ఎందుకు పారిపొమ్మని చెప్పిందో, నా ఆలోచనకు అందలేదు.

రాత్రి నుంచి ఏమీ తినకపోవటంతో కడుపులో ఎలుకలు పరుగెడుతున్నాయి. టిఫిన్ తిని పేపరు తెరిచాను. పేపరు చదువుతుంటే, మనసులో దుఃఖ సముద్రాలు పొంగుతున్నాయి. కారుతున్న కన్నీళ్ళు తుడుచుకుని చదవడం కొనసాగించాను.

"నిన్న రాత్రి సుమారు తొమ్మిది గంటల ప్రాంతంలో అపార్ట్‌మెంటులోకి తన కారులోనే వచ్చిందని, తనతోపాటు ఒక మగ వ్యక్తి వచ్చాడని, అతను వెళ్ళిన తర్వాత, రాత్రి పదకొండు గంటల ప్రాంతంలో మరో నలుగురు మగవాళ్ళు వచ్చారని, వాళ్ళను లోపలికి పంపడానికి అనుమతించకపోవడంతో, వాచ్‌మన్‌ను కొట్టి, నోట్లో గుడ్డలు కుక్కి, కాళ్ళు చేతులు కట్టేసి, జనరేటర్ రూములో పడేసి పైకి వెళ్ళారని, తర్వాత రెండు గంటల ప్రాంతంలో పోలీస్ బీట్ పార్టీ వచ్చి సంతకం చేయడానికి వాచ్‌మన్‌కోసం వెతికారనీ, దొరకకపోయే సరికి అలర్ట్ అయి... వాచ్‌మన్‌ను వెతికి పట్టుకుని కట్లువిప్పి ప్రశ్నించేసరికి, అతడు చెప్పిన వివరాల ప్రకారం జలజ ఫ్లాటుకు వెళ్ళి చూశారనీ, అప్పటికే జలజ హత్య చేయబడి ఉండటంతో కంట్రోల్ రూముకు, పోలీసుస్టేషన్‌కి ఫోన్ చేసి చెప్పారని" పేపర్లో రాసి ఉంది.

పేపరు చూసి నేను ఆలోచనల్లో పడ్డాను.

తొమ్మిది గంటల ప్రాంతంలో అంటే కృష్ణానగర్‌లోని మా ఆఫీసు నుంచి మోతీనగర్ వరకు ఆ రష్ అవర్‌లో అరగంట పైనే పడుతుంది. అంటే డైరెక్టుగా మా ఆఫీసు నుంచి ఇంటికి వెళ్ళిందన్నమాట. మరి ఆమెతో ఉన్న వ్యక్తి ఎవరు? నవీనా?

నా గుండె గుభిల్లుమంది.

"జలజను చంపేశారంటే, నవీన్ ఏమైనట్టు? నవీన్‌కి జలజని ఫాలో కమ్మని చెప్పి నేనే పంపించాను" నవీన్‌కు ఏం ప్రమాదం జరిగిందోనని నా మనసు శంకించసాగింది.

పేపర్ తెరిచాను.

**సినీవాలి**

**కూపన్ నెం.3 విజేత**

**ఎ.జయలక్ష్మి**

**గంపలగూడెం, కృష్ణా జిల్లా**

"పోలీసులు సుమారు తెల్లవారుజామున మూడు గంటల ప్రాంతంలో జలజ అపార్టుమెంటు డోరు తెరిచారు. అప్పటికే హాలంతా చిందరవందరగా ఉంది. దేనికోసమో వెతికినట్టుగా ఉంది. అది దొరక్క పోవడంతోనే జలజని హింసించి, నరికి చంపి ఉంటారని, ఇట్లాంటి హత్యలు చేసే కిరాతక ముఠాలు కేవలం మాఫియా బృందాల కనుసన్నలలోనే పని చేస్తాయని...." అంటూ పేపరు వాళ్ళు ఏవేవో ఊహాగానాలు రాశారు.

నా కళ్ళ ముందు పేపర్లో జలజ శరీరం ముక్కలు ముక్కలుగా ఖండించబడి కన్పిస్తున్నా నాకు నమ్మకం కలగడం లేదు.

తను నా ఒళ్ళో కూర్చుని ఎంతో ఆనందం అనుభవిస్తున్నట్టుగా పెట్టిన ఆమె ముఖమే కళ్ళ ముందు కన్పిస్తోంది. ఈ జలజ నా జలజ కాదు.

ఇంకెవరో? హే భగవాన్!

నా ఫోన్ మోగింది.

నేను ఉలిక్కి పడ్డాను.

మా ఆఫీసులో పనిచేసే బాయ్ నర్సింహ.

"సార్! ఆఫీసు తెరిచిలేదు. ఇంటికి రానా సార్, కీస్ కోసం?" అని ప్రశ్నించాడు.

"ఎందుకు? నవీన్‌సారు దగ్గర తీసుకోరాదూ?" అన్నాను.

"నవీన్‌సార్ రూముకు పోయొచ్చిన సార్. సార్ రూముకు తాళం వేసి ఉంది. ఫోన్ కూడా ఎత్తడం లేదు. అందుకే, మీ ఫ్లాటుకు రానా సార్?"

నేను వేగంగా ఆలోచించాను.

"నర్సింహా! మా అమ్మకు ఆరోగ్యం బాగోలేదని ఫోనొస్తే, రాత్రే మా ఊరికొచ్చాను. తిరిగి రావడానికి రెండు మూడు రోజులు పడుతుంది.

ఇంకెవరి దగ్గరైనా ఆఫీస్ కీస్ ఉన్నాయా?"

"మేనేజర్ దగ్గర ఉంటాయి సార్! నేను తీసుకొస్తా సార్!" అన్నాడు.

నేను 'సరే' నని ఫోన్ పెట్టేశాను.

ఓ గంట తర్వాత మేనేజర్ ఫోన్ చేశాడు.

'డైరెక్టర్‌గారూ! జలజ మేడమ్ చచ్చిపోయింది సార్! ఎవరో దారుణంగా హత్య చేశారంట సార్!

కృష్ణానగర్ అంతా అల్లకల్లోలంగా ఉంది సార్! అన్ని ఆఫీసులవాళ్ళు గణపతి కాంప్లెక్సు ముందు గుమికూడారు సార్!" అన్నాడు.

నేను అమ్మకు ఆరోగ్యం బాగాలేదనే విషయం చెప్పి, 'ఇంకా ఏమనుకుంటున్నారని' క్యాజువల్‌గా అడిగాను.

"జలజ మేడమ్ రాత్రి మన ఆఫీసుకొచ్చిందని అనుకుంటున్నారు. తర్వాతనే హత్య చేయబడింది. ఈ టైంలో మీరు ఇక్కడుంటే బాగుండేది సార్! లేనిపోని అనుమానాలొస్తున్నాయి సార్!" అన్నాడు కొంచెం నిష్ఠూరంగా.

నాలో భయం గూడు కట్టుకోసాగింది.

"అంటే! నా మీదనా?"

"మీ మీదని కాదు. చివరిసారిగా మన ఆఫీసు నుంచే బయటకు రావడం చూశామని ఇక్కడ చాలామంది అంటున్నారు. జలజ అంటే చాలా పాపులర్ కదా! అందుకనే ఆమెను ఈజీగా గుర్తుపట్టారు. జలజ వెనుకనే నవీన్ సార్ కూడా వెళ్ళారని, ఇద్దరూ జలజ మేడమ్ కారు వరకు కలిసి వెళ్ళారని అంటున్నారు సార్!"

"మరి నవీన్ లేడా అక్కడ?" అని అడిగాను నేను, అమాయకత్వం నటిస్తూ.

"అదే కదా సార్ నేననేది! చివరిసారిగా మన ఆఫీసు నుంచి బయటకొచ్చింది. ఆమె కూడా నవీన్ సార్ వెళ్ళారు. ఇప్పుడు జలజ హత్య చేయబడింది. మీరిద్దరూ కనిపించడం లేదు. మీకు తెల్సుకదా సార్, మన టాలీవుడ్ సంగతి! నిప్పులేందే పొగ రాదంటారు..." అన్నాడు, కొంచెం నిందాస్తుతి స్వరంతో.

"సరే సరే! నవీన్‌సార్ రాగానే నాకు ఫోన్ చేయమనండి" అని పెట్టేశాను.

చుట్టుపక్కల సాధారణ జనమే అలా అనుకుంటున్నారంటే, ఈపాటికే ఈ విషయం పోలీసులకు కూడా తెలిసే ఉంటుంది. "పోలీసులే గనుక ఆఫీసుకొస్తే...?"

"అమ్మో! వాళ్ళు ఆఫీసుకొస్తే కొంప మునుగుతుంది. జలజ మా ఆఫీసుకు వచ్చిన విషయం తెలుస్తుంది. అంతవరకు అయితే ఓకేగానీ, వాళ్ళు ఇంకా లోతుగా పరిశీలిస్తే నేను నిండా మునిగినట్టే. అసలే పోలీసులు ఈ మధ్య సీసీటీవి పుటేజ్ మీద ఆధారపడి ఇన్వెస్టిగేట్ చేస్తున్నారు. ఇప్పుడు వాళ్ళు మా ఆఫీసులోని సీసీటీవి పుటేజీ పరిశీలిస్తే, జలజ, నేనూ క్లోజ్‌గా ఉన్న దృశ్యాలు కనిపిస్తే... దానికి తోడు నేను ఆఫీసుకు రాకుండా మాయమయ్యానని తెలిస్తే...." నా గుండెలు పీచుపీచుమన్నాయి.

ఈ విషయం డీసీపీ మేడమ్‌కి వెంటనే చెప్పాలి. కానీ,

ఎలా? ఎలా?

•••

రూములో నుంచి బయటకొచ్చాను.

యాదగిరిగుట్టలో భక్తులు గుండు కొట్టించుకోవడం ఆచారం. అట్లాంటి వాళ్ళకోసం రకరకాల టోపీలు అమ్ముతుంటారు. నేను కూడా నా తల సైజు కన్నా పెద్ద టోపీ ఒకటి కొని పెట్టుకున్నాను. దగ్గర్లో ఉన్న ఇంటర్నెట్ కేఫ్‌కు వెళ్ళాను.

ఫేస్‌బుక్‌లో ఒక ఫేక్ అకౌంట్ ఓపెన్‌చేశాను. కన్ఫర్మేషన్ రావడానికి గంటకు పైగానే పట్టింది.

ఫేస్‌బుక్ మెసెంజర్ నుండి మేడమ్‌కి ఫోన్ చేశాను. తను ఫోన్ ఎత్తలేదు.

నాకు తెలిసినంతవరకు ట్రేస్ కాకుండా మేడమ్‌తో మాట్లాడడానికి ఇదే ఒక మార్గంగా తోచింది. మేడమ్ ఫోన్ ఎత్తడం లేదంటే ఇది కూడా సేఫ్‌కాదా? అనే అనుమానం వచ్చింది.

ఒక్క క్షణం ఆలోచించాను.

"మేడమ్! హైదరాబాదు నుండి వరంగల్‌కు వెళ్ళే దారిలో హైవేకు దగ్గరగా యాదగిరిగుట్ట సమీపంలో రోడ్ ఫేసింగ్ వెంచర్లో ప్లాటు కొనండి మేడమ్! అర్జెంట్. ప్లీజ్! మేడమ్!" అని మెసేజ్ పెట్టాను.

మెసేజ్ చూసినట్టుగా మార్క్ వచ్చింది.

అప్పుడు మళ్ళీ మెసెంజర్ నుంచే ఫోన్ చేశాను.

"నువ్వేనా?" అంది మేడమ్.

"అవును మే...!" అని అంటుండగానే కట్ చేసింది.

అంటే తనతోపాటు ఎవరో ఉండే ఉండొచ్చు లేదా తను మాట్లాడలేని పరిస్థితిలో ఉండొచ్చు.

"ఎస్‌ఎల్‌ఎన్ వెంచర్. మైల్‌స్టోన్: 4/56, ప్లాట్ నంబర్: 7/30. వెంటనే ప్లాట్లు కొనండి" అనే మెసేజ్ వచ్చింది. నేను దాన్ని పెద్దగా పట్టించుకోలేదు. ట్రేడ్ ప్రమోషన్ మెసేజ్‌లు రావడం చాలా కామన్.

తర్వాత చాలాసార్లు మెసెంజర్ ద్వారా ఫోన్ చేయడానికి ప్రయత్నించి 'నాట్ అవైలబుల్' అన్న సమాధానం రావడంతో విసుగొచ్చి 'ఇక లాభం

---

**ఈవారం సినీవాలి చదివారు కదా!**
**మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి**
**కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!**

## సినీవాలి -5 (16-11-2016)

మా ప్రశ్న: డీసీపీ మేడమ్ ఫోన్లో డైరెక్టర్‌ని ఆఫీసు వదిలి, ఎక్కడకు వెళ్ళమని చెప్పింది?

మీ జవాబు------------------------------------------------------------

చిరునామా------------------------------------------------------------

--------------------------------------------------------------------

----------------------------------పిన్-------------------ఫోన్‌నెం.-------------------

**ఈ కూపన్‌ను 15 నవంబర్ 2016 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.**

మా చిరునామా:నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33

వివాహాది శుభకార్యాలకు కంచిపట్టు చీరల నిలయం పి.యన్.మూర్తి క్లాత్‌స్టోర్స్ మెయిన్ రోడ్, హన్మకొండ వారి సౌజన్యంతో...

లేదనుకొని' బయటకు రాబోతూ, ఇందాకటి మెసేజ్ మరోసారి చూశాను.

అందులో ఏదో ఉందనిపించింది.

అది మామూలు ట్రేడ్ ప్రమోషన్ యాడ్ అనిపించలేదు. అకౌంట్ ఓపెన్‌చేసిన వెంటనే యాడ్ రావడమన్న విషయం లాజిక్కుకు అందడం లేదు. అదికూడా నేను ప్లాట్ కొనమని పెట్టిన వెంటనే దానికి సంబంధించినదే యాడ్ రావడం, మామూలు కోయిన్సిడెన్స్ కాదనిపించింది.

వెంటనే, దాన్ని మళ్ళీ చదివాను. కొంచెం ఎనాలైజ్ చేసి చూశాను. దాన్ని ఓ పేపరు మీద రాసుకున్నాను.

కంప్యూటర్లో నుండి లాగ్ ఔట్ అయ్యేముందు, కన్వర్సేషన్ మొత్తం డిలీట్ చేసి, ఆ మెసేజ్ అర్థం ఏమిటా అని ఆలోచిస్తూ బయటపడ్డాను.

బయటకు రాగానే మెయిన్‌రోడ్డు మీద ఒక పెద్ద బ్యానర్ కనపడింది.

'శ్రీ లక్ష్మీనర్సింహ స్వామి పవిత్ర పాదాల సాక్షిగా, ఆధ్యాత్మిక ఆనందం పొందండి. టెంపుల్ సిటీకి దగ్గరలో ప్రశాంతంగా జీవించండి. మా ఎస్ఎల్ఎన్ వెంచర్‌లో నేడే మీ ప్లాటును బుక్ చేసుకోండి. ఇట్లు ఎస్ఎల్ఎన్ వెంచర్స్' అని రాసి ఉంది.

అప్పుడే నా బుర్రలో లైటు వెలిగింది.

"రోడ్డుమీదున్న ఎస్ఎల్ఎన్ వెంచర్ దగ్గర 4/56 మైల్‌స్టోన్ దగ్గరకు రమ్మంటుందా?" అన్న ఆలోచన మెదిలింది. మరి ప్లాట్ నెంబరు 7/30కి వెళ్ళాలా? అని అనుకుని రూం ఖాళీ చేసి ఆటోలో ఎస్ఎల్ఎన్‌కు చేరుకున్నాను.

మైలు రాయి 4/56 కన్పించింది. కానీ, అసలు అక్కడ ప్లాట్ నెంబరు 7/30 లేనే లేదు. అక్కడున్న వాళ్ళను అడిగినా తమ దగ్గర అన్నిప్లాటులూ ఎ,బి,సి,డి అనే సిరీస్‌లో ఉంటాయని, వాళ్ళ బ్రోచర్ చూపించారు. వాళ్ళు చెప్పింది నిజమే. మరి ప్లాట్ నెంబరు 7/30 అంటే ఏమిటి?

నేను ఆలోచిస్తూ నిలబడిపోయాను.

ఇంతలో, అక్కడి వాచ్‌మన్ 'టైమెంతైంది సార్?' అని అడిగాడు.

నాకు చటుక్కున ఒక ఐడియా వచ్చింది.

అంటే బహుశా రాత్రి 7.30 గంటలకు ఎస్ఎల్ఎన్ వెంచర్ దగ్గరున్న మైలురాయి 4/56 దగ్గర వెయిట్ చేయమన్నదేమోనని ఊహించా.

మేడమ్ నన్ను సేవ్ చేయబోతుందనే నమ్మకం కలిగింది. కొంచెం ధైర్యం వచ్చింది. నా ప్రియమైన జలజ హత్యకేసులో నేనే ముద్దాయిగా నిలబడాల్సి వస్తుందేమోనని భయపడ్డాను. ఇక ఇప్పుడు అంతా మేడమే చూసుకుంటుందన్న భరోసా కలిగింది.

7.30కి ఇంకా మూడు గంటల సమయముంది.

గుడికి వెళ్ళి లక్ష్మీనర్సింహ స్వామిని దర్శించుకున్నాను. 'నన్ను ఈ గండం నుంచి బయటపడేయమని' వేడుకున్నాను.

మనసు ప్రశాంతంగా, నిశ్చింతగా మారిపోయింది.

ఏడింటికల్లా అనుకున్నచోటుకు చేరుకున్నాను. మేడమ్ వచ్చి నన్ను పికప్ చేసుకుంటుందనే గట్టి నమ్మకంతో నిలబడ్డాను.

ఎన్నో కార్లు వస్తున్నాయి. పోతున్నాయి. టైం ఏడున్నర దాటింది. కానీ, ఏ కారు ఆగడం లేదు. నాలో మళ్ళీ కంగారు మొదలైంది.

ఇంతలో నా ముందు ఒక బైక్ ఆగింది. డ్రైవర్ ముఖానికి హెల్మెట్ ఉంది. బైక్‌కు నెంబర్ ప్లేటు కూడా లేదు.

"ప్లాట్ నంబరు 7/30 ఇదేనా?" అని ఆ వ్యక్తి అడిగాడు.

"ఆc" అన్నాను నేను, అనుమానంగా.

నేను కారు, కారులో మేడమ్‌ని ఎక్స్‌పెక్ట్ చేస్తున్నాను.

"ఎస్ఎల్ఎన్ వెంచర్ 4/56 మైల్‌స్టోన్, 7/30 ప్లాట్ ఇదేనా?" అని కర్కశంగా అడిగాడు.

"అవునవును. అవును" అన్నాను నేను కంగారుగా. నేను టూమచ్‌గా మేడమ్ వస్తుందని ఊహించడం ఎంత పొరపాటో అప్పుడు అర్థమైంది.

అతను నా చేతిలో ఫోన్ పెట్టాడు. నేను కొంచెం దూరంగా జరిగాను.

మేడమ్ లైన్లో ఉంది.

"మేడమ్!" అన్నాను.

"ఏం మాట్లాడకు. నేను చెప్పేది మాత్రం విను. ఇప్పుడు అక్కడికొచ్చిన ఎస్సై నాకు కావాల్సిన వాడు. అయినా సరే అతనికి ఏం చెప్పకు. అతను ఎక్కడికి తీసుకెళితే అక్కడికి వెళ్ళు. అవునూ, నువ్వెందుకు నాతో మాట్లాడాలని ట్రై చేస్తున్నావ్?"

నేను, జలజ మా ఆఫీసుకు రావడం గురించి చెప్పి, సీసీటీవీ ఫుటేజ్ గురించి చెప్పాను.

"ఆహాc! ఆ విషయం నాకు రాత్రే తెలిసింది. కానీ సీసీటీవీ ఫుటేజ్ తీసుకోనట్టుంది మావాళ్ళు. తెప్పిస్తా!"

జలజతో నా క్లోజ్ మూమెంట్స్ గురించి చెప్పాలా అని ఆలోచించి, ఇప్పుడే వద్దని ఊరుకున్నాను.

"సరే, నువ్వతనితో రా! ఎక్కడికి తీసుకురావాలో అతనికి తెలుసు. ఏం మాట్లాడకు. నువ్వొక పోలీస్ ఇన్ఫార్మర్‌వని చెప్పాను. నువ్వూ అదే మెయింటైన్ చెయ్యి. ఏదడిగినా మేడమ్‌కే చెప్తానని చెప్పు! బీ కేర్‌ఫుల్. నోరు జారద్దు. ఫోన్ అతనికి ఇచ్చేముందు వాయిస్ రికార్డ్ అయిందేమో చూడు. ఒకవేళ రికార్డైతే డిలీట్ చెయ్యి. ఎవ్వరినీ ఎప్పుడూ నమ్మకూడదు. ఓకే, బై!" అంటూ కట్ చేసింది.

నేను ఫోన్ సెట్టింగ్స్‌లోకి వెళ్ళిచూశాను.

మేడమ్ అనుమానం కరెక్టే. మేం మాట్లాడుకున్నదంతా రికార్డయింది. మేడమ్ తనకు నమ్మకమైన వ్యక్తి అని చెప్పినవాడే మేడమ్‌ని మోసం చేస్తున్నాడంటే, పోలీసులు ఎంత దారుణానికైనా ఎలా ఒడిగడతారో, అలాగే వాళ్ళు ఎంత షార్ప్‌గా ఆలోచిస్తారో నాకు అర్థమయింది.

మా సంభాషణ అంతా డిలీట్ చేశాను. ఆ ఎస్ఐ వారించబోయాడు.

కానీ, దొంగతనం బయటపడుతుందేమోనని ఆగిపోయాడు.

నేను మోటార్ సైకిల్ ఎక్కాను.

అతని ముఖం కూడా నేను చూడలేదు.

గంటన్నర తర్వాత బంజారాహిల్స్, రోడ్ నంబర్ 12లోని ఐఏఎస్, ఐపీయస్ అధికారులు నివసించే క్వార్టర్లలో ఒక బంగళా ముందు దించి "సెకండ్ ఫ్లోర్ 'సి' బ్లాక్ అని చెప్పి మాయమైపోయాడు.

నేను భయం భయంగా మెట్లెక్కసాగాను.

ఇంతలో ఫోన్ మోగింది.

చూసేసరికి పదహారు మిస్డ్ కాల్స్ ఉన్నాయి. బైక్ మీద వస్తున్నప్పుడు వినపడలేదు.

"ఏం సార్? గంటసేపటి నుంచి ఫోన్ చేస్తున్నాను. ఫోన్ ఎత్తరేంటి? మన ఆఫీసుకు పోలీసులొచ్చి మమ్మల్ని చిత్రహింస పెట్టారు సార్! సీసీటీవీ ఫుటేజ్ కావాలని, మీరొచ్చాక ఇస్తామని అన్నా వినకుండా మొత్తం పట్టుకుపోయారు సార్! మీరు వెంటనే రండి సార్! లేకపోతే... మేం కూడా ఆఫీసుకు తాళం వేసి కనపడకుండా పోతాంసార్!" అని కోపంగా అరిచాడు.

నేను నవ్వుకున్నాను.

మేడమ్ చాలా ఫాస్టుగా రియాక్ట్ అయిందన్నమాట.

రెండో ఫ్లోర్‌లోని 'సి' బ్లాక్ ముందు నిలబడ్డాను.

**(ఇంకావుంది)**



# వంటలు



## కాజు బర్ఫీ

**కావలసిన పదార్థాలు:** కాజు(జీడిపప్పు): వంద(గ్రాములు, చక్కెర: ఆరు లేదా ఏడు టేబుల్ స్పూన్లు, యాలకుల పొడి: చిటికెడు, కుంకుమ పువ్వు: చిటికెడు, నీళ్ళు: కొద్దిగా.

**తయారీ విధానం:** ముందుగా జీడిపప్పును మెత్తగా పొడి చేసి పెట్టుకోవాలి. ఇప్పుడు మందపాటి గిన్నె తీసుకుని చక్కెర మునిగేంత వరకూ నీరు పోసి తీగపాకం కన్నా కొద్దిగా ఎక్కువ పాకం వచ్చే వరకూ వేడి చేయాలి. ఇందులో కుంకుమ పువ్వు కూడా వేసేయాలి. పాకం తయారవుతుండగా యాలకుల పొడి, జీడిపప్పు పొడి వేసి సన్నని మంటమీద గట్టిపడేంత వరకూ కలియబెడుతూ ఉండాలి. జీడిపప్పు మిశ్రమం గట్టిపడగానే దింపేసుకోవాలి. మందపాటి ప్లేటు తీసుకుని దానికి నెయ్యి రాసి ఈ మిశ్రమాన్ని దానిలో పరిచినట్టుపోసుకుని కావలసిన సైజులో ముక్కలు చేసుకోవాలి.



## బాదం హల్వ

**కావలసిన పదార్థాలు:** బాదం పప్పు: అర కప్పు, చక్కెర: ముప్పావు కప్పు, పాలు: అరకప్పు, నెయ్యి: పావుకప్పు, కుంకుమ పువ్వు: టేబుల్ స్పూను(కొద్దిగా పాలల్లో నానపెట్టుకోవాలి)

**తయారీ విధానం:** బాదంపప్పును ముందు రోజు నానపెట్టుకోవాలి అలా కుదరకపోతే మరుగుతున్న నీటిలో బాదంపప్పు వేసి అరగంట పాటు నానపెడితే పై తొక్క ఈజీగా వచ్చేస్తుంది. తొక్క తీసిన బాదం పప్పుకి కొద్దిపాటి పాలు జత చేసి మెత్తగా రుబ్బుకోవాలి. పావు కప్పు నీరు మరిగించి అందులో చక్కెర వేసుకోవాలి. చక్కెరను పొయ్యి మీద పెట్టకుండా కరిగేంత వరకూ ఆగి అనంతరం ఆ పాకంలో బాదం ముద్ద కుంకుమపువ్వును పాలతో సహా వేసి బాగా కలిపి పొయ్యి మీద పెట్టి సన్నని మంట మీద కలుపుతూ ఉండాలి. ఈ మిశ్రమం గట్టిపడేటప్పుడు నెయ్యి వేసుకోవాలి. నెయ్యి పైకి తేలేంత వరకూ పొయ్యి మీద ఉంచి దింపేసుకోవాలి.



## రవ్వ ఖీర్

**కావలసిన పదార్థాలు:** బొంబాయి రవ్వ: పావుకప్పు, చక్కెర: అరకప్పు, వెన్నతీయని పాలు: లీటరు, యాలకులపొడి: చిటికెడు, జీడిపప్పు, బాదంపప్పు: సరిపడ, కుంకుమ పువ్వు: కొద్దిగా, నెయ్యి: ఒకటి లేదా రెండు స్పూన్లు

**తయారీ విధానం:** మందపాటి గిన్నెలో నెయ్యి వేసి బొంబాయిరవ్వ దోరగా వేయించుకోవాలి. మిగిలిన నేతిలో జీడిపప్పు, వేయించి తీసుకొని అదే గిన్నెలో రవ్వ, పాలు కలిపి బాగా ఉడికించాలి. రవ్వ ఉడుకుతున్న సమయంలో చక్కెర , కుంకుమ పువ్వు కూడా జత చేసుకోవాలి. రవ్వ ఉడికిన తరువాత డ్రైఫ్రూట్స్ జత చేసుకోవాలి. అవసరం అనుకుంటే ఖీర్ చల్లారిన తరువాత కొన్ని చల్లని పాలు కలుపుకుంటే సరిపోతుంది.

## కొబ్బరి లడ్డు

**కావలసిన పదార్థాలు:** రెండు చిప్పల కొబ్బరి తురుము, పాలు: లీటరు(నీరు కలపని పాలు), చక్కెర: మూడు వందల గ్రాములు, బొంబాయి రవ్వ: అరకప్పు, యాలకుల పొడి: చిటికెడు, చెర్రీ పండ్లు: కొన్ని



**తయారీ విధానం:** మందపాటి గిన్నెలో కొబ్బరి తురుము, పాలు, చక్కెర వేసి బాగా మరగనివ్వాలి. ఈ మిశ్రమం గట్టిపడుతున్న సమయంలో బొంబాయిరవ్వ, యాలకుల పొడి వేసుకోవాలి. కొద్ది నిమిషాలు పొయ్యి మీద ఉంచి దించేసుకోవాలి. ఈ మిశ్రమం చల్లారిన తరువాత లడ్డూల్లాగా కట్టుకోవాలి. అన్నీ తయారు చేసుకున్న తరువాత వాటి పైన చెర్రీ పండ్లతో అలంకరించుకోవాలి.

## సగ్గుబియ్యం లడ్డు

**కావలసిన పదార్థాలు:** సగ్గుబియ్యం: కప్పు, పచ్చికొబ్బరి: అరకప్పు, చక్కెరపొడి: ముప్పావు కప్పు, నెయ్యి: నాలుగు లేక ఐదు స్పూన్లు. జీడిపప్పు: కావల్సినంత, యాలకుల పొడి: చిటికెడు

**తయారీ విధానం:**



సగ్గుబియ్యాన్ని బాండీలో సన్నని మంట మీద గోధుమరంగు వచ్చేవరకూ వేయించుకోవాలి. అలాగే కొబ్బరి పొడిని కూడా కొద్దిగా వేయించుకోవాలి. నెయ్యి వేడిచేసి అందులో జీడిపప్పు వేసి వేయించి ఉంచుకోవాలి. ఇప్పుడు సగ్గుబియ్యాన్ని పొడిగా చేసుకొని అందులో పచ్చికొబ్బరి, చక్కెర, జీడిపప్పు, యాలకుల పొడి వేసి దానికి కొద్దిగానెయ్యి కలిపి లడ్డూల్లాగా చేసుకోవాలి. పొడిపొడిగా ఉండి లడ్డూలు చేసేందుకు వీలు కాకపోతే అందులో కొన్ని పాల చుక్కలు కలుపుకోవచ్చు.




# హత్యా? ఆత్మహత్యా?

**'ప్రఖ్యాత నటి ప్రమద ఆత్మహత్య' పేపరులో వార్త పైకి చదివాడు అసిస్టెంట్ రాము.**

**రామువైపు చూసి నవ్వాడు డిటెక్టివ్ శరత్. 'దానికింద ఆమె తల్లిదండ్రులు, అది ఆత్మహత్య కాదు అది హత్య. దానికి ఆమె బాయ్‌ఫ్రెండ్ కారణం' అని ఆరోపించలేదా?' అడిగాడు.**

'యెస్‌బాస్... బాయ్‌ఫ్రెండ్ భూషణ్ దోషి అని తల్లిదండ్రులు కేసు పెట్టారు. పోలీసులు భూషణ్‌ని అరెస్టు చేశారు'.

రాము మాటలు పూర్తయ్యేలోగా ఓ నడి వయసు వ్యక్తి గదిలోకి వచ్చాడు.

'నా తమ్ముణ్ణి మీరే రక్షించాలి' దాదాపు బ్రతిమిలాడుతూ ఏడుస్తున్నట్టు అడిగాడు.

'ఎవరు మీ తమ్ముడు? ఏమైంది?' అడిగాడు శరత్.

'నాపేరు గోకుల్. నా తమ్ముడు భూషణ్. నటి ప్రమదను ప్రేమించాడు. వాళ్ళిద్దరూ పెళ్ళికూడా చేసుకోవాలనుకున్నారు. ఇంతలో ఆమె ఆత్మహత్య చేసుకుంది. నా తమ్ముడే కారణమని అరెస్ట్ చేశారు. వాడు నిర్దోషి. వాడి నిర్దోషిత్వం మీరు నిరూపించాలి'.

'దానికి ఆధారాలు ఏమైనా ఉన్నాయా? ఆత్మహత్య జరిగిన సమయంలో భూషణ్ ఎక్కడ ఉన్నాడు?' అడిగాడు శరత్.

తల వంచుకున్నాడు గోకుల్. 'ప్రమదను చివరిసారి సజీవంగా చూసింది నా తమ్ముడే' మెల్లిగా చెప్పాడు.

'పోలీసులతోనూ, భూషణ్‌తోనూ మాట్లాడిన తరువాతే ఏమైనా చెప్తా' ఆలోచిస్తూ అన్నాడు శరత్.

●●●

'ముందు ఆత్మహత్య అనుకున్నాంగానీ పరిశోధన ఆరంభిస్తే అనుమానం భూషణ్‌పైనే స్థిరపడింది. భూషణ్, ప్రమద ప్రేమించుకున్నారు. పెళ్ళి చేసుకోవాలనుకున్నారు. కానీ ప్రమదను పెళ్ళి చేసుకోలేనని చెప్పాడు భూషణ్. అలా చెప్పిన వారంనుంచి ప్రమద మూడీగా ఉంది. డిప్రెషన్‌కు గురైంది. వారంరోజుల్లో వందలసార్లు భూషణ్‌కి ఫోనుచేసింది. మెసేజ్‌లు పంపింది. రెస్పాన్స్ ఇవ్వలేదు. చివరికి స్వయంగా అతడి ఇంటికి వెళ్ళింది. ఇద్దరిమధ్య గొడవ జరిగింది. ఆత్మహత్య చేసుకుంటానని ప్రమద బెదిరించింది. నువ్వు చావకపోతే నేను చంపుతానని భూషణ్ బెదిరించాడు. ఆమెని బలవంతాన కారులో తీసుకువచ్చి ఇంట్లో దింపాడు' ఫైలు చదువుతున్న ఇన్‌స్పెక్టర్ విజయ్ ఆగాడు.

'ఇక్కడే ఓ మెలికపడింది. ఇంటికివచ్చాక దాదాపు రెండుగంటలు పైగా ప్రమదతోనే గడిపాడు భూషణ్. తర్వాత వెళ్ళిపోయాడు. పొద్దున్న పనిమనిషి వచ్చింది. తలుపులు తెరచి ఉన్నాయి. బాత్‌రూమ్‌లో షవర్ నుంచి వేలాడుతూ కనిపించింది ప్రమద. పోస్ట్‌మార్టమ్ రిపోర్టు ఇంకా రాలేదు. ప్రాథమిక అంచనా ప్రకారం రాత్రి 8.30-9.30 మధ్య ఆమె మరణించి ఉండవచ్చు. భూషణ్ రాత్రి 9 గంటలకు ఆమె ఇల్లు వదిలి వెళ్ళాడు. దాంతో ప్రాథమిక అనుమానితుడు భూషణే. పైగా, భూషణ్ వెళ్ళగానే ఆమె తలుపులు వేసుకునేది. కానీ తలుపులు వేసుకోలేదుకాబట్టి భూషణ్‌పైనే అనుమానం బలపడుతోంది. ఇంట్లో అతడి వేలిముద్రలు కూడా దొరికాయి' చెప్పాడు విజయ్.

తల ఊపాడు శరత్. 'వీటి ఆధారంగా భూషణ్ నేరస్థుడని నిర్ణయించారా?'

'ఇంకా లేదు. ప్రశ్నించేందుకే అరెస్టు చేశాం. రిమాండ్‌లో ఉన్నాడు. ఈలోగా నేరం నిరూపణ అవుతుందనుకుంటున్నాం' చెప్పాడు విజయ్.

●●●

'నేను నేరం చేయలేదు. నేను నేరస్థుణ్ణి కాను. ప్రమదను వివాహం చేసుకోనని చెప్పాను. ఎందుకు చేసుకోనన్నానో కూడా చెప్పాను. నేను ఆమె ఇంట్లోంచి వెళ్ళిపోయినప్పుడు ఆమె సజీవంగానే ఉంది' చెప్పాడు భూషణ్.

**ప్రఖ్యాత నటి ప్రమద ఆత్మహత్య చేసుకుంది. ఆమె ప్రియుడు భూషణ్. చివరిసారి అతడే ఆమెను కలిశాడు. చనిపోయే ముందు కూడా ఆమెతో ఏకాంతంగా గడిపాడు. అది ఆత్మహత్య కాదు, హత్య అంటున్నారు ఆమె తల్లిదండ్రులు. పోలీసులు భూషణ్‌ను అరెస్టుచేసి రిమాండ్‌కు తరలించారు. డిటెక్టివ్ శరత్ ఈ కేసు టేకప్ చేశాడు. ఇంతకూ అది హత్యా? ఆత్మహత్యా? హత్య అయితే ఎవరు చేశారు?**

'మరి తలుపులు ఎందుకు వేసుకోలేదు?' అడిగాడు శరత్.

'నావెంటే వచ్చింది. చివరిసారి బ్రతిమిలాడింది. నేను గడప దాటగానే భళ్ళున పెద్ద శబ్దంతో తలుపులు వేసింది'.

అతణ్ణి పరిశీలనగా చూశాడు శరత్.

'ఎందుకని పెళ్ళి చేసుకోనన్నావు?'

'.................'

'నిజం చెప్పకపోతే తరువాత అనుభవించాల్సి వస్తుంది'

అయినా భూషణ్ మాట్లాడలేదు.

●●●

'బాస్, ప్రమద బ్యాంకు బాలెన్స్ బాగానే ఉంది. ఆమెకు అసైన్‌మెంట్లు కూడా బాగానే ఉన్నాయి. తల్లిదండ్రులు ఆమెకు పూర్తి స్వేచ్ఛనిచ్చారు. కాబట్టి ఆ కోణంలో ఆత్మహత్యకు కారణంలేదు. ఒక్క భూషణ్‌తో గొడవతప్ప మరో కారణం కనబడ్డంలేదు బాస్' సేకరించిన సమాచారం శరత్‌కి అందించాడు రాము.

'భూషణ్ విద్యావంతుడు. ప్రమద నటించే టీవీ సీరియల్‌ని స్పాన్సర్‌చేసే వ్యాపారి కొడుకు. ప్రమదను వివాహమాడటం భూషణ్ ఇంట్లో వాళ్ళకూ అభ్యంతరం లేదు' గబగబా చెప్పాడు రాము.

కుర్చీలో వెనక్కివాలాడు శరత్. 'అయితే ఆమె ఆత్మహత్యకు దారి తీసిందేమిటి? ఆమెను పెళ్ళిచేసుకోకూడదని భూషణ్ ఎందుకు నిర్ణయం తీసుకున్నాడు' ఆలోచిస్తూ అన్నాడు శరత్.

'నాకైతే ఆత్మహత్య అనిపిస్తోంది' అన్నాడు రాము.

లేచాడు శరత్. 'ఓసారి ఆత్మహత్య జరిగిన స్థలం చూద్దాం. శవాన్ని కూడా చూద్దాం' అన్నాడు శరత్.

●●●

బాత్‌రూమ్‌ను అలాగే టేప్‌చేసి ఉంచారు పోలీసులు. బాత్‌రూమ్ షవర్‌ని పరిశీలనగా చూశాడు శరత్. ఒక మనిషి బరువును భరించ గలిగినంత గట్టిది ఆ షవర్. షవర్ కర్టెన్‌కు ఉన్న నైలాన్‌తాడు ఇంకా వేలాడుతోంది. ఆ తాడు చాలా గట్టిది. దాన్ని తెంపాలంటే ఎంతో బలం అవసరం.

బాత్‌రూమ్‌ను పరిశీలనగా చూస్తున్న శరత్ కళ్ళు చిన్నవయ్యాయి.

పక్కనే ఉన్న బాత్‌టబ్‌పై షూ గుర్తుంది, అస్పష్టంగా.... జాగ్రత్తగా చూడకపోతే శరత్ కూడా దాన్ని గమనించలేక పోయేవాడు.

దాన్ని ఫొటో తీసి జాగ్రత్తగా కాపీ చేసుకుని ఆలోచిస్తూ బైటకు నడిచాడు.

●●●

'బలవంతపు మరణం.. అంటే.. మెడచుట్టూ నైలాన్ వైరు బిగుసుకోవటంవల్ల మరణం సంభవించింది. శరీరంపై గాయాలు లేవు. సో..' అన్నాడు పోస్ట్‌మార్టమ్ డాక్టర్ ఫణి.

'అమ్మాయిపై లైంగిక అత్యాచారం లాంటిది.' ఆగాడు శరత్.

తల ఉపాడు ఫణి.

'అత్యాచారం జరగలేదు. స్వచ్ఛందంగానే లైంగిక చర్యలో పాల్గొన్నట్టుంది' చెప్పాడు ఫణి.

ఆలోచిస్తూ బైటకు నడిచాడు శరత్.

●●●

'ఇదే భూషణ్ గది' చూపించాడు శరత్.

గదిని జాగ్రత్తగా పరిశీలించాడు శరత్. కత్తి ఉమేశ్‌కుమార్ వెళ్ళి కంప్యూటర్ 'ఆన్' చేశాడు.

గదిలో పుస్తకాలు చూసి ఆగాడు శరత్. అన్నీ పోర్న్ పుస్తకాలు. విదేశాలలో మగవాళ్ళకోసం ప్రత్యేకంగా ముద్రించే పుస్తకాలు. పెద్ద కలెక్షన్ ఉంది. పక్కనే సీడీలు! పైన సినిమాల సీడీలు, పాటల సీడీలు, అడుగున పోర్న్ సీడీలున్నాయి.

'అతడి తండ్రి ఫైనాన్సర్. సో.. పోర్న్ సీడీలు దొరకటం కష్టంకాదు' కంప్యూటర్‌లో 'హిస్టరీ' పరిశీలిస్తున్న ఉమేశ్ అన్నాడు.

కాసేపటికి ఉమేశ్ విజిల్ వేశాడు. 'బాస్... నెట్‌లో కూడా ఇతడు ఇన్‌కాగ్నిటో మోడ్‌లో బోలెడంత పోర్న్ చూస్తాడు. ఇది మామూలు హిస్టరీలో కనబడదు' చెప్పాడు ఉమేశ్.

'పోర్న్ చూడటం నేర నిరూపణ కాదు' అన్నాడు శరత్ సీడీలు తీసుకుని బైటకు నడుస్తూ.

●●●

ఒకటొకటిగా సీడీలు చూస్తూ పక్కనపెట్టేస్తున్నాడు శరత్. ఒక సీడీ చూడగానే శరత్‌కళ్ళు పెద్దవయ్యాయి.

వెంటనే సీడీ తీసేశాడు. గబగబా బైటకు వచ్చి ప్రమద ఇంటికి చేరుకున్నాడు.

ప్రమద ఇల్లు అణువణువూ పరిశీలించటం ప్రారంభించాడు. ఇంతలో శరత్‌కు ఫుట్‌ప్రింట్ ఎక్స్‌పర్ట్ ఫిలిప్స్‌నుంచి ఫోను వచ్చింది.

ఫోనులో అతడు చెప్పింది విన్న శరత్ ముఖంపై ఆలోచన స్పష్టంగా కనిపించింది.

ఇల్లు వెతుకుతూ చివరికి ప్రమద కంప్యూటర్ 'ఆన్' చేశాడు. ఆమె దగ్గరున్న సీడీలు ఒకటొకటిగా చూడటం ఆరంభించాడు. అన్నీ మామూలువే. ఆమె కంప్యూటర్‌లో 'విండోస్ 10' ఉంది. వెంటనే 'క్విక్ ఏక్సెస్' అన్న దానిపై నొక్కాడు.

'క్విక్ ఏక్సెస్'లో సాధారణంగా కంప్యూటర్ 'ప్లే' చేసిన ఫైల్స్ ఉంటాయి.

అన్నిటినీ చూస్తున్న శరత్, పేరులేని సీడీని చూసి దానిపై నొక్కాడు.

'ఫైల్ నాట్ ఎవైలబుల్' అని వచ్చింది.

దాన్నిచూస్తూ ఆలోచిస్తూ కూచున్నాడు శరత్.

●●●

తల వంచుకున్నాడు భూషణ్.

'నిజం చెప్పకపోతే నేరం నీ పైకే వస్తుంది' మృదువుగా అన్నాడు శరత్.

అప్పటికే మీడియా భూషణ్ నేరస్థుడని నిర్ధారించేసింది. అతడు ఏ రకంగా హత్యచేశాడో ఊహించి అదే నిజమన్నట్టు చూపిస్తోంది.

'నేను నియంత్రణ కోల్పోయాను. ఎంత వద్దనుకున్నా చివరిసారి... అనుకుంటూ ఆమెని కలిశాను. కానీ నామీద నాకే అసహ్యం వేసింది. ఆమె ఎంత ఉండమని బ్రతిమిలాడినా విదిలించుకుని వెళ్ళిపోయాను. ఆ తరువాత ఏం జరిగిందో నాకు తెలియదు' తలవంచుకుని చెప్పాడు భూషణ్.



'మరి నీ రీబాక్ షూ గుర్తు బాత్‌రూమ్‌లోని టబ్‌పైకి ఎలా వచ్చింది?'

'షవర్ బిగించమని అడిగింది. బాత్‌టబ్‌పైకి ఎక్కి షవర్ బిగించాను. గట్టిగా ఉందో లేదో కూడా టెస్ట్ చేశాను.'

'ఇంతకీ ప్రమదను పెళ్ళి చేసుకోకూడదని ఎందుకనుకున్నావు? నువ్వు చెప్పకున్నా నాకు కారణం తెలుసు' అన్నాడు శరత్.

ఆశ్చర్యంగా అతడివైపు చూశాడు భూషణ్.

●●●

'ప్రమద ఆత్మహత్య చేసుకుంది. భూషణ్‌లేని జీవితం వ్యర్థమనుకుంది. దీనికితోడు భూషణ్ నిరాకరించటానికి చెప్పిన కారణం ఆమెని అమితంగా బాధించింది'.

'ఏమిటది?' అడిగారు ప్రమద తల్లిదండ్రులు.

కారణం ఎవ్వరికీ చెప్పేందుకు భూషణ్ ఇష్టపడటం లేదు. ఇది బైటకు తెలియకూడదు కూడా. ప్రమద ఆడిషన్ టెస్ట్ వీడియో అది. తండ్రి దగ్గర నటించేందుకు వచ్చినవారి ఆడిషన్ టెస్ట్ వీడియోలు భూషణ్ దగ్గరే ఉన్నాయి. వాటిల్లో ఇలా వేషాలకోసం వచ్చినవారిని కిందివారు మోసంచేసి అనుభవించిన వీడియోలున్నాయి. దాన్లో ఒకటి ప్రమదది. అదిచూసి అతడు ఆమెతో పెళ్ళి రద్దు చేసుకోవాలనుకున్నాడు. ఆ రోజు ఆమెతో గడిపిన తరువాత కారణం చెప్పి వీడియో చూపించాడు. దాంతో ఆమె ఆశ అడుగంటింది. అయితే, ఇంటికి వచ్చిన తరువాత భూషణ్ ఆ వీడియోను నాశనం చేశాడు. ఇది ఎవరికంటాపడటం అతడికి ఇష్టంలేదు. అయితే ఆమె కంప్యూటర్‌లో ప్లే చేసినప్పుడు దాని వివరాలు 'క్విక్‌ఏక్సెస్'లో చేరాయి. భూషణ్ ఇంట్లో దొరికిన ఆడిషన్ వీడియోలు చూడగానే కారణం ఊహించాను. 'క్విక్ ఏక్సెస్'లో లేని వీడియో నా అనుమానాన్ని నిర్ధారించింది. భూషణ్ అది నిజమని ఒప్పుకున్నాడు. కాబట్టి ప్రమదది ఆత్మహత్య. తన ప్రమేయం లేకుండా అనాలోచితంగా భూషణ్ ఆమె ఆత్మహత్యకు పరోక్షంగా ప్రేరణ ఇచ్చాడు. కానీ అతణ్ణి నేరస్థుడిగా పరిగణించటం కష్టం' చెప్పాడు శరత్.

**-కస్తూరి మురళీకృష్ణ,**

**సెల్: 98496 17392**



# సహనంతో విజయం

**అనుకున్నది జరగకపోతే మనిషి సహనం కోల్పోతాడు.**

**ఆ అక్కసు ఇతరులపై చూపిస్తాడు.**

**"సహనం ఎప్పుడూ చేదైనదే. కానీ దాని ఫలితం మాత్రం తియ్యన"**

రైలు అరగంట ఆలస్యంగా వస్తుందన్న ప్రకటన వినగానే మనలో అసహనం రేగుతుంది.

ట్రాఫిక్‌లో ముందున్న వాహనం స్లో అయితే అసహనం
వాచ్‌మన్ గేటు తియ్యడం ఆలస్యమైతే అసహనం
వంటింట్లోంచి కాఫీ, మంచినీళ్ళగ్లాసు రావడం ఆలస్యమైతే అసహనం!
అనుకున్న సక్సెస్ సాధించలేకపోతే అసహనం
ఇలా ఇంటాబైటా ప్రతి చిన్న విషయంలో, పెద్ద విషయంలో ఏకాస్త ఆలస్యమైనా మనిషికి అసహనమే. చాలామందిలో ఇదే సమస్య.

కొందరు చీటికిమాటికి సహనం కోల్పోతారు. ఫలితంగా వారికి ఇంటా బైటా ప్రశాంతత లోపిస్తుంది.

సామాజికంగానూ, వ్యక్తిగతంగానూ అలాంటివారికి తీరని నష్టం వాటిల్లుతుంది. మనిషికి తొందరపాటు చాలా ఎక్కువ! అందుకే ఏదైనా అనుకున్న వెంటనే చేసేయాలి అనుకుంటాడు. ఆ సమయంలో ఆపదలొస్తే భయపడి డీలా పడతాడు. మనిషికి తొందరపాటే కాదు, ఆవేశం కూడా ఎక్కువే. సంతోషం కలిగితే తనంతటివాడు లేడనుకుంటాడు. బాధ కలిగితే అక్కసు వెళ్ళగక్కుతాడు. ఇలాంటి అన్నిరకాల పరిస్థితుల్లోనూ సహనం పాటిస్తే అంతిమంగా మనకు విజయం ఖాయం అంటున్నారు సామాజికవేత్తలు.

**నవంబర్ 16 ఇంటర్నేషనల్ టోలరెన్స్ డే సందర్భంగా మీరూ సహనంగా ఉండేందుకు ప్రయత్నించండి!!**

### ఇతరులతో సహనం

సహనం ఒక గొప్ప గుణం. అది అలవడితే జీవితం సాఫీగా సాగిపోతోంది. ఇతరులపట్ల సహనంతో వ్యవహరిస్తే, జీవితాన్ని సజావుగా నెట్టుకురాగలుగుతాం.

ప్రపంచంలో రకరకాల మనస్తత్వాలుంటాయి. అందరిని అర్థం చేసుకోవాలి. ఎంత చిరాకులో ఉన్నా ఇతరులపట్ల ఆ చిరాకు ప్రదర్శించకూడదు. ఎప్పటి కప్పుడు సహనభావంతో సర్దుకుపోవాలితప్ప సహనం కోల్పోయి మాట్లాడితే సామాజిక సంబంధాలు బలహీనపడతాయి.

మనలో సహనం లేకపోయినా, కొన్ని సందర్భాల్లో నటించాల్సి రావొచ్చు. ఇతరుల మనస్సు నొప్పించకూడదనుకుంటే ఓపిక పట్టాల్సిందే. మనం ఎంత విసిగిపోయినాసరే ఇతరులకు మన అసహనం తెలియపరచకూడదు.

ఎదుటివారు ఎంతో అభిమానంతో, మనకోసం ప్రయాణం చేసి మన వద్దకు వస్తారు. మనమీద ఎలాంటి సదభిప్రాయం లేకపోతే వారు మన వద్దకు రారు కదా! వీడు ఎందుకు వచ్చాడురా అన్నట్టు ప్రవర్తిస్తే ఆ అభిమానాన్ని దూరం చేసుకున్నట్లే. అలాంటివారిని సహనం కోల్పోయి మనం దూరంచేసుకుంటే మనకి మనుషులు దూరమవుతారు. మనల్ని మరచిపోవడం కూడా జరుగుతుంది.

### స్థిత ప్రజ్ఞత

రచయిత ఫ్రాంజ్‌కాఫ్కా చెప్పినదాని ప్రకారం మనిషికి జీవితం మొత్తంలో ఉన్న పెద్ద దుర్గుణాలు రెండే రెండు. ఒకటి అసహనం. రెండు అత్యాశ. ఈ రెండింటి వల్లనే మానవుడు జీవితంలో సంతోషాలకు సుఖాలకు దూరమవుతున్నాడని ఫ్రాంజ్‌కాఫ్కా చెప్పాడు. జీవితంలో ఏమి సాధించాలన్నా సహనం కావాలి. మనుషుల్లో ఉత్తముడు ఓర్పుగలవాడు సహనశీలే!



మేరుపర్వతంతో పాలసముద్రాన్ని కూడా మదించగలడతడు.

**సహతే తాచ్ఛీల్యేన ఇతి సహిష్ణు** అని చెప్తారు మన పురాణాల్లో.

ఇక్కడ **సహిష్ణుః** అంటే సహనం కలవాడు అని అర్థం. అసలు సహనం అంటే ఏంటి అని మీకు సందేహం కలుగుతుందా? మనకు ఏదైతే ఇబ్బంది కలిగిస్తుందో ఆ ఇబ్బందిపట్ల సానుకూలంగా ఆలోచించి, ఓర్పుగా ఉండడమే సహనం. అనుకున్నది జరగకపోతే అశాంతిగా ఉండటం

కన్నా మౌనంగా చిరునవ్వుతో ఆ పని పూర్తయ్యే వరకు ఎదురు చూడటమే సహనం. ఈ సద్గుణం ఉన్నవారు నిశ్చలంగా స్థితప్రజ్ఞతతో ఉంటారు. సహనంగా ఉన్న వ్యక్తి జీవితంలో ఏర్పడే అన్ని రకాల ఒడిదుడుకులను ఎదుర్కోగలడు. సహనం ఓ మానసిక పరిపక్వస్థితికి నిదర్శనం. ముఖ్యంగా కష్టకాలంలో రకరకాల ఉద్వేగాలను అధిగమించా లన్నా, వాటిని వాయిదా వేయాలన్నా సహనం తప్పనిసరి.

మనకు ఏ కారణంచేత ఎదుటిమనిషి నుంచి ఒత్తిడి కలుగుతుందో అందులోకి మనం కలిసిపోవడం... అంటే ఎదుటివారిలోని ఏ గుణం మనకు కోపాన్ని కలిగిస్తుందో ఆ గుణాన్ని సహ నంతో అధిగమించినవాడు జీవితంలో ఎదురయ్యే ఒడిదుడుకులను ఎదుర్కోగలుగుతాడు.

సహనం ఒక నిగ్రహశక్తి. ఒక మానసిక పరి పక్వతగల స్థితి. ముఖ్యంగా కష్టసమయంలో ఏదైనా ఉద్వేగాన్ని దాటవేయాలన్నా, వాయిదా వేయాలన్నా సహనం తప్పనిసరి. ఎదుటి మనిషి నుంచి మనకు దేని కారణంగా ఒత్తిడి కలుగుతుందో ఆ గుణాన్ని లేదా ఆ కారణాన్ని మనం అధిగమించడమే సహనం.

### ఓర్పుతోనే విజయం సాధ్యం

patience pays అని ఆంగ్లంలో ఓ సూక్తి ఉంది. ఓర్పుగా ఉండాల్సిన అవసరం, అసహనం వల్ల కలిగే నష్టాలను తెలియజేసే లెక్కలేనన్ని కథలు మన పురాణేతిహాసాల్లో లెక్కకుమిక్కిలిగా ఉన్నాయి. కానీ ఉరుకులు పరుగులతో సాగే ఈనాటి జీవితంలో ఓర్పు సాధ్యమయ్యే పనేనా? ఓర్పు అవసరమేనా? అనే సందేహం చాలా మందికి కలుగక మానదు. కానీ అవసరమేనని పరిశోధనలు నిరూపిస్తున్నాయి. అందుకే గత యాభై ఏళ్ళ నుంచి ఇప్పటివరకు చాలా పరిశోధ నలు ఓర్పుగా ఉండమనే హెచ్చరిస్తున్నాయి.

కుక్క మనల్ని కరుస్తుంది. కానీ దాన్ని మనం తిరిగి కరవలేం! కరవడం జంతు లక్షణం.

ఎదుటివారిని రెచ్చగొట్టడం, పురిగొల్పడం ఉత్తమ లక్షణం కాదు. రెచ్చగొడితే రెచ్చిపో కుండా ఉండటం సహనశీలి లక్షణం. ఈ దృష్టితో ఆలోచిస్తే మనం ఎదుటి వారిని చులకన చేసి నట్టు, మనం చులకన కానట్టు అర్థం అవుతుంది. సహనగుణం ఉన్న ప్రతివారిలోనూ ఈ దృక్పథం సహజంగానే ఉంటుంది. 'అల వచ్చినప్పుడు తల వంచాలి' అనేది ఒక సామెత. ఈ సామెతలోనే వ్యక్తిత్వ వికాసం ఇమిడి ఉంది. సహనానికి వ్యతి రేక పరిస్థితులు, అనుకూల పరిస్థితులు ఉండ కూడదని ఎన్నో పురాణగాథలు మనకు చెబు తున్నాయి. విజయ సాధనకు కేంద్రబిందువు సహనం. క్షమా గుణంలో మనకు ఉదాహరణ భూదేవే. సహనగుణం మన వెన్నంటి ఉన్నంత కాలం విజయం మనవెంటే ఉంటుంది.



## సహనం కోల్పోతున్నారా?

ఎంతకష్టమైనా సరే కొన్నికొన్ని కీలక సమయాల్లో సహనం కోల్పోయే పరిస్థితి వస్తుంది. ఆ సమయంలో సహనం కోల్పోతే భారీ మూల్యం చెల్లించుకోక తప్పదు. అయితే అలాంటి సమయాల్లో కూడా మనలో సహనం పెంపొందించుకోవడానికి కొన్ని సాధారణ నియమాలు పాటిస్తే సరిపోతుంది. మరి అవేంటో చూడండి.

1. సహనంలో మహిళలను భూదేవితో పోలుస్తారు. అయితే వారికి కూడా కొన్నిసార్లు ఓపిక నశించిపోయే ప్రమాదం ఉంది. తరచూ మీరు సహనం కోల్పోతున్నట్టుగా అనిపిస్తే శారీరక వ్యాయామం ద్వారా సమస్యను అధిగమించడానికి ప్రయత్నించాలి.
2. ఏదైనా ఒక విషయంలో సహనం కోల్పోతున్నట్టు భావిస్తే మీలో మీరు నిగ్రహించుకునేందుకు ప్రయత్నించాలి. దానికి తగినట్టుగా శ్వాసక్రియను కేంద్రీకరించే ప్రాణాయామం, కపాల్‌బాత్, బస్త్రిక లాంటివి చేస్తే మేలు.
3. ముఖ్యంగా కీలక సమయాల్లో మన మాటకు తగిన ప్రాధాన్యం, విలువ ఇవ్వలేదనే ఆవేదన కలుగుతుంది. మనకు ఈ విషయం అర్థమైనప్పుడు భావోద్వేగానికి గురవుతాం. దానికి బదులు, దాన్నోపెద్ద విషయంగా తీసుకోకుండా తామరాకు మీద నీటిబొట్టులా స్థితప్రజ్ఞత ప్రదర్శించాలి. అంటే భావోద్వేగాలకు దూరంగా ఉండటం చాలా మంచిది. ఆ సమయంలో మనల్ని మనమే నియంత్రించుకోవాలి.
4. సహనం హద్దులు దాటుతున్నప్పుడు లేదా నోరు అదుపు తప్పుతోందని అనిపించినప్పుడు వెంటనే పది నుంచి ఒకటి వరకు అంకెలు లెక్కిస్తే ప్రయోజనం కలుగుతుంది. లేదా వెంటనే అక్కడి నుంచి దూరంగా వెళ్ళడం ఉత్తమం. మంచినీళ్ళు తాగడం లేదా మనకు ఇష్టమైన వ్యాపకం చూసుకోవడం మొదలెడితే సహనం కోల్పోకుండా ఉండొచ్చు.

### పిల్లలకు సహనగుణం అలవడటం ఎలా?

ఇటీవలి కాలంలో పెద్దవారేకాదు పిల్లలు కూడా తరచు అసహనానికి గురవుతున్నారు. అందుకే పిల్లలకు బాల్యం నుంచే సహనగుణం అలవాటు చేయాలి. పిల్లలకు సహనం అలవడా లంటే ఆటపాటలే ఆయుధం. ఆటపాటల ద్వారా పిల్లలకు సహనం నేర్పించవచ్చు.

ఓర్పుకు పరీక్షపెట్టే కొన్ని రకాల కార్యకలాపాల్లో పిల్లలు పాల్గొనేట్టు చేస్తే, అన్ని విషయాల్లోనూ తొందరపాటులేకుండా ఓర్పుగా ఉండటం పిల్లలు అలవాటు చేసుకుంటారు. అప్పుడు వారికి నేర్పూ, ఓర్పూ త్వరగా అలవడతాయి. ఉదాహరణకు పజిల్స్ పూర్తి చేయటం, స్టాంపులు, నాణేలు సేక రించడంవంటి హాబీలు పిల్లలకు అలవాటుచేస్తే వారిలో నెమ్మదిగానైనా సహనం అలవడుతుంది. ఈ హాబీల్లో వెంట వెంటనే ఫలితాలు కనిపించవు కాబట్టి వాటికోసం పిల్లలు ఎదురుచూస్తారు. ఇలాంటివి నేర్పించడం ద్వారా పిల్లలపై అవెంతో మంచి ప్రభావం చూపిస్తాయి. పైగా అదేవిధంగా వారి ఆలోచనా పరిజ్ఞానం కూడా మెరుగుపడుతుంది.

-సంతోషలక్ష్మి దహగాం



## సహనంతో కలహాలు దూరం

*సహనం ఒక సుగుణం. ఆ గుణం దూరమైతే మానసిక ప్రశాంతత కొరవడుతుంది. అందువల్లనే జీవితాలు దుర్లభమైపోతున్నాయి. కుటుంబ కలహాలకు కూడా కారణం అసహనమే. ఓర్పు లేకపోవడమే. పని ప్రదేశాల్లో, ఇతరచోట్ల సహోద్యోగుల మధ్య సత్సంబంధాలు, సభ్యత లోపించడానికి కూడా కారణం సహనగుణం లేకపోవడమే. అందుకే ప్రతి ఒక్కరూ సహనగుణం అనివార్యంగా అలవాటు చేసుకోవాలి. కేవలం అసహనం కారణంగా జీవితంలో ఎంత కోల్పోతున్నామో గుర్తించాలి.*






**షాపింగ్ మాల్‌లో చైతన్యను చూసింది కల్పన. అతను అక్కడ తారసపడతాడనుకోలేదు. ఐతే అతను మాత్రం కల్పనను చూసి గమనించనట్టుగానే ఉన్నాడు.**

**అతని వాలకంచూసి కించిత్ ఆశ్చర్యపోయింది కల్పన. తనవైపు చూసినట్టుగానే అనిపించిందిగానీ అతనేమో చూడనట్టుగానే ఉన్నాడు. కారణం అర్థం కాలేదు. తనేవెళ్ళి పలకరిద్దామనుకుంటే ఏదో బిడియం.**

రెండో నిమిషంలో ఒకరికొకరు ఎదురుపడ్డా పలకరింపు లేకుండానే చూపులు కలుపుకుని విడిపోయారిద్దరూ. పలకరింపుచిహ్నమైన చిరునవ్వు కూడా పెదవులు దాటలేదు ఇద్దరికీ. ఎవరు ముందు పలకరించాలన్న సందిగ్ధమే కారణం.

అందమైన రూపం, ఆకర్షణీయమైన శరీరాకృతి, చురుకైన చూపులు, దృఢమైన బాహువులు, వెరసి ఏదో సినిమాలో హీరోలా ఉంటాడతను ఆమె ఉద్దేశంలో.

అజంతా, ఎల్లోరా, ఖజురహో శిల్పాల అందం గురించి అతనికి తెలియదుగానీ అందానికి నిఖార్సైన నిర్వచనం ఇవ్వాలంటే గత కొన్నేళ్ళుగా ప్రపంచ సుందరులుగా, విశ్వసుందరులుగా పేరు తెచ్చుకున్న ఎవరి పేరూ చెప్పక తడుముకోకుండా కేవలం కల్పన పేరే ముందుగా చెప్పాలనుకుంటాడతను. ఆమె అందం వర్ణించడానికి అతనికి మాటలు చాలవు. ఏ కావ్యాల్లో వెదకినా ఆ అందానికి సరైన వర్ణన దొరకదేమో. జగతిలో ఆడవాళ్ళసంఖ్య తగ్గడానికి కారణం బహుశా, ఆ బ్రహ్మ ఈ కల్పనను రూపకల్పన చేయడానికి మోతాదుకు మించి కొన్ని వేల రెట్లు సమయం కేటాయించి ఉంటాడేమో అనిపిస్తుంది. ఆమె అందమే కాక గుణగణాల్ని కూడా తొలిచూపులోనే గ్రహించాడతను.

అందానికి అహం చెల్లెలు వరసట. ఇంకా కచ్చితంగా చెప్పాలంటే అందం, అహం కవల పిల్లలట. ఐతే అదే బ్రహ్మ, ఆమెను ఒంటరిగానే పుట్టించాడు. బహుశా ఆమెను సృష్టించాక ఆ అందం చూసి మతిపోయి బ్రహ్మకే రిమ్మతెగులు పుట్టి అహాన్ని ఆమెకు తోడు పంపడం మర్చిపోయి ఉంటాడు.

ఆ విధంగా అందానికి మించిన అణకువతో ఎవరినైనా ఇట్టే ఆకర్షించగల ఆమెను తను కనీసం చూపులతోకూడా పలకరించకపోవడం, ఆమె అతన్ని దాటి వెళ్ళాక అతనికి ఇబ్బందిగా అనిపించింది. కానీ తప్పని పరిస్థితి. ఒకవేళ స్నేహితుల మాట విని తనేదైనా తప్పు చేస్తున్నాడా? కొన్ని నిర్ణయాలు స్వంతంగా తీసుకోవడమే శ్రేయస్కరం.

సినిమాల్లో చూపినట్టుగా కాస్తంత దూరం వెళ్ళాక అతనేమైనా తిరిగి చూస్తాడేమో అనే ఆలోచనతో కాసేపాగి వెనక్కు తిరిగి చూసిందామె. ఐతే ఆమెకు నిరాశే ఎదురైంది. ఎందుకంటే ఇది జీవితం. సినిమా కాదు.

అసలు కల్పన అనే ఒక అమ్మాయి తనకి ఎదురుపడిందన్న సంఘటనే జరగనట్టు అతను వెళ్ళిపోవడం కొద్దిగా బాధ కలిగించినా ఏదో కారణం లేనిదే అలా చెయ్యరు గదా అనుకునే విశాల దృక్పథం ఆమెది.

వాళ్ళిద్దరి పరిచయం వారం క్రితమే జరిగింది, పెళ్ళిచూపుల ద్వారా!

పెళ్ళిచూపుల్లో చైతన్య అక్కాచెల్లెళ్ళు కల్పన అందాన్నిచూసి నోరెళ్ళబెట్టిన మాట నిజమే. చైతన్య తల్లిమాత్రం మనస్ఫూర్తిగా, ముక్తసరిగా 'అమ్మాయి చాలా చాలా బాగుందిరా' అన్నది.

ఆమె అందం చూడ్డానికే చైతన్యకు సమయం సరిపోయింది. మాట్లాడేందుకు మాటలు రాలేదు. ఏం మాట్లాడాలో తోచలేదంటే ఇంకా బాగుంటుం

దేమో. వెళ్ళేటప్పుడు మాత్రం ఆమె ఫొటో ఒకటి కావాలని అడిగిమరీ తీసుకెళ్ళాడు. అంతగా ఫొటో అడిగి తీసుకెళ్ళిన అతను ప్రత్యక్షంగా ఎదురు పడ్డప్పుడు పలకరించకుండా వెళ్ళడానికి కారణం ఏమిటి? ఇక ఆ విషయమై ఎక్కువగా ఆలోచించ దల్చుకోలేదు కల్పన.

పెళ్ళిచూపులకు వచ్చివెళ్ళిన వాళ్ళ వద్దనుంచి ఇంకా సమాధానం రాలేదు. ఆ సమాధానంమీదే మిగతా కార్యక్రమాలు ఆధారపడి ఉంటాయి. ఇంటర్నెట్, ఈ-మెయిల్, మొబైల్ ఫోన్ ఉన్న ఈ కాలంలో సమాధానం చేరవేయడం పెద్దగా కష్టంతో కూడుకున్న పని కాదు. కానీ చెప్పవలసిన సమాధానం ఫలానా అని నిర్ణయించుకునేందుకు ఈ టెక్నాలజీ ఎంతమాత్రం ఉపయోగపడదు. అలా నిర్ణయం తీసుకునేందుకు కావల్సిన సమయం ఇదమిత్థంగా నిర్ణయించడం సాధ్యపడదు. అందువల్ల సమాధానం కోసం ఎంతకాలం వేచి ఉండాలో తెలియలేదు.

కల్పనకు ఇవే మొదటి పెళ్ళిచూపులు. అతనికి మాత్రం ఇదివరకే నాలుగైదు పెళ్ళి చూపులు జరిగాయి. చూసినవేవీ అతనికి నచ్చలేదు. కల్పనను చూసిన తరువాత మళ్ళీ పెళ్ళిచూపుల ప్రసక్తే తీసుకురాకూడదని పెళ్ళిచూపులు ముగించి గడప దాటేముందే ఇంట్లో వాళ్ళందరికీ కచ్చితంగా చెప్పేశాడు. ఒకవేళ పసుపురంగు దారం ఏదైనా దొరికుంటే అక్కడే కట్టేసేవాడేమో. ఐతే తల్లిదండ్రుల ప్రోద్బల మీద తన వేగం అదుపు చేసుకున్నాడు. ఆ ఆలస్యమే అతన్ని ఆలోచనలో పడేట్టు చేసింది. అందుకు కారణం ఆఫీసులో 'ఫ్రెండ్స్' అని పిలవబడే అతని 'కొలీగ్స్' మర్నాడు చేసిన చర్చ.

ఆ రోజు ఆఫీసులో స్నేహితులందరూ అతన్ని చుట్టుముట్టారు.

"ఏం గురూ? అమ్మాయి ఎలా ఉంది. ఓకేనా, డబుల్ ఓకేనా, త్రిబులోకేనా?"

"ఇన్ఫినిటీ ఓకే" అతని ముఖంలో ఆనందం కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది.

"సో, త్వరలో పెళ్ళి భోజనం రెడీ అన్నమాట" ఒక భోజనం ప్రియుడి సంతోషం.

"అమ్మాయి ఫొటో కాస్త చూపించరా" మరో స్నేహితుడి అభ్యర్థన.

జేబులోంచి తీసి చూపించాడు చైతన్య గర్వంగా.

ఒక్కక్షణం అక్కడున్న స్నేహితులందరూ ఆ ఫొటో వంక గుడ్లప్పగించి చూస్తూ ఉండిపోయారు. చైతన్య పర్సనాలిటీకి సరైన జోడీ అనిపించేలా ఉంది కల్పన.

ఐతే మరుక్షణమే పదిమంది ఉండే గుంపులో ఆరుగురు నిస్సంకోచంగా పెదవి విరిచారు. అందులో ఒకడు మరికాస్త ముందుకెళ్ళి "రేయ్ గురూ, ప్రొసీడ్ అవ్వకపోవడమే మంచిది" అన్నాడు. అతని మాటలకు ఉలికిపడ్డాడు చైతన్య.

"భార్యా రూపవతి శత్రుః' అంటే అందమైన భార్య శత్రువన్నమాట. ఎలాగంటే భార్య అందంగా ఉంటే ప్రతివాడికళ్ళూ ఆమె మీదే ఉంటాయి. అది మనకు ఇబ్బందిగా ఉండడమే కాకుండా దానివల్ల ప్రశాంతత లోపిస్తుంది. లేనిపోని అనుమానాలకు దారి తీస్తుంది. అంతేకాక వీడికి ఇంత అందమైన భార్యా! అని అక్కసు వెళ్ళబోసుకునే వాళ్ళు ఉండనే ఉంటారు. ఇవన్నీ లేనిపోనిరిస్కులు. కాబట్టి అమ్మాయి యావరేజ్‌గా ఉంటే ఏ ఇబ్బందీ ఉండదు. ఇది నా సలహా" అంటూ చిన్నలెక్చరిచ్చాడు ఆ స్నేహితుడనబడే శాడిస్టు.

**పెళ్ళిచూపుల్లో అమ్మాయి అతడికి తెగ నచ్చేసింది. ఆమె అందాన్ని వర్ణించడానికి ఏ కావ్యం వెదికినా వర్ణనలు దొరకవేమో! మర్నాడు ఆఫీసుకొచ్చాడతను. ప్రశ్నలతో నిలదీసిన కొలీగ్స్ ఆమె ఫొటో చూపించమన్నారు. ఫొటోచూశాక పెదవి విరిచారు. డ్రాపైపోవడం మంచిదన్నారు. భార్యా రూపవతి శత్రుః అన్నారుకదా అన్నాడో కొలీగ్. అది అతని తలకు బాగా ఎక్కేసింది. మరి అతనెలాంటి నిర్ణయానికొచ్చాడు?**

మిగతా మాటలెలావున్నా చివరి నాలుగు వాక్యాలూ ఠక్కున మెదడుకి పట్టేశాయి. అతన్ని ఆలోచనలోకి నెట్టేశాయి. అనేక సందర్భాల్లో ఇతరులుచెప్పే మంచికన్నా చెడు చాలా త్వరగా మనుషులను ప్రభావితం చేస్తుంది. ఇప్పుడు చైతన్య విషయంలోనూ అదే జరుగుతోంది. వారంరోజులుగా ఒకవైపు కల్పనతో కల్పనా ప్రపంచంలో హద్దులులేకుండా విహరిస్తూనే మరోవైపు స్నేహితుడి మాటల గురించి తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

అంతలో అతని సెల్ మోగింది. తీసి చూస్తే ఏదో కొత్త నెంబరు. సందేహాస్పదంగా పచ్చబటన్ నొక్కి "హలో" అన్నాడు మెల్లగా.

"హలో" అంటూ అవతలివైపు తీయని కంఠం.

"ఎవరు కావాలండీ?"

"నా పేరు కల్పన"

చైతన్యకు పొలమారింది. తన నంబరు ఆ అమ్మాయికి ఎలా తెలిసింది?

కచ్చితంగా ఇది తన చెల్లెలుపనే.

"నిన్న సాయంత్రం మాల్‌లో కనిపించినా, పలకరించకపోవడం నాకు నచ్చింది"

ఆమె మాటలు అతనిలో ఉత్సుకత రేపాయి.' పెళ్ళిచూపులతో పరిచయమైంది కాబట్టి బైట ఎక్కడైనా ఇలా తారసపడినప్పుడు కనీసం పలకరించడం పరిపాటి. కానీ తను ఆ కనీస మర్యాద కూడా పాటించకుండా అలా వచ్చేయడం ఆమెకు నచ్చలేదేమో'

"అదేంటండీ. నా చర్య మీకు తప్పుగా అనిపించలేదా?" గొంతు పెగల్చుకుని అడిగాడు చైతన్య.

"భలేవాళ్ళే. ఇందులో తప్పేముందీ. కేవలం పెళ్ళి చూపులు ముగిసినంత మాత్రాన ఎక్కడలేని చనువు వచ్చేస్తుందా? నిన్న సాయంత్రమే ఈ విషయం మా స్నేహితురాళ్ళకు చెప్పినప్పుడు వాళ్ళంతా మిమ్మల్ని ఎంతగానో అభినందించారు. మిమ్మల్నొక పర్ఫెక్ట్ జెంటిల్‌మన్‌గా పొగిడారు. నాకెంతో గర్వంగా అనిపించింది. అందువల్లే ఇప్పుడు మిమ్మల్ని పలకరించాలనిపించింది. మీ చెల్లెలు దగ్గర నెంబరు తీసుకుని, మీకు ఫోన్ చేస్తున్నాను. నేనేమీ తప్పు చెయ్యలేదు కదూ?"

సుదీర్ఘమైన ఆమె మాటలు విన్నాడో లేదో అతనికే తెలియదు. ఎందుకంటే ఆమె మాట్లాడుతోంటే సొంపైన సంగీతం వింటున్నట్టనిపించింది. ఆమె చెప్పిన విషయం అసలు బుర్రకెక్కించుకోలేదు. అక్కడక్కడా రెండు మూడు ముక్కలు మాత్రం చెవిలో పడ్డాయి. చెల్లెలివద్ద నంబరు తీసుకున్న విషయంమాత్రం స్పష్టమైంది.

అతనివద్ద నుండి ఎటువంటి ప్రతిక్రియా లేకపోవడంతో "నా మాటలు విన్నారా?" అన్నది కల్పన లోగొంతుకతో.

"ఆ....ఆ...వింటున్నాను" అంటూ తడబడ్డాడు చైతన్య.

"మీతో ఇలా మాట్లాడ్డం తప్పేమీ కాదు కదా?" అడిగింది మళ్ళీ.

"నో నో, నాటెటాల్ అన్నాడు మరేమనాలో తెలియక.

"థాంక్స్. పెళ్ళికి మీ నుంచి ఇంకా సమ్మతి తెలియరాలేదని ఇంట్లో వాళ్ళు మాట్లాడుకుంటూ ఉన్నారు. తొందరేం లేదు. తొందరపడి తీసుకోవాల్సిన నిర్ణయాలు కావివి. ఒకటికి పదిసార్లు బాగా ఆలోచించుకోవాలి. ఒకవేళ ఆలోచిస్తే, అందుక్కూడా

## కైట్ ప్రాక్టీసు ఎందుకో?

*కత్రినా కైఫ్ నటించిన 'బార్ బార్ దేఖో' కలెక్షన్ల పరంగా విజయం సాధించకపోయినా ఆ సినిమాలో 'కాలా చష్మా' పాటకు కైట్ వేసిన స్టెప్పులకు సినీ ప్రేక్షకులు ఫిదా అయిపోయారు. ఈ సినిమా తరువాత కత్రినా స్టెప్పులు బాగా పాపులర్ అయ్యాయి కూడా! ఇప్పుడు ఆ స్టెప్పులను కత్రినా తాజాగా ప్రాక్టీసు చేస్తోంది. ఓ కార్యక్రమంలో ఆ పాటకు డ్యాన్స్ చేయనుందని సమాచారం. ఈ కార్యక్రమం ఎందుకో, ఎప్పుడో అన్న వివరాలు మాత్రం కైట్ గోప్యంగా ఉంచుతోందట!*



థాంక్స్. వీలుంటే మళ్ళీ ఎప్పుడైనా మాట్లాడుకుందాం. ఉంటాను" అంటూ ఫోన్ పెట్టేసింది.

వీనుల విందైన సంగీతం కరెంటు కోతతో హటాత్తుగా ఆగినట్టై అతని చుట్టూ అంధకారం అలుముకున్నట్టనిపించింది. మాల్‌లో ఆమెను పలకరించకపోవడం తప్పేమో అన్న భావన కలిగింది. జరిగినదానికి ఇప్పుడు చింతించి లాభంలేదు.

మొదటిసారిగా స్నేహంగురించి అనేక ప్రశ్నలు ఉదయించాయి.

స్నేహమంటే నిర్వచనం ఏమిటి? నిజమైన స్నేహానికి గీటురాయి ఏమిటి? స్నేహానికి పరిమితులు, పరిధులు ఉంటాయా? అవేమిటి?

తన స్నేహితులను ఆమె స్నేహితులతో పోల్చి చూసుకున్నాడు చైతన్య. ఆమెకూ స్నేహితులు ఉన్నారు. అయితే వాళ్ళంతా ఎంతో హుందాగా తన ప్రవర్తనను పాజిటివ్‌గానే ఆలోచించారు. అది తన ఔన్నత్యంగా గుర్తించి కీర్తించారు. తన ప్రవర్తనలో ఏ మాత్రం తప్పులేనట్టు ఆమె వెన్ను తట్టి ప్రోత్సహించారు.




తన స్నేహితులుమాత్రం ఆమెను అవాయిడ్ చేసేందుకే ఒత్తిడి తెచ్చారు. పైగా 'భార్యా రూపవతీ శత్రుః' అంటూ సామెత కూడా ప్రవచించారు. వీళ్ళు నిజంగా స్నేహితులేనా? నిజమే. వీళ్ళంతా స్నేహితులు కాదు, కేవలం కొలీగ్స్. స్నేహితులంటే నిర్ణయాత్మక సమయాల్లో వెన్నుదన్నుగా నిలవాలి. విశ్లేషణాత్మకంగా ఆలోచించేందుకు దోహదపడాలి. కష్టాల్లో ఉంటే కడతేర్చేందుకు సాయపడాలి. సంతోషంలో సరి సమానంగా పాలుపంచుకోవాలి.

ఈ ఆలోచనల మధ్య అతనికి ఒక వ్యక్తి గుర్తుకు వచ్చాడు. 'సందీప్!' అవును. అందరూ అన్ని విధాలుగా కామెంట్ చేసినా అతనుమాత్రం ఆ రోజు ఏమీ మాట్లాడలేదు.

సందీప్, తను ఇద్దరూ ఒకేరోజు ఉద్యోగంలో చేరారు. ఇద్దరూ వేరువేరు రాష్ట్రాలకు చెందిన వాళ్ళు. తను ఆంధ్రా అయితే అతను తమిళనాడుకు చెందినవాడు. ఇద్దరూ ఉద్యోగం చేసేది కర్నాటకలో. ఇద్దరూ పరస్పర సహకారంతో తమ భాషలను కూడా ఇచ్చిపుచ్చుకున్నారు. ఉద్యోగంలో చేరిన తరువాత దాదాపు రెండు సంవత్సరాలు ఇద్దరూ రూమ్ మేట్స్‌గా ఉన్నారు. ఆ తరువాత సొంత ఫ్లాట్ కొనుక్కుని అతను వేరుగా వెళ్ళాడు. ఐనా క్రమం తప్పక ప్రతివారం ఏదో ఒక ప్రోగ్రాం వేసుకునే వాళ్ళు ఇద్దరూ. కాలం గడుస్తున్నకొద్దీ దూరం పెరిగింది. డిపార్ట్‌మెంట్ మారడంతో వాళ్ళ కలయికకూడా తగ్గింది. కానీ ఎప్పుడైనా కనిపిస్తే ఎంతో ఆప్యాయంగా పలకరిస్తాడతను.

తన పెళ్ళిచూపుల గురించి అందరుచేరి గోలగోలగా మాట్లాడుతూ ఉచితంగా సలహాలూ, అభిప్రాయాలూ ఇచ్చి 'పారేస్తుంటే' అతని మాటలు, అతని అభిప్రాయం మాత్రం తను వినలేదు. అడిగి తెలుసుకోలేదు. పెళ్ళిచూపులకు వెళ్ళొచ్చిన విషయం మాత్రం మరిచిపోకుండా చెప్పాడంతే.

ఆ మధ్య అతనిక్కూడా పెళ్ళిచూపులు జరిగాయట. విచిత్రమేమిటంటే అతను అమ్మాయిని నేరుగా చూడలేదు. కనీసం ఫొటో కూడా చూడలేదట. కేవలం ఫోన్లో మాట్లాడి తన సమ్మతి తెలియజేశాడట. ఐతే తన ఫొటో ఆ అమ్మాయికి పంపాడట.

ఆ అమ్మాయి అతనికన్నా రెండాకులు ఎక్కువే చదివింది. తన ఫొటో అతను చూడలేదు. కాబట్టి పెళ్ళిరోజున అతనిముందే ఆ ఫొటో కవరు తెరుస్తుందట. ఆ విషయం ఫోన్లోనే చెప్పిందట. ఇదేదో సినిమా కథలా అనిపించి, వాళ్ళ చిలిపి సరసం వినడానికి ముచ్చటేసింది. మళ్ళీ అది ప్రేమా అంటే ప్రేమ కాదట. పెద్దలు కుదిర్చిన పెళ్ళట. పెద్దలు మాత్రం ఒకరినొకరు కలిసి మాట్లాడుకున్నారట. అక్కడ కూడా మరో నిబంధన ఏమిటంటే తన తల్లిదండ్రులు ఆ అమ్మాయిని చూడనవసరం లేదని తెగేసి చెప్పేశాడు సందీప్. దాంతో ఇరువైపులా పెద్దలు మేం మాత్రం తక్కువ తిన్నామా అంటూ వాళ్ళు కూడా తమకు కాబోయే అల్లుణ్ణీ, కోడలినీ చూడబోమని భీష్మించుక్కూర్చున్నారట. వాడిపెళ్ళి నిఖార్సైన 'విచిత్ర వివాహం' అనిపించింది.

ఆలోచిస్తుండగా వెంటనే అతన్ని కలవాలనిపించింది. ఫోన్ తీసి మాట్లాడాడు. సాయంత్రం ఏదో పనుందనీ, కలిసేందుకు వీలుకాదనీ చెప్పాడు. అతని మాటలు విని నిరాశ చెందాడు చైతన్య. పోనీ ఎప్పుడు వీలుంటుందో కనుక్కుందామంటే అంతలోనే ఫోన్ డిస్కనెక్ట్ చేశాడు సందీప్.

ఆ రోజు సాయంత్రం మళ్ళీ అదేమాల్‌కు వెళ్ళాడు చైతన్య. ఆమె తనతో ఫోన్లో మాట్లాడిన తరువాత మనసులో ఏదో అలజడి. మనసు అయస్కాంతంలా ఆమెవైపే లాగుతోంది. 'ఇవాళకూడా మాల్‌లో ఆమె కనిపిస్తే బాగుణ్ణు' అనిపిస్తోంది. కనిపిస్తే తప్పక పలకరించాలి అనే నిర్ణయానికి వచ్చేశాడు.

మాల్‌లో తిరుగుతున్నవాడల్లా హటాత్తుగా ఒకచోట ఆగిపోయాడు.

కలా, నిజమా అర్థం కాలేదు. ఒకవేళ అది తనకున్న అతీంద్రియ శక్తేమో అని కూడా అనిపించకపోలేదు. తలచినదే తడవుగా ఆమె కళ్ళముందు సాక్షాత్కరించింది.

కొద్ది క్షణాలపాటు తనకళ్ళను తానే నమ్మలేకపోయాడు. ఐతే అంతలోనే అతని సంతోషం ఆవిరయ్యే సంఘటనకూడా కళ్ళకు కట్టింది. ఆమె పక్కనే మరొక వ్యక్తి! నమ్మశక్యం కాలేదు. అతను ఎవరన్న ఉత్సుకతతో మరికాస్త పరికించిచూసి స్థాణువయ్యాడు. ఆ వ్యక్తి గురించిన పరిచయం తనకక్కరలేదు. అతను సందీప్!

ఇద్దరూ నవ్వుతూ ఏదో మాట్లాడుకుంటూ మెట్లు దిగుతున్నారు. క్షణంలో వెయ్యోవంతులో తనను తాను ఒక స్థంభంచాటుకు చేర్చుకున్నాడు.

కల్పనకు సందీప్‌తో పరిచయం ఎప్పట్నుంచీ ఉంది? ఒకవేళ ఈ కారణంగానే అతను మౌనంగా ఉన్నాడా? కొలీగ్స్ పదిమంది పది విధాలుగా తమ అభిప్రాయాలు చెపుతున్నప్పుడు ఇతను మాత్రం మౌనంగా ఉండడం వెనుక ఆంతర్యం ఇదా?

వాళ్ళిద్దరూ ఈ లోకాన్నిమరిచి నవ్వుతూ, తుళ్ళుతూ, కేరింతలు కొడుతూ మాల్ బైటికి వెళ్ళిపోవడంతో నిస్సత్తువగా చూస్తూ నిలబడిపోయాడు. తన స్వార్జితాన్ని ఎవరో దోచుకెళుతున్న అనుభూతికి లోనై నిలబడ్డ చోటునుంచి అడుగు తీసి అడుగు వెయ్యడానికి చాలా కష్టపడ్డాడు. తరువాత అతను ఇల్లు చేరుకోవడమన్నది కేవలం అసంకల్పిత ప్రతీకార చర్య. అతని శరీరానికి అలవాటుపడిన ఒక యాంత్రిక చర్య.

మర్నాడు ఆఫీసులో సందీప్ అదేపనిగా వచ్చి చైతన్యను కలిశాడు.

"సారీరా. నిన్న సాయంత్రం ఒక ముఖ్యమైన పని తగిలింది. అందువల్ల రాలేకపోయాను. ముందుగానే ఫిక్స్ చేసుకున్న అపాయింట్మెంట్ కావడం వల్ల మరో మార్గం లేకపోయింది. ఇప్పుడు చెప్పు, ఏమిటంత అర్జంటు పని?"

"నువ్వెక్కాల్సిన రైలు జీవిత కాలం లేటు" అన్నాడు ఎటో చూస్తూ.

"ఏమిట్రా ఏదేదో వాగుతున్నావు. అంటే ఏమిటో కాస్త అర్థమయ్యేట్టు చెప్పు."

"నిన్నటి అవసరం నిన్నటితోనే ముగిసిపోతుంది. ఇవాళ దాని అవసరం ఉండదు"

"ఊరికే నాన్చక విషయం చెప్పరా?"

"అది సరే, ఇంతకూ నీ పెళ్ళి విషయమేమైంది? పెళ్ళెప్పుడు? అమ్మాయిని ఇప్పటికైనా చూశావా? ఇంకా నీ పంతానే ఉన్నావా?"

"నువ్వు మాట మారుస్తున్నావు"

"నా ప్రశ్నకు సమాధానం చెప్పు, తరువాత నీ ప్రశ్నకు సమాధానం చెప్తాను."

## బిగ్‌బీని దాటేసిన దీపికా?

ఇప్పటివరకూ అత్యధిక పారితోషికం తీసుకునే నటీనటుల్లో అమితాబ్ పేరు వినిపించేది. ఇప్పుడు రెమ్యునరేషన్‌లో ఆయనను దీపికా దాటెళ్ళి పోయిందని అంటున్నారు. బాలీవుడ్‌లో ఓ సినిమాలో బిగ్‌బీ, దీపికా కలిసి నటిస్తున్నారు. ఈ సినిమాకు గాను దీపికా మిగతా అందరు నటీనటులకన్నా ఎక్కువ తీసుకుంటోందట! ఆఖరికి అమితాబ్ కన్నా కూడా ఎక్కువే ఇస్తున్నారు. ఇలా ఎక్కువ ఇవ్వడానికి కారణాలు ఉన్నాయి అంటున్నారు బాలీవుడ్ జనాలు. ఆ సినిమాలో అమితాబ్‌ది చిన్న పాత్ర. కొద్దిసేపే కనిపిస్తాడట! దీపిక ఏమో హీరోయిన్...అందుకే బిగ్‌బీకి తక్కువ ఇచ్చి దీపికాకు ఎక్కువ ఇస్తున్నారన్నమాట.



"సరే విను. నాకు మనసు ముఖ్యమని ఆనాడే చెప్పాను. దానికే ఈనాటికీ ఏనాటికీ కట్టుబడి ఉంటాను."

"నువ్వింత వరకూ ఎవరినీ ప్రేమించలేదా?"

అతను కాస్సేపు మౌనం వహించాడు. నవ్వేసి "అదంతా గతం. నేను వర్తమానం ముఖ్యం అనుకుంటున్నాను. అందులోనే జీవిస్తాను"

"గతమంటే నిన్నటిరోజైనా గతంకిందే లెక్కా?"

అతనేం మాట్లాడుతున్నాడో అర్థం చేసుకునేందుకు ప్రయత్నించాడు సందీప్.

అతని మౌనం చైతన్యను కలచివేసింది.

"నేను కల్పన ప్రపోజల్ డ్రాప్ చేస్తున్నాను" అన్నాడు మెల్లగా.

ఆశ్చర్యంతో భృకుటి ముడివేసి "వాట్, కల్పనను కాదనుకుంటున్నావా? కారణం?"

ఇప్పుడు మౌనం సాధించడం చైతన్య వంతైంది.

"చెప్పరా. కారణం లేకుండా కాదనడం సబబు కాదు"

అప్పటికీ అతను పెదవి విప్పలేదు.

"ఆ రోజు నీ చుట్టూ చేరిన కొలీగ్స్ నీ మెదడు ఛిన్నాభిన్నం చేసినప్పుడే నువ్విలాంటి నిర్ణయమేదో తీసుకుంటున్నావన్న అనుమానం కలిగింది. శ్రీరాముడంతటివాడే చెప్పుడు మాటలకు ప్రభావితుడయ్యాడు. అదేమంటే లోకంకోసం అంటూ తన చర్య సమర్థించుకున్నాడు. మనం మానవమాత్రులం. తప్పు ఎవరైనా చెయ్యగలరు. చేస్తారు. కానీ పరిస్థితి చెయ్యిదాటే లోపే సరిదిద్దుకునే వాడే సంతృప్తికరంగా జీవించగలడు. కల్పన చాలామంచి అమ్మాయి. నీకు నీ కల్పనలో కూడా కల్పన లాంటి అమ్మాయి ఈ భూమ్మీద ఉంటుందా అన్న కల్పన సాధ్యం కాదు. ఆ విషయం మాత్రం మర్చిపోకు"

"ఆ అమ్మాయి గురించి అంతగొప్పగా ఎలా చెప్పగలవు?"

"నాకు నీతో ఎంతకాలంగా పరిచయముందో అంతకన్నా రెండేళ్ళు తక్కువగా ఆమెతో పరిచయం ఉంది. ఇప్పుడు నేనుండే ఫ్లాట్స్‌లోనే వాళ్ళూ ఉంటున్నారు. నేను నీకు స్నేహితుడైతే ఆమె నాకు స్నేహితురాలు.

అది చైతన్య ఊహించని విషయం. ఆశ్చర్యానికి గురయ్యాడు చైతన్య. మనసులో మరికొన్ని ప్రశ్నలు ఉదయించాయి.

అదే తరుణంలో మిగతా కొలీగ్స్ మాటలు మళ్ళీ మెదడులోకి చొచ్చుకువచ్చాయి. 'అందమైన వాళ్ళంటే కాస్త అటూ ఇటూ ఉంటారు. ఈ కాలంలో ఇటీజ్ ఆల్ ఇన్ ది గేమ్. అందువల్లే మనం రిస్క్ తీసుకోకుంటే బెటర్' అవి గుర్తుకు వచ్చి తల విదిల్చాడు.

"నువ్వు ఎన్ని చెప్పినా నాకేమో ప్రొసీడవ్వాలని లేదురా. అమ్మాయి అందంగానే ఉంది కానీ..." అంటూ ఆగిపోయాడు.

"నీకో విషయం తెలుసా? అసలు నా పెళ్ళిచూపులకోసం మా వాళ్ళు ప్రయత్నించేటప్పుడు నాకు సలహా ఇచ్చింది కల్పనే. 'నీలో మంచితనముంటే మనిషిని చూడకుండానే పెళ్ళిచేసుకో. నీ మంచి మనసుకు మంచి మనసున్న, అందమైన అమ్మాయే దొరుకుతుంది. ఇది సత్యం' అని చెప్పింది. నిజానికి తను కూడా అలాగే చెయ్యాలనుకుంది. నువ్వు నా కొలీగ్ అని తెలిశాక తను అసలు నిన్ను చూడకూడదనే అనుకుంది. ఎందుకంటే నేనేమిటో తనకు తెలుసు కాబట్టి నా స్నేహితుడన్న ఒక ఫేస్‌వాల్యూ నీకు ఇచ్చింది. కానీ ఒకానొక సందర్భంలో మన ఫొటో ఆల్బం చూసేసింది. దాంతో వ్రతభంగమైనట్టు భావించి సంప్రదాయబద్ధంగా పెళ్ళిచూపులకు ఒప్పుకుంది. తను నా ఫ్రెండ్‌కాబట్టి నా పెళ్ళి విషయంలో ఆమె మాటకు నేను కట్టుబడి ఉన్నాను"

చైతన్య మౌనం వీడలేదు. సందీప్ మళ్ళీ ప్రారంభించాడు.

"అదేరా వాళ్ళకూ మనకూ ఉన్న తేడా. అధిక శాతం మగవాళ్ళు బాహ్య సౌందర్యాన్ని చూస్తారు. ఆడవాళ్ళు అంతర్గత సౌందర్యాన్ని చూస్తారు. మగాళ్ళు మనిషిని చూస్తారు. ఆడవాళ్ళు మనసును చూస్తారు. మన కొలీగ్స్ చెప్పింది కొంత వరకూ నిజమే. భార్యా రూపవతీ శత్రుః కానీ అది ఎప్పుడంటే మన బుద్ధి, మగ బుద్ధి స్థిరంగా లేనప్పుడు. మన మగ మనసులో అర్థంలేని అనుమానాలకు తావిచ్చినప్పుడు. అప్పుడు నిజంగానే భార్య అందమైన శత్రువులా అనిపిస్తుంది. ఫొటోలలో తోడుగా నిలబడేవాళ్ళు కొలీగ్స్. కానీ కష్టాల్లో, క్లిష్ట సమయాల్లో తోడుగా నిలబడేవాడు స్నేహితుడు. ఈ విషయం అర్థం చేసుకో. ఈ నిమిషంలో నువ్వు తీసుకునే నిర్ణయం నీ జీవితాన్ని శాసిస్తుంది. నీకు తెలియని మరో ముఖ్య విషయం ఉంది. నిన్న సాయంత్రం నేను కల్పనను కలిశాను. ఆ సందర్భంలో తను మీ తరపు నుంచి ఇంకా సమాధానం రాలేదన్న విషయం చెప్పింది. అప్పుడు నేను యథాలాపంగా మన కొలీగ్స్ నీతో అన్న మాటలు చెప్పాను. అప్పుడు తనేమన్నదో తెలుసా? 'అతను సందీప్ స్నేహితుడు. ఆ మాటలన్నీ అతనికి బహుశా వినబడి ఉండవు. ఒకవేళ ఎవరైనా పనిగట్టుకుని చెప్పినా పట్టించుకోడు. ఆ నమ్మకం నాకుంది' అన్నది. అది ఆ అమ్మాయికి నా స్నేహం మీదున్న నమ్మకమో, నువ్వు నా స్నేహితుడివన్న నమ్మకమో ఇప్పటికీ అర్థం కావడం లేదు. నమ్మకం అనే పునాదిమీద, నిబద్ధత అనే ఒంటిస్తంభంమీద కట్టిన మందిరమే స్నేహం. నమ్మకం, నిబద్ధత ఎంత ఎక్కువగా, పటిష్టంగా ఉంటే అంత స్థిరంగా ఉంటుందా స్నేహమందిరం. నేను చెప్పాల్సిందంతా చెప్పాను. ఇక నీ ఇష్టం" అంటూ ఆపాడు సందీప్.

చైతన్య మనసు వికలమైంది. తొందరపడి తన నిర్ణయం కల్పనతో చెప్పకపోవడమే ప్రస్తుతానికి సందీప్ స్నేహితుడిగా తను చేసిన ఒకే ఒక మంచి పని. స్నేహానికి అర్థం వెదికే సమయంలో సందీప్ రూపంలో మూర్తీభవించిన స్నేహం తన ముందు నిలిచింది. 'నీ స్నేహితులెవరో చెప్పు నీ గురించి నేను చెబుతాను' అంటారు. సందీప్ ఇద్దరికీ స్నేహితుడే. తనకు కావలసింది ఫొటోలో తోడు నిలిచేవాళ్ళ మాటలు కాదు. జీవితంలో తోడునిలిచేవాళ్ళ మాటలే. కల్పన సందీప్ స్నేహితురాలంటే ఇక ఎటువంటి సందేహమూ అక్కర్లేదు' అనుకుంటూ తన నిర్ణయం తెలిపేందుకు వెంటనే ఫోన్ తీసి కల్పనకు రింగ్ చేశాడు.

దూరంగా ఎఫ్ఫెమ్‌లో 'స్నేహ బంధము ఎంత మధురము అది చెరిగిపోదు, తరిగిపోదు జీవితాంతము' అన్నపాట మంద్రస్థాయిలో వినబడుతోంది.

***సెల్: 90031 41474***




**సరిగ్గా అరగంట తర్వాత మాధురి సెల్‌ఫోన్ మళ్ళీ శబ్దం చేసింది.**

**"ఊ.... చెప్పు"**

**"రిసెప్షన్ దగ్గరకి రాగలవా?"**

**"ఎందుకు?"**

**"సస్పెన్స్ అండ్ సర్‌ప్రైజ్"**

**"టూ మినిట్స్" అని మాధురి కదిలింది.**

మాధురి లిఫ్ట్‌లో వేగంగా కిందికొచ్చి, రిసెప్షన్ సమీపంలో ఉన్న కౌశిక్‌ని చూసి నమ్మలేనట్టు ఆశ్చర్యంగా చూస్తుంటే... వేగంగా రెండు కన్నీటి బొట్లు అడ్డొచ్చి ఆమె కళ్ళలో పొరలా కమ్మాయి.

నవ్వుతూ దగ్గరకొచ్చి "ఏంటీ?... దేవదాసు అవతారంలో చెప్పాపెట్టకుండా ఊడిపడ్డావు?" అంది.

"చూడాలన్పించింది... వచ్చేశాను."

"ఎక్స్‌పెక్ట్ చెయ్యలేదు" అందతని చేతులు పట్టుకుని.

"ఏంటిలా చిక్కిపోయావు?"

"నిన్ను చూసిన సంతోషంలో..."

అంతలో అక్కడికి మాధురి బ్యాచ్‌మేట్స్ వచ్చారు. వాళ్ళని కౌశిక్‌కి పరిచయం చేసింది.

"రెండ్రోజుల్లో నేనే వస్తున్నాగా?" అంది మాధురి.

"అదంతా నాకనవసరం అనుకున్నాను... వచ్చేశాను... దట్సిట్" అన్నాడు భుజాలెగరేసి.

"ఎప్పుడు బయల్దేరావు! రా!" అని రిసెప్షన్ సమీపంలో ఉన్న కుర్చీల్లో కూచున్నారిద్దరూ.

"నిన్న ఢిల్లీ వచ్చాను. అక్కణ్నుంచి... ఇలా!"

"ఊ... ఇంట్లో గ్యాంగంతా ఎలా ఉన్నారు?"

"నాట్ వెల్"

"వ్వాట్?"

"మరీ అంతగా ఆశ్చర్యపోకు. అందరూ ఆరోగ్యంగానే ఉన్నారు. మెంటల్లీ నాట్‌వెల్".

"అవును సహజమే.. నేనక్కడలేను గదా!"

"అక్కడ అంత సీన్లేదు. అందుకే ఇక్కడికొస్తున్నట్టు ఎవ్వరికీ చెప్పలేదు."

"అవునా?!... నీ కోసం ట్విన్ సిటీసంతా వెతుక్కుంటారు. తర్వాత పోలీసు కంప్లయింటు, పేరు, టీవీ, ప్రకటనలు".

"ఊ... తర్వాత...."

"బస్టాండ్లో, రైల్వేస్టేషన్లలో గోడల మీద 'కన్పించటం లేదు' అని పోస్టర్లు కూడా అంటిస్తారు".

"అది నీలాంటి మ్యాడ్రీస్‌కి. నాలాంటి వాళ్ళకి కాదు" అన్నాడు.

మాధురి సెల్ మోగింది.

"హలో! శ్రీకాంత్... కింద రిసెప్షన్ దగ్గరున్నాను".

"అక్కడే ఉండు. నేను, భరత్ కపిల అక్కడికొస్తున్నాం. లంచ్‌కి వెళ్దాం."

"ష్యూర్" అని ఫోన్ ఆఫ్ చేసింది.

కౌశిక్‌వేపు తిరిగి.. "శ్రీకాంత్... నీకు తెల్సుగా!" అంది.

"నువ్వు తెల్సిన వాళ్ళందరికీ.. అతనూ తెలుస్తాడు".

"శ్రీకాంత్ ఆఫీసర్స్ క్లబ్ ఛైర్మన్‌గా ఎలక్టయ్యాడు. అందుకే చిన్న గెట్ టు గెదర్ ఏర్పాటు చేశాం".

"బాగా యాక్టివ్ అనుకుంటా?"

"నాకు ఇక్కడికొచ్చాకే తెల్సింది. అంతకుముందు చాలా కామ్ అండ్ కూల్ గై అనుకునేదాన్ని. అలాగే ఉండేవాడు. చాలా స్ట్రెయిట్ ఫార్వార్డ్. సమస్యల్ని పరిష్కరించటంలో చాలా చురుకుగా ఆలోచిస్తాడు".

"అందుకే కలెక్టరయ్యాడు" అన్నాడు కౌశిక్.

అంతలో అక్కడికి శ్రీకాంత్, భరత్ కపిల వచ్చారు.

పరిచయాలయ్యాక... "శ్రీ... ఇవాళ మీతోబాటు రూంలో ఉంటాడు కౌశిక్" అంది.

"విత్‌ప్లెజర్" అన్నారిద్దరూ.

"మాధురీ! రేపు "రోల్ ఆఫ్ సివిల్ సర్వెంట్స్ ఇన్ పబ్లిక్ ఇష్యూస్" గురించి డిస్కషన్ ఉంది. నీ పేరు కూడా ఇచ్చి వస్తున్నాం" అన్నాడు భరత్.

"వెరీ ఇంట్రస్టింగ్ టాపిక్. థాంక్స్" అంది.

నల్గురూ నడుస్తూ క్యాంటీన్‌కెళ్ళారు. అక్కడ భోంచేశారు.

> ***జరిగిన కథ***
>
> **ప**క్కపక్క ఇళ్ళల్లో స్థిరపడిన స్నేహితుల పిల్లలే కౌశిక్, మాధురి. అతను బీటెక్, ఆమె మెడిసిన్. కానీ మాధురి పంతంపట్టి ఐఎఎస్ చదువుతుంది. ముస్సోరీలో శిక్షణ పొందుతున్న మాధురికి, ఐటీ ఉద్యోగి కౌశిక్‌కే వాళ్ళ పెద్దలు పెళ్ళిసన్నాహాలు చేస్తుంటారు. ఈ లోపు మాధురి ఫ్రెండ్ రూప తండ్రి వచ్చి, కౌశిక్ తన కూతుర్ని ప్రేమిస్తున్నాడనీ, వారికి పెళ్ళిచేయాలనీ అడుగుతాడు. నిజానిజాలు తేలకముందే కౌశిక్ దోషిగా మారతాడు. కౌశిక్, మాధురిల తాతయ్యలు మాత్రం ప్లాన్‌చేసి కౌశిక్‌ని ఎవరికీ తెలియకుండా ముస్సోరీకి పంపిస్తారు. **ఆ తర్వాత.....**

"ముందు స్నానం చెయ్యాలి" అన్నాడు కౌశిక్.

శ్రీకాంత్ హాస్టల్ గదికి వచ్చారు. కౌశిక్ స్నానం చెయ్యటానికెళ్ళాడు. మాధురి, శ్రీకాంత్, భరత్ కూచుని మాట్లాడుకుంటున్నారు. కౌశిక్ పది నిమిషాల తర్వాత బయటకొచ్చేసరికి... మాధురి ఒంటరిగా కూచుని మ్యాగజైన్ చూస్తోంది.

"వాళ్ళేరి?" అన్నాడు కౌశిక్ టవల్ ఆరేస్తూ.

"వెళ్ళిపోయారు... రా! కూచో".

కౌశిక్ కూచుని "ఈ వాతావరణం చాలా బాగుంది" అన్నాడు.

"అవన్నీ తర్వాత. ఇప్పుడు చెప్పు, 'నాట్‌వెల్' గురించి" అంది.

"చెప్పటం మొదలెడితే... రెండ్రోజులవుతుంది".

"ఫరవాలేదులే.. మనం హైదరాబాదెళ్ళటానికి ఇంకా 48 గంటలున్నాయి" కౌశిక్ చెప్పటం మొదలెట్టాడు.

•••

"ఏవండీ! కౌశిక్ నిన్నట్నుంచీ ఇంటికి రాలేదు" అంది శారద.

"ఫ్రెండ్స్‌తో ఉన్నాడేమో!" అన్నాడు పేపరు చూస్తున్న భాస్కర్రావు.

"ఏమో! ఫోన్ చేసినా లిఫ్ట్ చెయ్యడం లేదు" అంది.

భాస్కర్రావు తన సెల్ నుండి ఫోన్ చేశాడు. రెస్పాన్స్ లేదు.

"వస్తాడులే... చిన్నపిల్లాడు కాదుగా.. నువ్వింత భయపడటానికి"

"అసలే చికాగ్గా ఉన్నాడు. వాడి ఆఫీసుకోమారు ఫోన్ చెయ్యండి" భాస్కర్రావు ఫోన్ చెయ్యబోతుంటే... ఫోన్ మోగింది.

"హలో!"

"నమస్తే? భాస్కరన్నా! నేను భానోజీని! మంచి గున్నరా! అన్నా!" మీ అబ్బాయితోని మాట్లాడిన్రా?" అన్నాడు.

"మాట్లాడాను. వాడికా ఉద్దేశం లేదు. మాకూ ఇష్టం లేదు. ఇది ఇంతటితో ఆపేసి, మీ అమ్మాయికి వేరే సంబంధం చూసుకోండి".

"అదెట్లనే అన్నా! రాజశేఖరన్న ఫోటోలు జూపియ్యలేదె.. అయి జూసినంక గూడ గిట్ల మాట్లాడితే... ఎట్లనే".

"మావాడికి మీ అమ్మాయి మీద అలాంటి ఉద్దేశం లేదంటుంటే, బలవంతంగా ఒప్పించమంటారా?"

"బల్వంతమే జేస్తరో... బయం బెట్టి జెప్పుకుంటరో.. మాకు తెల్వదన్నా! ముహూర్తం బెట్టినంక జెప్తం. పెండ్లిపందిట్లోకి నీ కొడుకు వచ్చి వాలాలె. ఫరక్కొచ్చిందంటే... బొక్కలిరగ్గొట్టి, ఈడ్సకబోయి పెండ్లి జరిపిస్తం. సమఝ్గైందా."

"చాలా ఎక్కువగా మాట్లాడుతున్నావు. అనవసరంగా మాటలు జారొద్దు. ఈ పెళ్ళి మాత్రం జరగదు".

"ఏందన్నో... మేమేమన్నా.. చేతులకి గాజుల్దొడుక్కున్న అవులాగాల్లెక్క గన్పిస్తున్నమా! జర మా బ్యాగ్రౌండు దెల్సుకుని మాట్లాడుండ్రి".

భాస్కర్రావు ఫోన్ కట్‌చేసి సీరియస్ అయ్యాడు.

"ఎవరండీ?" శారద అడిగింది.

"ఇంకెవరు? ఆ రూప వాళ్ళ వాళ్ళు. కౌషిక్‌ని పెళ్ళికి ఒప్పించకపోతే, తన్ని తీసుకెళ్ళి తాళి కట్టిస్తారట".

"వాళ్ళంతా అన్నయ్యగారికి తెలిసిన వాళ్ళే గదా! ఇద్దరూ కలిసివెళ్ళి మాట్లాడండి"

"వాడా!? చూశావుగా! వాడి ప్రవర్తన. ఏదో మనసులో ఉంచుకుని మాట్లాడుతున్నాడు."

"అవన్నీ తర్వాత. ఈ సమస్య ముదరకముందే పరిష్కారమయ్యేలా చూడండి. ముందు రండి..." అని భర్తని రాజశేఖరం దగ్గరకి తీసుకెళ్ళింది.

భాస్కర్రావు, శారదలని చూసి... "రండి" అంది లలిత.

"రాజా ఎక్కడమ్మా!"

"పైన గదిలో ఉన్నారన్నయ్యా! పిలవనా?"

"వద్దు. నేనే వెళ్తాను" అని భాస్కర్రావు పైకెళ్ళాడు.

లలితతో వచ్చిన విషయం చెప్పింది శారద.

"కంగారుపడకండి. వాళ్ళ మొహం... వాళ్ళేం చేస్తారు. అవన్నీ ఒట్టిమాటలే" అని శారదని లోపలికి తీసుకెళ్ళింది.

భాస్కర్రావుని చూసి... "ఆc రా! రా! నేనే వద్దామనుకుంటున్నాను. నువ్వే వచ్చావు. రా! కూచో" అన్నాడు ఏవో బ్రోచర్సు చూస్తున్న రాజశేఖరం.

"ఏదైనా పనుందా? చెప్పు" అన్నాడు భాస్కర్రావు.

"తర్వాత చెప్తాలే గానీ! ఏంటి సంగతులు.. నిన్నంతా కన్పించలేదు. ఎక్కడికెళ్ళావు?" అన్నాడు రాజశేఖరం బ్రోచర్స్ చూస్తూనే...

"నేనెక్కడికీ వెళ్ళలేదు రా! నువ్వే బయటికి వెళ్ళావని చెప్పింది చెల్లెమ్మ".

"ఆc...అదీ...అదీ... ఒక్కగంట పనుండి వెళ్ళొచ్చాను" అన్నాడు తడబడుతూ.

"సరే... మళ్ళీ ఆ భానోజీ ఫోన్ చేసి... " అంతా చెప్పాడు.

"అవునట. రాత్రి నాతో కూడా మాట్లాడాడు".

"కట్టేసి, లాక్కెళ్ళి తాళి కట్టిస్తాడట.. మన గురించి తెలియనట్లే ఉంది. అనవసరంగా గొడవలెందుకని ఊర్కుంటుంటే.. రెచ్చిపోతున్నారు. అవున్రా! వాళ్ళు రాత్రి నీతో మాట్లాడితే, ఉదయం నుండీ నాతో ఎందుకు చెప్పలేదు".

"ఆc అందుకే వద్దామనుకుంటున్నా... ఇంతలో నువ్వే వచ్చావు. అసలు మనగురించి మనకే తెలియదు. ఇహ బయట వాళ్ళకేం తెలుస్తుంది" అన్నాడు రాజశేఖరం సర్కాస్టిగ్గా.

"ఒరేయ్! ఈ ముసుగులో గుద్దులాటలెందుకురా! నువ్వేం చెప్పదల్చుకున్నావో క్లియర్‌గా చెప్పెయ్" అసహనంగా అన్నాడు భాస్కర్రావు.

"ఏముందిరా! ఇందులో అర్థం కాకపోవటానికి. జరగాల్సిన డ్యామేజీ ఎలాగూ జరిగిపోయింది. కౌషిక్‌కి, రూపనిచ్చి పెళ్ళి చెయ్యటం ఉత్తమం" అన్నాడు.

"ఈ ఉచిత సలహా కోసం కాదు నేను వచ్చింది".

"ఇంత దూరం వచ్చాక.."

"ఆగిపోయావేం రా! చెప్పు... నిన్ను ఇన్నేళ్ళూ పూర్తిగా అవగాహన చేసుకునే అవకాశం కలగలేదు. నువ్వు ఆవేశపరుడివే అనుకున్నా.. కానీ ఇంత ఆలోచనా పరుడివనుకోలేదు. ఈరోజు చాలా





## అలా అడిగితే కట్ చేస్తుందట!

త్రిష నోట ఈ మాట విన్నవారు చాలా మంది ఆశ్చర్యపోయారు. అయితే ఇందులో విపరీతార్థమేమీ లేదు అంటున్నారు త్రిష సన్నిహితులు. త్రిష పెళ్ళి పీటలదాకావచ్చి ఆగిపోవడంతో ఆమెస్నేహితులు చాలామంది పెళ్ళెప్పుడు? అంటూ అడుగుతున్నారట! సమాధానం చెప్పకుండా త్రిష మౌనంగా ఉన్నాగానీ, రెట్టించి అడుగుతున్నారట! దాంతో, ఇంకోసారి అలాంటి ప్రశ్నలు అడిగితే వారితో స్నేహం కట్ చేస్తానని బెదిరించిందట! అదీ సంగతి.

వ్యత్యాసంగా కన్పిస్తున్నావు".

"నువ్వు నన్ను పొరబాటుగా అర్థం చేసుకుంటున్నావు గానీ కళ్ళెదుట కన్పిస్తున్న వాస్తవాల్ని అంగీకరించలేకపోతున్నావు".

"అవున్రా! నువ్వు చెప్పావుగా! ఇప్పట్నుంచీ నువ్వు చెప్పినట్టే కన్పించే వాటినే నమ్మటం నేర్చుకుంటా! తారతమ్యాలు మరచి నువ్వు వాస్తవాలు మాట్లాడుతుంటే.. ఇహ నుండి ఎలా ఉండాలో నీ నుండే నేర్చుకుంటా!" అని భాస్కర్రావు లేచెళ్తుంటే...

వెంటనే.. 'ఏమిట్రా! మధ్యలోనే లేచెళ్తున్నావు?" అన్నాడు రాజశేఖరం.

"చివరిదాకా కొనసాగని వాటిని పట్టుకుని ప్రాకులాడటం అనవసరమని".

"అర్థంగాలేదు".

"ఆలోచించు. నీకు అర్థం గానంత గొప్ప విషయమేమీ కాదులే'

"ఈ పెళ్ళి జరగనంత మాత్రాన.."

"ఏమవుతుందిరా! ఎవరు ఏమైపోతే నీకెందుకు? నీ పంతం, పట్టుదల, మిలిట్రీ రూల్సు... వాటికి భంగం కలగకుండా కాపాడుకో. నిజానిజాలు తెల్సుకోకుండా కౌషిక్‌ని ఇష్టమొచ్చినట్టన్నావు. వాడు ఇంటికొచ్చి రెండు రోజులైంది".

"అలాగా!? ఇంత ఆలస్యంగా చెబుతావేంట్రా? ఆఫీసులో కాంటాక్ట్ చేశావా? ఫోన్ చేశావా?" కంగారుగా అడిగాడు రాజశేఖరం.

"థాంక్స్! ఫర్ యువర్ కన్సర్న్" అని భాస్కర్రావు వేగంగా వెళ్తుంటే...

"ఒరేయ్! భాస్కర్! ఆగరా!" అంటూ రాజశేఖరం కిందికి దిగొచ్చేసరికి వెళ్ళిపోయాడు.

అక్కడే నిలబడి చూస్తున్న భార్యతో....

"అసలు ఇందులో నా తప్పేముంది. నేనేదో తప్పు చేసినట్టు వాడి ఫీలింగ్" అన్నాడు విసుగ్గా.

"నీకు తప్ప ఇంట్లో అందరికీ అదే ఫీలింగ్" గొణిగాడు సుందర్రామయ్య.

గంగ అక్కడికి వచ్చి సుందర్రామయ్యతో....

"అయ్యగారూ! అయ్యగారూ! మిమ్మల్ని ఆ తాతగారు రమ్మంటున్నారండీ!" అన్చెప్పింది.

"నేను రానన్నానని చెప్పు. మాకు, మా మనవరాలికి వాడి మనవడు చేసిన శాస్తి చాలని చెప్పు. రానన్నానని వెళ్ళి చెప్పు" కొడుక్కి విన్పించాలని హాల్లో నుంచే పెద్దగా అన్నాడు సుందర్రామయ్య.

అసలే చిరాగ్గా ఉన్న రాజశేఖరానికి తండ్రి మాటలు చిర్రెత్తించాయి. "లలితా! త్వరగా టిఫిన్ పెట్టు! బయటికెళ్ళాలి." అంతలో గోవిందు వచ్చి,

"అమ్మా! ఆ అమ్మగారు మీకిది ఇచ్చి రమ్మన్నారు" అని హాట్‌ప్యాక్ ఇవ్వబోయాడు.

"ఆగు! ఏంటది?" అంది లలిత.

"పెసరట్లు, ఉప్మా, అల్లం చట్నీ, కొబ్బరి చట్నీ అంటండి" అన్నాడు.

"దీనిని ముందు తీసుకెళ్ళి ఆవిడకే ఇవ్వు. నాకూ టిఫిన్లు చెయ్యటం వచ్చనీ, కావలిస్తే వాళ్ళనే తినడానికి రమ్మని చెప్పు" అని తిప్పి పంపింది.

శారద చేసే పెసరట్లని, ఉప్మా కాంబినేషన్‌ని ఆస్వాదించి తినే రాజశేఖరానికి లలిత వాటిని తిప్పి పంపటం ఆ సమయంలో నచ్చలేదు.

"ఏమిటి? లలితా? ఏమైంది నీకు? అC ఎందుకు వెనక్కి పంపావు?"

"ఏమీ కాకూడదనే నండీ! కౌషిక్ ఇలాంటి వాడని తెల్సాక, వాళ్ళకీ, మనకీ నడుస్తున్న ఈ గొడవలు, మనస్పర్థల మధ్య ఈ రాయబారాలు ఎందుకు చెప్పండి? మనసుల్లో ఇంత ఉంచుకుని, ఈ పై పై మెహర్బానీలెందుకు?"

"ఎన్నడూ అలా మాట్లాడని భార్యని కొత్తగా చూస్తున్న భర్తతో..."

"ఆకలిగా ఉందన్నారుగా.. ఇదుగో చిటికెలో ఉప్మాచేసి పెడతా?" అంటూ కిచెన్లోకెళ్ళింది లలిత.

నోరూరించే పెసరట్లకి బదులు, ఇష్టంలేని ఉప్మా తినాల్సొచ్చేసరికి, ఇంట్లో తనకి తెలీకుండా ఏదో మార్పు చోటు చేసుకుంటోందనుకుని... ఆలోచిస్తూ... సగం తిని చెయ్యి కడిగి లేచెళ్ళాడు. బయటకెళ్ళడానికి తయారవుతున్న రాజశేఖరం సెల్‌కి డాక్టర్ చంద్రమౌళి నుండి ఫోనొచ్చింది. మాట్లాడి, తనే వస్తున్నట్టు చెప్పి బయల్దేరాడు.

•••

"ఏరా! రమ్మంటే ఫోజు కొడ్తున్నావటేంటి?" అన్నాడు లోపలికొచ్చిన గోపాలకృష్ణయ్య.

"కొట్టాలిరా! ఇప్పుడు కాకపోతే.. మళ్ళీ మనకి ఛాన్సురాదు. రా! అలా బయట కూచుందాం".

ఇద్దరూ బయట లాన్‌లో బెంచీమీద కూచున్నారు.

"మా వాడికి ఇంట్లో ట్రీట్‌మెంట్ మొదలెట్టాం. మింగలేక, కక్కలేక బయటికెళ్ళిపోయాడు" అన్నాడు సుందర్రామయ్య.

"మాధురి వస్తే అన్నీ అవే సర్దుకుంటాయిరా! ఇంకెంత... రెండ్రోజులు".

"అవున్రా! ఆ హన్మకొండ వాళ్ళ రుబాబేంట్రా! కౌషిక్‌ని తన్ని లాక్కెళ్తామంటున్నారు. వాళ్ళకి మన భాస్కర్రావు సత్తా తెలియదల్లే ఉంది" అన్నాడు సుందర్రామయ్య.

"అసలు నాయకా, నాయికలు గట్టిగా వాటేసుకుంటే, విడదీసే దమ్మెవరికుంటుందిరా?"

"ఏమోరా! ఏ గొడవలూ లేకుండా పెళ్ళి జరిగిపోతే బావుంటుంది".

"అవన్నీ అటుంచరా! నువ్వు నాతో మాట్లాడి సరిగ్గా 12 గంటలు దాటింది. తెలుసా?" అన్నాడు గోపాలకృష్ణయ్య నిష్టూరంగా.

"అవసరమైతే.. బద్ధశత్రువులం కూడా కావాలిరా!"

"అలాంటి మాటలు చతురుకి కూడా అనకురా! తథాస్తు దేవతలుంటారు. ఇవ్వాళ్టిది కాదురా! మన అనుబంధం" అన్నాడు గోపాలకృష్ణయ్య ఒకలా.

"ఆహా! ఆ విషయం నాకు తెలియదటరా! సెంటిమెంట్లు పక్కనబెట్టి, ఈ మ్యారేజ్ మేటర్ సెటిల్ చెయ్యాలిరా మనం.. రా! మీ ఇంటికెళ్దాం. శారద పెసరట్లు చేసినట్టుంది. మా ఇంటికి పంపితే, లలిత తిప్పి పంపింది".

"అది చూసే... ఇద్దరం కల్సి తిందామని నీకోసం వచ్చానోయ్! రా వెళ్దాం" అన్నాడు గోపాలకృష్ణయ్య, "నీ మనసు నాకు తెల్సురా!" అని భుజం మీద చెయ్యేసి బయల్దేరాడు సుందర్రామయ్య.

•••

కౌషిక్ చెప్పిందంతా విని మౌనంగా కూచున్న మాధురివైపు కంగారుగా చూస్తూ... "ఏంటి! అంకుల్‌లా నువ్వూ నమ్మేస్తున్నావా?" అన్నాడు.

"అవును.. ఫైర్ లేకుండా స్మోక్ రాదుగా! ఐయాం సారీ! వేవరింగ్ టెండెన్సీ నాకు నచ్చదు. నీకు రూపే యాప్ట్" అంది సీరియస్‌గా.

"అంటే... నువ్వు కూడా!?!" నీళ్ళలో మునిగిపోతున్నట్టు అమాయకంగా అన్నాడు.

"నేనే కాదు.. నా స్థానంలో ఎవరున్నా అనుకుంటారు. అంటారు. కానీ నేను మాత్రం 'అనను'. ఎందుకంటే 'ఐ నో యూ ఫ్రం చైల్డ్‌హుడ్' 'ఐ నో

**రూప తండ్రి రంగప్రవేశంతో భాస్కర్రావు, రాజశేఖరం స్నేహబంధం బీటలువారింది. వారిమధ్య అనుబంధం ఎడమొగం పెడమొగం స్థాయికెళ్ళడం మొదలైంది. వ్యాపార బంధాన్ని కూడా కట్‌చేసుకునే స్థాయికి వచ్చారిద్దరూ. మరోవైపు కౌషిక్ మున్నార్ వెళ్ళి మాధురికి జరిగిందంతా చెప్పి తన ప్రేమను వ్యక్తీకరించాడు. ఇంకోవైపు రాజేష్ రూప ఇంటికివెళ్ళి ఆమెకు షాకిచ్చాడు. ఏమిటా షాక్?**

షై కౌషిక్..." అంది ఎగ్జైటింగ్‌గా.

అంతే! ఆమె చేతిని తీసుకుని గట్టిగా ముద్దు పెట్టి... "థాంక్యూ! నువ్వు నమ్మవనే నమ్మకంతోనే ఇంతదూరం వచ్చాను" అన్నాడు.

"నాకు నువ్వేంటో తెల్సు. నీకు నేనేంటో తెల్సుగానీ.. అబ్బ! వినీవినీ మైండ్ మొద్దుబారింది. త్వరగా తయారవ్వు. నేనూ తయారవుతాను. సైట్ సీయింగ్‌కి వెళ్దాం" అంది.

కౌషిక్ 'అలానే' అన్నట్టు వెంటనే లేచెళ్ళాడు.

సాయంత్రం నాలుగు నుండి రెండు గంటలు బయట గడిపారు.

"మధూ! నువ్వు నీ షెడ్యూల్ ప్రకారం వచ్చెయ్. నేను మార్నింగ్ వెళ్ళిపోతాను" అన్నాడు టీ తాగుతూ.

"కల్సి వెళ్దాం. ఇంకెంత... 48 గంటలేగా!"

"నేను రేపు ఢిల్లీ ఆఫీసులో ఉండాలి. ఎల్లుండి హైదరాబాద్‌లో రిపోర్టు చెయ్యాలి."

"అంటే ఆఫీసు పనిమీద వచ్చావన్న మాట.. నాకోసం కాదా?" అంది వ్యంగ్యంగా.

"హూఁ... నేను కాకపోతే మరెవర్నైనా పంపే వాళ్ళు. నేనే కావాలని ఎందుకొచ్చానంటావ్.. కేవలం నీకోసం... నిన్ను కలవడం కోసం... నా బాధ నీతో పంచుకోవడం కోసం.. నీ ఇష్టం... నమ్మకపోతే.. ఐకాంట్.."

"ఛ! ఊర్కెనే అన్నాన్లే.. మరీ ఫీలవకు. ఫీలింగ్సన్నీ ఫేస్‌లోనే తెల్సిపోతున్నాయి" అంది.

"ఊ..... ఇంకా?" అన్నాడు మాధురి కళ్ళలోకి చూస్తూ.

"అలా చూడకు. నువ్వు రేపుంటే... ఇక్కడ సైట్ సీయింగ్ ప్లేసెస్‌కి తీసుకెళ్తాను. కెమ్టీఫాల్స్, శాంక్చురీ, భాట్టా ఫాల్స్, హ్యాపీవ్యాలీ... అన్నీ బాగుంటాయి. లవర్స్ హెవెన్‌లా ఉంటాయి".

"అన్నీ చూశావా?"

"ఆఁ..."

"అయితే నేనూ చూసినట్టే... ఇంకోసారి చూద్దాం" అన్నాడు.

"అసలు 'నేను' అని ఎప్పుడూ ఆలోచించు కోవా? ఎప్పుడూ 'మన' అనే ఆలోచిస్తావా? నీ గురించి నువ్వు ఆలోచించుకోకపోతే, ఎవరు ఆలోచిస్తారు?"

"అందుకు నువ్వున్నావుగా మ్యాడీ!"

"రేయ్! కౌషిక్! నీ అల్లరి చిన్నప్పట్నుంచీ భరించి, భరించి విసుగెత్తిపోయాను. ఎన్నోసార్లు నిన్ను ఇరిటేట్ కూడా చేశాను. కానీ ఇప్పుడు ఆ అల్లరివెనక దాగున్న 'అనుబంధం', నువ్వు నా మీద పెంచుకున్న ప్రేమ చూస్తుంటే... ఇప్పుడు ఎప్పుడెప్పుడు అల్లరి చేస్తావా.. అని ఎదురు చూస్తున్నాను".

"అమ్మో! సెంటిమెంట్లు పెంచెయ్యకే బాబూ! ఎక్కువైతే ఇక్కడే ఉండి పోవాలన్పిస్తుంది".

"అంతకన్నానా!... అయితే ఉండిపో... ఇద్దరం కల్సెళ్దాం ప్లీజ్".

"వద్దు మధూ! నేను ముందెళ్తాను. నువ్వు నీ షెడ్యూల్ ప్రకారం వచ్చెయ్" అన్నాడు.

ఆ రాత్రి హాస్టల్‌లో పడుకుని... మాధురి.. కౌషిక్ గురించి, శ్రీకాంత్ రూమ్‌లో పడుకుని కౌషిక్.. మాధురి గురించి ఆలోచిస్తూనే ఉన్నారు.

●●●

టైము మధ్యాహ్నం పన్నెండైంది. నిమ్స్ హాస్పిటల్ ఆర్థోపెడిక్ ఒ.పి.లో పేషంట్లని చూస్తున్నాడు డాక్టర్ రాజేష్. అతని జేబులో ఉన్న సెల్ ఫోన్ వైబ్రేట్ అవుతుంటే... ఎదురుగా ఉన్న సీనియర్ డాక్టర్‌కి చెప్పి, బయటికొచ్చి 'హలో' అన్నాడు. అవతలివైపు గొంతు విని ఆశ్చర్యాన్నంతా గొంతులో పలికిస్తూ... "వాటె సర్‌ప్రైజ్" అన్నాడు రాజేష్.

"ఎప్పుడు ఫ్రీ అవుతావు?"

"ఇంకో అరగంటలో... నాతో ఏమైనా పనుందా?"

"అవును. చాలా ముఖ్యమైన పనుంది. మళ్ళీ నేనే నిన్ను కాంటాక్ట్ చేస్తాను".

●●●

సాయంత్రం ఐదు గంటలకి విద్యానగర్‌లో ఇంటిముందాగిన కారుని, కారు దిగి లోపలికి వస్తున్న అపరిచితుణ్ణి చూసి "ఎవరు కావాలండీ" అన్నాడో వ్యక్తి.

"డాక్టర్ రూప".

"రండి కూచోండి! పిలుస్తా!"

లోపల్నుంచి ఐదు నిమిషాల తర్వాత బయటి కొచ్చింది రూప.

కుర్చీలో కూచున్న రాజేష్ వైపు ఆశ్చర్యంగా చూసి...

## మనమీదేనర్రోయ్!

సరసి





"రాజేష్! ఏంటిరా? ఇల్లెలా తెల్సింది?" అంది.

"గూగుల్‌లో చూశాను".

తనూ వచ్చి అతనికెదురుగా కూచుని, "ఏం తీసుకుంటావ్? కాఫీ, టీ..." అంది.

"రెండూ మిక్స్ చేసివ్వు".

సర్వెంట్ రెండు కాఫీలు తెచ్చి టీపాయ్ మీద పెట్టాడు.

"ఏంటి రూపా! ఈరోజు డ్యూటీ లేదా? లీవులో హన్మకొండ వెళ్ళావని... మీ కొలీగ్ శేఖర్‌కి ఫోన్ చేస్తే చెప్పాడు?".

"అవును. వెళ్దామనుకునే లీవు పెట్టాను. కానీ... వెళ్ళలా!"

తాగిన కాఫీ కప్పు టీపాయ్ మీద పెట్టి, "బయటికెళ్దామా? నీతో మాట్లాడాలి" అన్నాడు.

"దేని గురించి?"

"పర్సనల్".

"మా డాడీ వాళ్ళొచ్చారు.. బయట షాపింగ్‌కెళ్ళాలి".

"అయితే ఇంకా మంచిది.. మనం హన్మకొండ వెళ్ళే పని తప్పింది".




"ఎందుకు?" అంది భృకుటి ముడిచి.

"ఎందుకంటావేంటి రూపా...! మన పెళ్ళి విషయం మాట్లాడటానికి".

"మన పె...ళ్ళా...!" అంది ముఖం చిట్లించి.

"యస్... అవును.. మన పెళ్ళే".

"ఎక్కువగా ఆశలు పెంచుకోకు రాజేష్".

"నన్నూ తక్కువ అంచనా వెయ్యకు రూపా!"

"వాడ్డూ యూ మీన్"

"వాట్ ఐ మీన్ ఈజ్.." అని కవర్లో ఉన్న ఫోటోలు తీసి ఆమె ముందు పడేశాడు.

వాటిని చేతుల్లోకి తీసుకుని చూడసాగింది రూప.

'రాజేష్, రూప మెడికోలుగా ఉన్నప్పుడు ఆమెకి కేక్ తినిపిస్తున్నట్టు. ఒకే ప్లేటులో కల్సి తింటున్నట్టు, హగ్ చేసుకున్నవి, హోలీరంగులు ఒకళ్ళకొకళ్ళు పూసుకుంటున్నట్టు... ఇంకా.. ఇంకా ఎన్నో భంగిమల్లో..' అన్నీ అసహనంగా చూసి... రాజేష్‌ని చూస్తూ,

"కంప్యూటర్ గ్రాఫిక్స్ బాగున్నాయి" అంది వ్యంగ్యంగా..

"అవన్నీ మామూలువీ.. వాటిని వదిలేసి వీటిని చూడు.." ఇవి "మనిద్దరి పర్సనల్" అని మరో కవర్లో ఉన్న ఫోటోలు తీసి చూపించాడు.

చూసి దిగ్భ్రాంతిగా మొహంపెట్టి, "ఏంటీ బ్లాక్‌మెయిలా? మా వాళ్ళ సంగతి నీకు తెలియదు" అంది.

"హలో!... మీ వాళ్ళగురించి మహా తెలిస్తే మీ ఊళ్ళో, చుట్టుపక్కల తెలుస్తుంది. కానీ.. మా వాళ్ళ పేరు చెబితే చాలు.. ఆంధ్రప్రదేశ్ మారుమూల గ్రామంలో కూడా... లేచి నిలబడతారు. బొబ్బిలి విన్నావు గదా.. వేలడుగు రంగారావు గారు, మాజీ మంత్రి.. మా నాన్నే..

రాజేష్ తీవ్రంగా మాట్లాడుతుంటే రూప మొహంలో రంగులు మారసాగాయి. వెంటనే అమాయకంగా మొహం పెట్టి...

"అసలెప్పుడైనా నేను నిన్ను పెళ్ళిచేసుకుంటానని చెప్పానా!?" అంది. మరి నాల్గేళ్ళు నా వెంటెందుకు పడ్డావు? ఎందుకు ప్రేమించావు? మనిద్దరం ఏ రేంజ్‌లో కల్సి తిరిగిందీ... మెడికల్ కాలేజ్ మొత్తానికీ తెల్సు. మా ఇంట్లో కూడా నీ గురించి తెలుసు. నేను నిన్ను వాడుకుని వదిలేద్దామనుకుంటే.. ఏనాడో నీకు గుడ్‌బై కొట్టేసేవాణ్ణి. కానీ నేను అప్పుడు చెయ్యాల్సిన పని, నువ్విప్పుడు చేస్తున్నట్టుంది. ఈ మధ్య నువ్వు నన్నెందుకు అవాయిడ్ చేస్తున్నావో అర్థం కాలేదు. మీ ఇంట్లో వాళ్ళు ఒప్పుకోవటం లేదని నింద మీ వాళ్ళపై మోపి, నువ్వు అతి తెలివిగా మరొకళ్ళకి వల విసురుతున్నావని తెలిసి, తేల్చుకుందామని వచ్చాను".

"సో! తెల్సిందిగా.. నీ స్థానమేమిటో!... మళ్ళీ నా వెంట పడటానికి.."

"సిగ్గు లేదా? అంటావు. లేదు.. నువ్వు మాధురిని, కౌషిక్‌ని విడదీయటానికి సిగ్గు వదిలేసి కౌషిక్ వెంట పడుతుంటే.. నిన్ను ప్రేమించిన నాకెందుకు సిగ్గు".

"ఓహో! మేటరు నీదాకా వచ్చిందా? మాధురి చెప్పిందా?" అంది రూప.

"మాధురి దగ్గర పర్మిషన్ తీసుకునే నా వెంటబడ్డావా? మాధురిని అడిగీ.. కౌషిక్ వెంటబడుతున్నావా?"

"రాజేష్! ఇక్కడ ఇవన్నీ వద్దు. ఇది మా కజిన్ వాళ్ళిల్లు. వాళ్ళంతా వింటే బావుండదు. నేను నీతో తర్వాత మాట్లాడతాను. ప్లీజ్... వెళ్ళు..."

"నువ్వు నాతో వస్తే... ఇద్దరం కలిసి బయటికెళ్ళి మాట్లాడుకుందాం... లేదంటే ఎలాగూ మీ పేరెంట్స్ వచ్చారన్నావుగా! వాళ్ళని రానీ.. వచ్చాక మాట్లాడి వెళతా!" అన్నాడు కూచున్న చోటు నుంచి కదలకుండా.

"అంటే... నువ్విప్పుడు మాధురి తరపున రాయబారానికొచ్చావా."

"చూడు... మన ప్రేమ ఫెయిలైనా పరవాలేదు. మానసికంగా, శారీరకంగా మనం ఏనాడో మలిన పడ్డాం. యూ ఆర్ మై ఫస్ట్‌లవ్. నువ్వూ అలాగే అనుకున్నా.. కాదని నిరూపించావు. అయితే 'నా' అనుకున్న 'నువ్వు' మరొకరి జీవితంతో ఆటలాడుకుంటానంటే.. నిన్ను కన్న తల్లిదండ్రులు అంగీకరించినా, నేను మాత్రం చూస్తూ ఊర్కోను".

అంతే! రాజేష్ గొంతు తీవ్రత, పట్టుదల బాగా తెల్సిన రూప అభ్యర్థనగా "వద్దు రాజేష్! దయచేసి ఇక్కడ గొడవ చెయ్యొద్దు. మా కజిన్ వచ్చే టైమైంది. రేపు మాట్లాడుకుందాం" అంది గుమ్మం వైపు చూస్తూ.

"నేను పెళ్ళి చేసుకుంటానంటే... మా ఇంట్లోవాళ్ళు రేపేపాటికి చేసేస్తారు. వేరేవాళ్ళతో కాదు నీతోనే."

"ప్లీజ్ రాజేష్! రేపు కలుస్తానన్నాగా! వెళ్ళు.." తొందర చేసింది.

"ఎక్కడ కలుద్దాం".

"మనం ఎప్పుడూ కలిసే స్పాటే" అంది కంగారుగా.

"ఓకే. హ్యాండియ్యవుగా" అని లేచి రాజేష్ బయటికి రాగానే... బదులు చెప్పకుండా ధన్‌మని తలుపు మూసింది రూప.

●●●

మల్లేష్ యాదవ్ మీద వేసిన కోర్టు వాయిదాకి అటెండ్ అవటానికి భాస్కర్రావు, లాయర్‌తో కలిసి నాంపల్లి కోర్టుకు వచ్చాడు. లాయర్ లోపలికెళ్ళాడు. ఇంకా తనని పిలవక పోవటంతో, భాస్కర్రావు బెంచీమీద కూచున్నాడు. ఫోన్ రింగయ్యేసరికి... 'హలో' అన్నాడు.

"ఒరేయ్! ఎక్కడున్నావురా!" అవతల్నుంచి రాజశేఖరం.

"కోర్టు దగ్గర".

"ఇంటికి ఎంతసేపట్లో వస్తావు?"

"ఏమైనా పనుందా?"

"పనంటే... ఎలా చెప్పాలి... అదీ.. అదీ.." నానుస్తూ మాట్లాడాడు రాజశేఖరం.

"పర్లేదు చెప్పు".

"అదీ... అది... మనం కలిసి హాస్పిటల్ కడదామని డిపాజిట్ చేసిన పది లక్షల్ని నేను వేరే చోట ఇన్వెస్ట్ చేద్దామనుకుంటున్నాను. అందుకని ఆ డబ్బు..."

"వెనక్కి తీసేసుకుంటావా?"

"ఆc... అదే.."

"సాయంత్రానికి ఏర్పాటు చేస్తాను" అని ఫోనాఫ్ చేసిన భాస్కర్రావు రాజశేఖరం చెప్పిన దాన్ని జీర్ణించుకోలేకపోయాడు.

**(ఇంకావుంది)**



# పండగ చేస్కో!

**మన సంప్రదాయాలలో ఒక్కో పండగదీ ఒక్కోరకం ప్రత్యేకత. మొన్నే దసరా పండగ జరిగింది. దీపావళి వేడుకలూ పూర్తయ్యాయి. ఇక కార్తీకమాసం, ధనుర్మాసం, సంక్రాంతి ఇలా పెద్ద పెద్ద పండగలన్నీ మనముందున్నాయి.**

పండగ అంటే కలిసి మెలిసి ఉండటం. ఆత్మీయతల్ని, అనుభూతులను కలబోసుకోవడం. బోలెడంత ఆనందం, మధుర జ్ఞాపకాలు మూట కట్టుకోవడం.

అయితే ఇవాళరేపు ఉద్యోగరీత్యానో లేక ఇతర కారణాల వల్లనో ఉన్న ఊరుకు, సొంతింటికి దూరమవుతున్నారు కుటుంబ సభ్యులు. కలిసి ఆనందంగా చేసుకోవాల్సిన పండగలను ఒక్కొక్కసారి ఒంటరిగానో, బంధువులకు దూరంగానో చేసుకోవాల్సి వస్తోంది. మరచిపోయిన మనవాళ్ళనూ, మన మట్టి విలువల్నీ, ఆత్మీయతల్నీ మన ఊరినీ రీడిస్కవర్ చేయడమే ఇప్పుడు పండగ అంటే!

పండగనాడు అందరికీ దూరంగా గడపాల్సి రావడం ఎంతో ఆవేదన కలిగిస్తుంది. ఉన్నఊళ్ళో మిత్రులు, బంధువుల పలకరింపులు, పండగ పూజలు, తల్లిదండ్రుల ఆప్యాయతలు, పిండి వంటల ఘుమఘుమలూ... ఇలా మరపురాని మధురానుభూతులెన్నో దూరమైపోతాయన్నది అందరూ అంగీకరించవల్సిందే. కలిసి ఉంటే కలదు సుఖం అని పెద్దలు ఏనాడో చెప్పారు. నేడు పరిశోధనాత్మకంగా వెలువడే కొన్ని సర్వేలు కూడా అదే విషయం వెల్లడిస్తున్నాయి. పండగలవల్ల మన అనుబంధాలు ఎలా రెట్టింపు ఇనుమడిస్తాయో, ఏవిధంగా ఆ అనుబంధాలను పటిష్టంగా నిలబెట్టుకోవచ్చునో తెలుసుకుందాం..కుదిరితే అలా జరుపుకోవడానికి ప్రయత్నిద్దాం.

## వీలు కుదుర్చుకోండి

మొన్నటికాలం వరకు పండగంటే అందరూ కలిసి చుట్టాల ఇళ్ళకు వెళ్ళడం లేదా వారే మన ఇంటికి రావడం ఆనందంగా జరుపుకోవడమే పండగలా ఉండేది. ఇప్పుడా పద్ధతి చాలామటుకు తగ్గిందనే చెప్పవచ్చు. కొందరు వాటిని పాటించినా ఏదో ఆదరాబాదరాగా ఏదో పేరుకు పండగ జరుపుకున్నాం అన్నట్టుగా వచ్చి ఎవరి దారిన వారు వెళ్ళిపోతున్నారు. దీనివల్ల సరదా, సందడీ ఏం ఉంటుందండీ! కాబట్టి పండగ పేరిట కనీసం రెండురోజుల ముందు, రెండు రోజుల తర్వాత ఉన్న ఊళ్ళోనే గడిపేందుకు ముందుగా ప్రణాళిక రూపొందించుకోవాలి.

ఊరంతా కలియదిరుగుతూ ఆత్మీయుల్ని, ఆత్మీయతల్ని కలబోసుకోవాలి. కనీసం సంవత్సరంలో ఒక్క పండగకైనా ఇలా సరదాగా గడిపేలా ప్లాన్ చేసుకుంటే బాగుంటుంది. మనూళ్ళో అరమరికలు లేని పలకరింపులతో, ఆప్యాయతల్ని పంచుకోవడం గొప్ప అనుభూతి. ఆ గడిపిన క్షణాలు ఎప్పటికీ గుర్తుండేవే. అబ్బ మళ్ళీ మళ్ళీ ఇలాగే అందరం కలిసి గడిపితే ఎంత బాగుంటుందో అనే భావన మనలో ఖచ్చితంగా ఏర్పడుతుంది.

## ఒత్తిడి నుంచి ఉపశమనం

బంధువులంతా ఒకచోట కలిస్తే అసలు టైమే తెలియదు. అందరితో కలిసి పాటకచేరీలు, డాన్స్‌లు ఆటపాటలతో గడిపేస్తే ఎంత ఆనందంగా ఉంటుందో కదా! ఆ విషయం తలుచుకున్నప్పుడు, అవును నిజం అనిపిస్తుంది కదా... పండగ పనుల హడావిడిలో అందరూ అలసిపోవడం సహజమేకానీ ఈ ఒత్తిళ్ళ నుంచి ఉపశమనం కలిగించేది వారితో సరదాగా చెప్పుకునే కబుర్లే. సరదా సరదాగా చేసే సందడే. ఇలా అందరూ కలిసినప్పుడు సరదాగా గడిపిన క్షణాలు అందరి హృదయాలలో పదిలంగా ఉండటంతో పాటు వారి మధ్య అనురాగం, అనుబంధం మరింత దృఢమవుతాయనడంలో సందేహమేమీ అక్కర్లేదు.

## వనభోజనాలు

కార్తీకమాసంలో చాలామంది వనభోజనాలకు వెళుతుంటారు. కొందరు కేవలం ఫ్యామిలీ తోనే వెళతారు. ఇలా కాకుండా ఈసారి బంధుమిత్రులతో కలిసి వెళ్ళేలా ప్లాన్ చేసుకోండి. ఒకవేళ మీరు పండగ ఇంట్లో జరుపుకున్నా కుటుంబ సభ్యులతో కలిసి వెళ్ళే ఇలాంటి ట్రిప్పులు కూడా ఆహ్లాదం కలిగిస్తాయి. అందుకోసం ఏదైనా మంచి పర్యాటక ప్రదేశం ఎంచుకుని వెళ్తే మరింత వెరైటీగా ఉంటుంది. ఆహ్లాదకరమైన వాతావరణంలో కూర్చుని కష్టసుఖాలు పంచుకోవడం, కలసిమెలసి భోజనం చేయడం, వడ్డించడం, రకరకాల పోటీలు బహుమతులు అందజేయడం వంటివి చేస్తే చాలా సరదాగా ఉంటుంది. దానివల్ల మానసిక ఒత్తిళ్ళు మాయమవడం ఖాయం.

**- నివేదిత**








**శీలపరీక్ష ఎదుర్కొనేందుకు సీత అగ్నిగుండంలోనికి ప్రవేశించింది. ఆ దృశ్యాన్ని చూసి లోకాలన్నీ చీకాకయ్యాయి. రాముడు కూడా తల్లడిల్లి కన్నీరుపెట్టుకున్నాడు. అతడు అలా బాధపడడాన్ని దేవతాసమూహం తట్టుకోలేకపోయింది. భయపడింది. పరుగున వచ్చి అతని ముందు నిలిచింది. రాముడి జన్మరహస్యాన్ని తెలియజేసింది. సీతమ్మ సాక్షాత్తూ లోకమాత లక్ష్మీదేవి అని కూడా తెలిపింది. అంతలో సీతతో పాటుగా అగ్నిదేవుడు సాక్షాత్కరించాడక్కడ. సీతలో ఎలాంటిదోషమూ లేదనీ, ఆమె పరిశుద్ధురాలని తెలియజేశాడు. సీతను స్వీకరించాల్సిందిగా రాముణ్ణి వేడుకున్నాడు.**

# సీతను స్వీకరించిన రాముడు:సుగ్రీవాదుల పయనం

అగ్నిదేవుని వేడుకోలుకి ఆనందించాడు రాముడు. గట్టిగా కళ్ళు మూసుకున్నాడు. ఆనందాశ్రువులు రాల్చాడు. కళ్ళు తెరచి ఎదురుగా ఉన్న బ్రహ్మాదిదేవతలను చూశాడు. అన్నాడిలా.

"మహానుభావులారా! సీత పరిశుద్ధురాలు అన్న మాట నిజమే! కాకపోతే సంవత్సరంపాటు ఆమె రావణాంతఃపురంలో ఉన్నది. శీలపరీక్ష చేయకుండా నేను ఆమెను స్వీకరిస్తే లోకులు అనేకంగా నన్ను అనుమానిస్తారు. నిగ్రహం లేనివాడనీ, కాముకుడనే ప్రమాదం ఉంది. అందుకే భయపడ్డాను. సీత శీలవతి అనీ తెలుసు. పతివ్రత అనీ తెలుసు. అయినా శీలపరీక్షకు వెనుకాడలేదు."

స్వామీ అని కళ్ళు మూసుకుంది సీత. ఆనందాశ్రువులు రాల్చింది. కళ్ళు తెరచింది. రాముణ్ణి చూసి చేతులు జోడించి నమస్కరించింది.

"పాతివ్రత్యబలంతో సీత, తనని తాను కాపాడుకోవడమే కాదు, రావణుణ్ణి కూడా కట్టడి చేయగలదని తెలుసు. నాకు దూరంగా నిలబడి, పచ్చి మంచినీళ్ళు కూడా ముట్టని ఈ సీత, అంతఃపురసుఖాల్ని ఆశిస్తుందని నేనెందుకు భావిస్తాను? పరమపావనులు మీరంతా సీత సాధ్వి అనీ, పరిశుద్ధురాలని కీర్తిస్తుంటే మహదానందంగా ఉంది. ఈ మహాభాగను విడచి నేనిక క్షణం కూడా జీవించలేను." అన్నాడు రాముడు. చేయిజాచాడు. ఆ చేతిని సీత అందుకున్నది. రామునికి సమీపంగా వచ్చి నిలిచింది. ఆమెను దగ్గరగా తీసుకున్నాడు రాముడు. ఆ దృశ్యాన్ని అక్కడ ఉన్న వారంతా కనులపండువగా చూశారు. ఆనందాతిశయంతో కరతాళధ్వనులు చేశారు.

"రామా! అవిశ్రాంతంగా దుష్టశిక్షణచేసి అలసిపోయావు. ఇకపై సుఖించు. అయోధ్యకు బయల్దేరు. నీకోసం ఎదురు చూస్తున్న భరతుణ్ణీ, నీ తల్లుల్నీ సంతోషపెట్టు. పట్టాభిషిక్తుడివై చిరకాలం పాలించు." అన్నాడు శివుడు.

పట్టాభిషేకం అనగానే తండ్రి గుర్తొచ్చాడు. దశరథుణ్ణి తలచుకున్నాడు రాముడు. బాధగా నిట్టూర్చాడు. గమనించాడది శివుడు. సన్నగా నవ్వి అన్నాడిలా.

"రామా! నీకు నీ తండ్రిని చూడాలనిపిస్తున్నదా? ఆయనతో మాట్లాడాలనిపిస్తున్నదా? అయితే అటు చూడు."

చూశాడటు రాముడు.

"భూలోకంలో నీకు జనకుడై ఇప్పుడు స్వర్గ సౌఖ్యాలు అనుభవిస్తున్న నీ తండ్రి దశరథుడు అడుగో! నిన్నూ, సీతనూ, లక్ష్మణుణ్ణీ చూడాలని వస్తున్నాడు. ఆహ్వానించి, ఆశీస్సులందుకోండి." చెప్పాడు శివుడు.

అంతలో దశరథుడు అక్కడ దివ్యమూర్తిగా సాక్షాత్కరించాడు. అతనికి సీతారామలక్ష్మణులు ముగ్గురూ చేతులు జోడించి నమస్కరించారు. ప్రాణసమానుడైన రాముణ్ణి దగ్గరగా తీసుకున్నాడు దశరథుడు. గట్టిగా కౌగలించుకున్నాడు. అన్నాడిలా.

"రామా! ఇంద్రలోకంలో ఉన్నా, దేవతలూ, ఋషులూ ఎన్నో విధాలుగా నన్ను ఆనందింపచేస్తున్నా, నిన్ను వదలి ఒంటరినయ్యానన్న బాధ.. బాధగానే ఉందయ్యా."

"తండ్రీ"

"నిన్ను అడవులకు పంపమని కైక తొందర చేసినప్పుడు గగ్గోలు పడిన నా ఈ మనస్సు, మహాయోధుడిగా నిలుచున్న నిన్నిప్పుడిలా కౌగిలించుకోవడంతో సేదదీరింది." అన్నాడు దశరథుడు.

కృతజ్ఞుణ్ణి అన్నట్టుగా చూశాడు రాముడు.

"నాయనా! రావణవధకోసం ఆనాడు నీకు పట్టాభిషేకం జరగకుండా దేవతలే అడ్డుకున్నారట! స్వర్గంలో చెప్పుకుంటుంటే విన్నాను. నాకోసం, నా మాటకోసం ఎన్ని బాధలు అనుభవించావయ్యా! ధన్యుణ్ణి." అన్నాడు దశరథుడు.

వారిస్తూ చూశాడు రాముడు.

"అరణ్యవాసం పూర్తి చేశావు. ఓ కఠోరదీక్ష ముగిసింది. ఇక రాజధానికి బయల్దేరు. నీకోసం ఎదురు చూస్తున్న భరతశత్రుఘ్నుల్నీ, కౌసల్యనీ, అయోధ్య పౌరుల్నీ ధన్యుల్ని చెయ్యి." చెప్పాడు దశరథుడు. రాముడి తలను ప్రేమగా నిమిరాడు. అప్పుడు అడిగాడిలా రాముడు.

"తండ్రీ! నాదో చిన్న కోరిక."

"చెప్పు నాయనా"

"నేను అరణ్యవాసానికి వెళ్తున్నప్పుడు బాధపడుతూ, పిన్నమ్మ కైకనూ, తమ్ముడు భరతుణ్ణీ... ఇద్దరినీ ఉభయలోకాల్లోనూ విడచి పెడుతున్నట్టుగా నువ్వు ఆనాడు శపించావు. దయచేసి దానినిప్పుడు ఉపసంహరించు." వేడుకున్నాడు రాముడు.

సరేనన్నట్టుగా తలూపి, కళ్ళు మూసుకున్నాడు దశరథుడు. శాపాన్ని ఉపసంహరించాడు. తర్వాత కళ్ళు తెరచి, లక్ష్మణునివైపు చూశాడు. తెలిసీ తెలియనితనంతో ఆనాడు నిందించానన్న పశ్చాత్తాపంతో లక్ష్మణుడు తలెత్తి తండ్రిని చూడలేకపోతున్నాడు. ఆ సంగతి గ్రహించాడు దశరథుడు.

"నాయనా" అని చేరపిలిచాడతన్ని. దగ్గరగా వచ్చిన లక్ష్మణుణ్ణి అక్కున చేర్చుకున్నాడు. అన్నాడిలా.

"సీతారాముల సేవలో తరించిన నిన్ను చూసి గర్విస్తున్నానయ్యా! ఈ సేవ ఒక్కటి చాలు, నీకు ఈ భూమండలం మీద ఎనలేని కీర్తిప్రతిష్ఠలు ఆర్జించి పెడతాయి. దివ్యలోకాలు కూడా నీ సొంతమవుతాయి."

చేతులు జోడించి నమస్కరించాడు లక్ష్మణుడు.

"లక్ష్మణా! ఈ రాముడు ఎవరో తెలుసా? త్రిభువన రక్షకుడైన పరంధాముడే రాముడు. దేవతలూ, సిద్ధులూ ఇతన్ని కీర్తించని క్షణం లేదు. ఈ మహానుభావుణ్ణి ఎల్లవేళలా అంటిపెట్టుకుని ఉండడం నీ అదృష్టం. కలలో కూడా రామపాదాలను విడువకు." చెప్పాడు దశరథుడు.

"అలాగే తండ్రి"

"వర్ధిల్లు" దీవించాడు దశరథుడు. తనకి నమస్కరిస్తూ నిల్చిన సీతను చూశాడు.

"అమ్మా సీతా! నిన్ను రాముడు అగ్నిపరీక్షకు గురి చేశాడని ఆగ్రహించకు. అది నీకోసం, నీ హితం కోసం చేశాడు. నువ్వు పరమపావని అని లోకానికి తెలియడం కోసం చేశాడు. అర్థం చేసుకుని, అతన్ని మన్నించు. నీ ఈ అగ్నిపరీక్ష ముజ్జగాలకూ ఆదర్శం అవుతుంది." అన్నాడు దశరథుడు.

**పట్టాభిషేకం అనగానే తండ్రి గుర్తుకువచ్చాడు రాముడికి. అతడి మనోభీష్టాన్ని శివుడు గ్రహించగానే రాముని ఎదుట దివ్యమూర్తిగా సాక్షాత్కరించాడు దశరథుడు. ప్రాణసమానుడైన రాముణ్ణి కౌగలించుకున్నాడు. సీతను ఆశీర్వదించాడు. రాముణ్ణి మన్నించమని లోకపావని సీతను కోరాడు దశరథుడు. ఆయన ఎందుకు అలా అడిగాడు? అటు పిమ్మట రాముడు తండ్రిని ఎలాంటి కోరిక కోరాడు?**

అణకువతో తలవంచింది సీత.

"స్త్రీకి భర్తే దైవం అని నిరూపించావు. నీ ప్రవర్తనే నీకు శ్రీరామరక్ష." అన్నాడు దశరథుడు. సీతను ఆశీర్వదించాడు. సీతారాములను కన్నుల నిండుగా చూసుకుని నిష్క్రమించాడక్కణ్ణుంచి. వెళ్ళిపోయిన దశరథునికి వీడ్కోలు పలికి, ఇటు తిరిగిన రాముడితో అన్నాడిలా ఇంద్రుడు.

"రామా! లోకరక్షాకార్యం నెరవేర్చావు. ఈ సంద



ర్ధంగా నువ్వేం కోరుకుంటావో కోరుకో! కాదనను."

ఇంద్రుడు కోరుకోమన్నాడని, ఆలసించిన ఆశా భంగం అని త్వరపడలేదు రాముడు. సీతాలక్ష్మణుల సహా దీర్ఘంగా ఆలోచించాడు. అప్పుడు అడిగాడిలా.

"దేవేంద్రా! అనేక శ్రమలకోర్చి నాకోసం మరణించిన, గాయపడిన ఋక్షవానరసమూహాలను కనికరించు. మరణించినవారిని జీవింపచెయ్యి. గాయపడిన వారిని స్వస్థుల్ని చెయ్యి. అలాగే ఇంకో చిన్న కోరిక."

"చెప్పు"

"నా మిత్రులు ఋక్షవానరసమూహాలు సంచరించే ప్రదేశాల్లో సమృద్ధిగా జలాలు ప్రవహింపచెయ్యి. అన్ని ఋతువుల్లో అక్కడ కోకొల్లలుగా ఫల, మూలాలు లభించేట్టుగా అనుగ్రహించు." వేడుకున్నాడు రాముడు.

"నువ్వు కోరినవి లోకాతీతవరాలు. అయినా అనుగ్రహిస్తున్నాను." అన్నాడు ఇంద్రుడు. అతని మాట ఇలా పూర్తి అయిందో లేదో అలా మరణించిన ఋక్షవానరులంతా నిద్రనుంచి మేల్కొన్నట్టుగా మేల్కొని లేచి నిల్చున్నారు. అలాగే గాయపడిన వారంతా స్వస్థులై చిరునవ్వులు చిందించారు. అంతా వచ్చి సీతారాములకు నమస్కరించారు. జయజయ ధ్వానాలు చేశారు.

రామభక్తుల జయజయధ్వానాలు మిన్నంటుతుంటే వచ్చి నిలిచిన వేల్పులందరూ ఆనందించి అక్కణ్ణుంచి వెళ్ళిపోయారు.

ఆ రాత్రి గడచి, తెల్లారింది.

సూర్యోదయవేళ రాముణ్ణి సమీపించాడు విభీషణుడు. ప్రార్థించాడిలా.

"ప్రభూ! నీ కోసం పరిమళ ఉదకాలూ, పట్టు, జలతారు వస్త్రాలూ, చందనం, పుష్పహారాలూ, ఆభరణాలూ సిద్ధం చేశాను. నీకు అభ్యంగనం చేసి, నిన్ను అలంకరించేందుకు సేవకులు కూడా సిద్ధంగా ఉన్నారు. కరుణించి సపర్యలకు అంగీకరించు."

"ఆ సపర్యలన్నీ సుగ్రీవ, అంగదాదులకు జరిపించు, ఇప్పుడు నా మనసంతా భరతునిపై ఉంది. కఠోరదీక్షపూని కృశిస్తూ నాకోసం ఎదురుచూస్తున్న భరతుణ్ణి మరచిపోయి, నేను అభ్యంగనాది సంస్కారాలకు అంగీకరించడం తప్పు. కూడదు కూడా! అమ్మా, పిన్నమ్మలూ, గురుదేవులూ, మిత్రులూ, అయోధ్య పౌరులను చూడాలని ఒకటే ఆరాటంగా ఉంది మిత్రమా! నన్ను వెళ్ళనీ! అయోధ్య ఇక్కడకి చాలా దూరంలో ఉంది. దారంతా అరణ్యాలతో నిండి ఉంది. ప్రయాణం ఎలా అన్నది పాలుపోవడం లేదు." అన్నాడు రాముడు.

తన సపర్యలు వద్దన్నందుకు బాధపడినా అంతలోనే రామునికి సంతోషం కలిగించేందుకు విభీషణుడు అన్నాడిలా.

"మహాత్మా! అయోధ్య దూరం అనీ, దారంతా దుర్గమారణ్యాలనీ బాధపడవద్దు. ఒక్కపూటలో మిమ్మల్నంతా అయోధ్యకు చేర్చే పుష్పకవిమానం సిద్ధంగా ఉంది. రప్పించమంటే క్షణాల్లో రప్పిస్తాను."

"మరి చెప్పవేం మిత్రమా! వెంటనే రప్పించు." అన్నాడు రాముడు. విభీషణుణ్ణి ఆప్యాయంగా కౌగలించుకున్నాడు.

తలచుకున్నదే ఆలస్యం, క్షణాల్లో పుష్పక విమానం వచ్చి నిలిచిందక్కడ. ముత్యాల అరుగులూ, రత్నాల కిటికీలూ, మోగుతున్న గంటలూ, ఎగురుతున్న పతాకలతో అందంగా ఉంది. ఆహ్వానిస్తున్నట్టుగా ఉంది.

అయితే వెంటనే విమానాన్ని అధిరోహించి బయల్దేరలేదు రాముడు. తమ్ముడు లక్ష్మణునితో చాలా విషయాలు చర్చించాడు. చర్చించి, విభీషణునితో అన్నాడిలా.

"మిత్రమా! నువ్వు నాకు ఓ చిన్నసాయం చెయ్యాలి."

"చెప్పు ప్రభూ."

"ఈ వానరవీరులంతా ఎలాంటి ప్రతిఫలాపేక్షా లేకుండా నాకోసం ప్రాణాలకు తెగించి పోరాడారు. నాకు ఎనలేని విజయం సాధించి పెట్టారు. అందుకు వీరందరినీ సత్కరించి తీరాలి. నీ సంపదకూ, ఔదార్యానికీ తగ్గని విధంగా వీరందరినీ ముందు నా తరఫున నువ్వు సత్కరించు."

"ఆనందంగా" అన్నాడు విభీషణుడు. రామాదేశానుసారం వానరులందరికీ అతను ధనాలూ, అభరణాలూ, వస్త్రాలూ పంచిపెట్టాడు. అందుకుని వానరులంతా సంతృప్తి చెందారు. తోకలు ముద్దు పెట్టుకుని ఆనందంతో గెంతులు వేశారు. అది చూసి ఆనందించాడు రాముడు. అక్కణ్ణుంచి బయల్దేరేందుకు పుష్పకాన్ని అధిరోహించాడు. చేయందించి, సీతను అధిరోహింపజేసి, ఆమెను పక్కన కూర్చోబెట్టుకున్నాడు. విల్లుసహా లక్ష్మణుడు, నిత్యజాగరూకుడిగా రాముని వెనుగ్గా నిల్చుంటే, అతన్ని చూసి నవ్వాడు రాముడు. సమీపించిన సుగ్రీవాదులను చూశాడు.

"మిత్రమా సుగ్రీవా! నీ ప్రతిజ్ఞను త్రికరణశుద్ధిగా అమలు చేసి ధన్యుడివయ్యావు. ఇక నువ్వు అంగదాది వీరులూ, సైన్యంసహా కిష్కింధకు చేరుకో! సుఖంగా రాజ్యపాలన సాగించు." అన్నాడు రాముడు.

వెళ్ళిపోతున్న తనని మళ్ళీ మళ్ళీ చూసేందుకు తలలెత్తి తొక్కిసలాడుతున్న వానరవీరులతో అన్నాడిలా రాముడు.

"వానరమిత్రులారా! ప్రాణాలకు తెగించి నాకోసం పోరాడినందుకు మీ అందరికీ పేరు పేరునా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. ఇక మీరంతా మీ మీ నివాసాలకు చేరుకుని, కుటుంబాలతో సుఖించండి."

చేతులు జోడించి నిల్చున్న విభీషణుణ్ణి చూశాడు రాముడు. చెప్పాడిలా.

"మిత్రమా విభీషణా! లంకారాజ్యాన్ని చిరకాలం పాలించు. ధర్మానికి పెట్టింది పేరుగా కీర్తిప్రతిష్ఠలు ఆర్జించు."

చెమర్చిన కళ్ళతో సరేనన్నట్టుగా తలూపాడు విభీషణుడు.

"ఇక నాకు సెలవు. అయోధ్యకు బయల్దేరుతున్నాను, అనుమతించండి." అందరికీ నమస్కరించాడు రాముడు. ఆ మాటలకి ఆందోళనగా సుగ్రీవ విభీషణాదులు ఒకరిని ఒకరు చూసుకున్నారు. రామునికి ఏదో నివేదించేందుకన్నట్టుగా ముందుకొచ్చారు. గ్రహించాడది రాముడు. చెప్పండన్నట్టుగా చూశాడు.

"ఇంకేం లేదు స్వామీ! ఒక చిన్న మనవి. మేము కూడా నీతో పాటుగా అయోధ్యకు వస్తాం. కౌసల్యా మాతను చూడాలని ఉంది. అలాగే నీ పట్టాభిషేక మహోత్సవాన్ని కూడా చూడాలని ఆశగా ఉంది." అన్నాడు సుగ్రీవుడు.

"అవును స్వామీ! నువ్వు అందుకు అంగీకరించాలి. తప్పదు." అన్నాడు విభీషణుడు. బతిమలాడుతున్నట్టుగా రాముడి చేతులు పట్టుకున్నాడు. రాముడు సరేనని, చిరునవ్వు నవ్వాడు. రాముడు నవ్వడం ఆలస్యం, సుగ్రీవ అంగదాదులు, మంత్రులు, సేనానాయకులు, పరివారంసహా పుష్పకాన్ని అధిరోహించారు. విభీషణుడొక్కడే కొద్దిగా ఆలస్యం చేశాడు. యుద్ధబీభత్సంతో లంకలో పరిస్థితులన్నీ ఛిన్నాభిన్నంగా ఉన్నాయి. వాటిని సరిదిద్ది, పాలనాభారాన్ని మంత్రులకి అప్పగించి మరీ వచ్చాడతను. ఒక్కడే వచ్చాడు. పుష్పకాన్ని అధిరోహించాడు. ఎందరు ఎక్కినా ఇంకా ఇంకొకరికి తావు ఇచ్చే పుష్పకం విశాలంగా ఉండి, వానరవీరులతో కలకలంగా ఉంది. జాగ్రత్తలు చెప్పి, బయల్దేరేందుకు సిద్ధమయ్యాడు రాముడు. అతని మనసును గ్రహించి, పుష్పకం పైకి లేచింది. ఆకాశానికి ఎగిసింది. బయల్దేరింది అక్కణ్ణుంచి.

**-అరణి**

# సౌభాగ్య చక్రం

నవంబర్ 9 నుంచి నవంబర్ 15 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



**మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, సంస్మరణలు, బ్యాంకులు, ఆర్థిక సంస్థలతో పనులు, షాపింగ్‌లపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో విరాళాలు, చందాలకు వెచ్చిస్తారు. పన్నులు, బీమా వ్యవహారాలకు అనుకూలం. 11,12 తేదీల్లో ఆర్థిక విషయాల్లో మీ వైఖరి సమీక్షించుకోవాల్సిన అవసరం ఉంది. రుణ ప్రయత్నాలు ఫలిస్తాయి. 13,14 తేదీల్లో స్పెక్యులేషన్లు, పెట్టుబడుల్లో నిదానం అవసరం. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. ఆర్థికపరమైన సమావేశాలు ఫలిస్తాయి. 15న ఆర్థికపరమైన చర్చలు, ప్రయాణాలు ఫలిస్తాయి. సన్నిహితుల ఆరోగ్యం మెరుగుపడుతుంది.



**వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, సమావేశాలు, వేడుకలు, జనసంబంధాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 11, 12 తేదీల్లో వేడుకల్లో పాల్గొంటారు. సినీరాజకీయ రంగాల వారికి గౌరవ మర్యాదలు లభిస్తాయి. 13, 14 తేదీల్లో ప్రత్యర్థుల నుంచి చికాకులు ఎదురయ్యే అవకాశం ఉంది. శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. వేడుకల్లో పాల్గొంటారు. 15న ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరంగా ఉంటుంది. ప్రియతముల కోసం విలువైన వస్తువులు సేకరిస్తారు.



**మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)**

ఉన్నత విద్య, ఆరోగ్యం, బీమా, వృత్తిపరమైన సమావేశాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ప్రముఖులను కలుసుకుంటారు. విందు వినోదాల్లో పాల్గొంటారు. 11, 12 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 13, 14 తేదీల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది. దీర్ఘకాలిక పెట్టుబడులు లాభిస్తాయి. సినీ, రాజకీయ రంగాల వారికి శుభప్రదం. 15న వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. విందుల్లో పాల్గొంటారు. కొత్త పనుల ప్రారంభానికి అనుకూలం.



**కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)**

సమావేశాలు, వేడుకలు, ప్రేమానుబంధాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో ప్రియతములతో వేడుకల్లో పాల్గొంటారు. 11, 12 తేదీల్లో పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. వృత్తి, వ్యాపారాల్లో సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 13, 14 తేదీల్లో కుటుంబ సభ్యుల సహకారంతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు. ఆర్థిక సంస్థలతో పనులకు అటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది. 15న దూరంలో ఉన్న ప్రియతముల కలయిక ఆనందం కలిగిస్తుంది. చిన్నారుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది.



**సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)**

బదిలీలు, వృత్తి, వ్యాపారాలు, గృహరుణాలు, మార్పులకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో అడ్వాన్సులు, రుణాలు అందుకుంటారు. వేడుకల్లో పాల్గొంటారు. 11,12 తేదీల్లో రియల్ ఎస్టేట్ రంగంలోని వారి అంచనాలు తప్పుతాయి. సమావేశాలు, వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. 13,14 తేదీల్లో బదిలీలు, మార్పులు కొంత అసౌకర్యం కలిగిస్తాయి. వృత్తి, వ్యాపారాల్లో శుభపరిణామాలు చోటుచేసుకుంటాయి. ఇంటర్వ్యూల్లో విజయం సాధిస్తారు. 15న బంధుమిత్రులతో ఆనందంగా గడుపుతారు. కుటుంబ సభ్యుల కోసం విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు.



**కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)**

సమావేశాలు, పెట్టుబడులు, విద్యా సంస్థలతో పనులు, ఇంటర్వ్యూలకు ఈ వారం ప్రాధాన్యమిస్తారు. బుధ, గురువారాల్లో వివాహ నిర్ణయాలకు అనుకూలం. భాగస్వామి విషయంలో శుభపరిణామాలు సంభవం. 11,12 తేదీల్లో విలువైన పత్రాల విషయంలో జాగ్రత్త అవసరం. సన్నిహితుల సహకారంతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు. 13, 14 తేదీల్లో ఆర్థిక విషయాల్లో అంచనాలు ఫలించకపోవచ్చు. చర్చలు, సమావేశాలు లాభిస్తాయి. 15న ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. పెద్దలతో సమావేశాలు ఫలిస్తాయి. వృత్తి, వ్యాపారాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు.



**తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)**

రుణాలు, పొదుపు పథకాలు, ఫీజుల చెల్లింపులపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరంగా ఉంటుంది. 11,12 తేదీల్లో పందాలు, పోటీలకు దూరంగా ఉండాలి. ఖర్చులు అధికం. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. 13,14 తేదీల్లో పెట్టుబడుల విషయంలో ఆచితూచి వ్యవహరించాలి. గత స్మృతులు నెమరువేసుకుంటారు. బీమా, గ్రాట్యుటీ, పెన్షన్ వ్యవహారాలకు అనుకూలం. 15న ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు. సంకల్పం సిద్ధిస్తుంది.



**వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)**

వేడుకలు, సమావేశాలు, ప్రయాణాలు, ఉన్నత పదవులు ఆర్థిక నిర్ణయాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ప్రేమానుబంధాలు బలపడతాయి. 11, 12 తేదీల్లో సహోద్యోగుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. కొత్త పనుల శ్రీకారానికి మంచి సమయం. ఆరోగ్యం మెరుగవుతుంది. 13, 14 తేదీల్లో జన సంబంధాలు విస్తరిస్తాయి. భాగస్వామి వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. వివాహాది శుభకార్యాల్లో పాల్గొంటారు. ఖర్చులు అధికం. 15న పెట్టుబడులపై దృష్టి సారిస్తారు. షాపింగ్, క్రయవిక్రయాలకు అనుకూలం. ఆరోగ్యం మెరుగవుతుంది.



**ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)**

వృత్తిపరమైన సమావేశాలు, వేడుకలు, సమావేశాలు, సంస్మరణలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి శుభప్రదం. వాయిదా పడుతున్న పనులు ఒక కొలిక్కి వస్తాయి. 11, 12 తేదీల్లో ఒక సమాచారం ఆవేదన కలిగిస్తుంది. దూరంలో ఉన్న ప్రియతముల కలయిక ఆనందం కలిగిస్తుంది. 13,14 తేదీల్లో ఆరోగ్యం పట్ల శ్రద్ధ అవసరం. బంధుమిత్రులతో వేడుకల్లో పాల్గొంటారు. వృత్తి, వ్యాపారాలకు సంబంధించిన ముఖ్య సమాచారం అందుకుంటారు. 15న వేడుకలు, శుభకార్యాల్లో పాల్గొంటారు. శ్రీవారు, శ్రీమతి అంతరంగం తెలుసుకుని మసలుకుంటారు.



**మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, వృత్తి, వ్యాపారాలు, ప్రేమానుబంధాలు, వేడుకలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 11, 12 తేదీల్లో ఆర్థిక విషయాల్లో కుటుంబ సభ్యుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. వేడుకలు, సమావేశాల్లో పాల్గొంటారు. 13, 14 తేదీల్లో ఆర్థిక విషయాల్లో నిదానం అవసరం. ప్రేమానుబంధాలు బలపడతాయి. సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 15న వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరంగా ఉంటుంది. విందు, వినోదాల్లో పాల్గొంటారు.



**కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)**

బదిలీలు, మార్పులు, కొత్త ప్రాజెక్టులు, వేడుకలు, జనసంబంధాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరం. 11, 12 తేదీల్లో పెద్దలతో చర్చలు ఫలించకపోవచ్చు. ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. 13, 14 తేదీల్లో బదిలీలు, మార్పులు అసౌకర్యం కలిగిస్తాయి. పెద్దల వైఖరిలో మార్పు ఆనందం కలిగిస్తుంది. ప్రముఖుల్ని కలుసుకుంటారు. 15న సృజనాత్మకంగా వ్యవహరించి వృత్తి వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. ప్రియతములు, చిన్నారుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది.



**మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)**

సమావేశాలు, దూరప్రయాణాలు, ఇంటర్వ్యూలకు సంబంధించిన అంశాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో సమావేశాలు ఫలిస్తాయి. సంకల్పం నెరవేరుతుంది. 11, 12 తేదీల్లో ఆర్థిక విషయాల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 13, 14 తేదీల్లో ప్రయాణాల్లో నిదానం అవసరం. సమావేశాలు ఫలిస్తాయి. బిల్లులు, చెక్కులు అందుకుంటారు. 15న బంధుమిత్రుల కలయికతో ఇల్లు సందడిగా ఉంటుంది. బదిలీలు, మార్పుల కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి.

## అత్తకి కోడలి కౌంటర్



ఐష్ నటించిన 'యే దిల్ హై ముష్కిల్' మీద జరుగుతున్న రచ్చ అంతా ఇంతా కాదు. తనకన్నా చిన్నవాడైన రణబీర్‌తో ఇంటిమేట్ సీన్లలో నటించిన ఐష్ వైఖరిని చాలామంది తప్పుపట్టారు. వారిలో ఐష్ కుటుంబ సభ్యులు కూడా ఉన్నారని అంటున్నారు. సహజంగా సినిమా ఫ్యామిలీ కావడంతో కుటుంబ సభ్యులు ఎవరూ పెద్దగా బయటపడలేదు. కానీ ఐష్ అత్త జయా బచ్చన్ మాత్రం నోరు కట్టేసుకోలేకపోయింది. ఇటీవల జరిగిన ఓ కార్యక్రమంలో ఇప్పటి సినిమాల గురించి మాట్లాడుతూ విలువలు తగ్గిపోతున్నాయనీ, హీరోయిన్లు కూడా వాటిని పాటించడం లేదనీ పరోక్షంగా కోడలి మీద విమర్శలు చేసింది. దానికి ఐష్ కూడా ధీటుగానే స్పందించింది. సినిమాని సినిమాలాగే చూడాలి తప్ప నటన మీద విమర్శలు చేయడం పద్ధతి కాదంటూ తీవ్రంగానే జవాబు ఇచ్చిందట! మొత్తానికి ఏ విషయంలోనూ అత్తాకోడళ్ళు తగ్గడం లేదని బాలీవుడ్ జనాలు అంటున్నారు.




## స్వశక్తిని నమ్ముకున్న పూరీ



'ఇజం' రిజల్టు మిగతా వారి కన్నా కూడా పూరీమీదే ఎక్కువ పడింది అంటున్నారు సినీ జనాలు. ఈ సినిమాకి ముందు కొందరు స్టార్ హీరోలు పూరీతో సినిమాలు చేయడానికి రెడీ అయ్యారు. కానీ ఈ సినిమా తరువాత వారం దరూ ముఖం చాటేయడంతో పూరీ తనే నిర్మాతగా మారి స్వీయదర్శకత్వంలో లోబడ్జెట్ మూవీకి ప్లాన్ చేశాడట! ఈ సినిమాతో తన స్టామినా నిరూపించుకుని, ఆ తరువాత స్టార్ హీరోలను కలవాలని డిసైడ్ అయ్యాడట! మొత్తానికి పూరీ టైం బాగాలేదని సినీ జనాలు అంటున్నారు. అందుకే ఏ సినిమా కూడా బ్లాక్ బస్టర్ కావడం లేదన్నది వారి వాదన.

## రాజుగారు తగ్గారుగా?

ఎక్కడ తగ్గాలో, ఎక్కడ పెరగాలో దిల్‌రాజ్‌కి బాగా తెలుసని సినీ జనాలు అంటున్నారు. ఆయన నిర్మాణంలో వస్తున్న 'శతమానం భవతి'ని సంక్రాంతికి విడుదల చేయాలన్నది దిల్‌రాజ్ ప్లానట! అయితే ఈ సంక్రాంతికి స్టార్ హీరోల సినిమాలు రెండు విడుదల



కానుండడంతో తన సినిమా విడుదల వాయిదా వేసుకున్నాడని అంటున్నారు. రెండు పెద్ద సినిమాల మధ్య ఈ చిన్న సినిమా నిలదొక్కుకోలేదన్న అనుమానంతోనే నిర్ణయం మార్చుకున్నాడని చెబుతున్నారు. దీని మీద అధికారికంగా ప్రకటన వెలువడాల్సి ఉంది.

## శంకర్ ఇలా చేశాడేంటి?

మామూలుగా శంకర్ సినిమాల్లో పాటలు ఓ రేంజ్‌లో ఉంటాయి. పాటలను అందంగా చిత్రీకరిస్తాడన్న పేరు శంకర్‌కి ఉంది. అలాంటిది ఆయన తాజా సినిమా 'రోబో 2'లో కేవలం ఒక్క పాటంటే ఒక్క పాటే ఉంటుందట! ఆడియోలో నాలుగైదు పాటలు ఉన్నా, సినిమాలో మాత్రం ఒకటే ఉంటుందని అంటున్నారు. ఈ వార్త బయటకి రావడంతో రజనీ అభిమానులు తీవ్ర నిరాశతో ఉన్నారట! సినిమా నిడివి ఎక్కువైందని తీసేశారా? లేక ఇంకేదైనా కారణం



ఉందా? అన్న అనుమానాలు చాలా మంది వ్యక్తం చేస్తున్నారు.

## బాహుబలి ఖాతాలో మరో రికార్డు

'బాహుబలి 2' విడుదలకు సిద్ధమవుతుండగా, 'బాహుబలి' ఇంకా రికార్డుల మోత మోగిస్తూనే ఉంది. తాజాగా జపాన్‌లో జరగబోయే 'టోక్యో అంతర్జాతీయ ఫిలిం ఫెస్టివల్‌లో 'బాహుబలి'ని




ప్రదర్శించబోతున్నారు. కేవలం ప్రదర్శించడమే కాదు, సినిమా నిర్మాత శోభు యార్లగడ్డ అక్కడ మాట్లాడనున్నారు. అక్కడ జరిగే క్వశ్చన్ అండ్ ఆన్సర్ సెషన్‌లో కూడా శోభు యార్లగడ్డ పాల్గొంటారు. అంతేకాకుండా ఫిలిం స్టూడెంట్స్‌కు క్లాస్ కూడా ఇవ్వనున్నారు.

# నా మజ్ను వస్తే ప్రేమిస్తానేమో....

-అనూ ఇమ్మాన్యుయెల్



**టా**లీవుడ్ హీరోయిన్లకు కేరాఫ్ అడ్రస్ కేరళ అనే చెప్పవచ్చు. అక్కడి భామలకు అందానికి తోడు అభినయం కూడా తోడుకావడంతో మలబారు భామలు తెలుగులో దూసుకుపోతున్నారు. మాలీవుడ్ భామలలో మరో ప్రత్యేకత కూడా ఉంది. కేవలం గ్లామర్ డాల్స్‌గా మిగిలిపోవడానికి ఇష్టపడరు. ముందు కథ, ఆ తరువాత గ్లామర్ అనడంతో తెలుగులో వీరి సినీ ప్రయాణం దశాబ్దాల తరబడి బ్రేకుల్లేని బండిలా దూసుకుపోతోంది. అలా తన అందం, అభినయాన్ని నమ్ముకొని సినీ ప్రయాణం చేస్తున్న అనూ ఇమ్మాన్యుయెల్‌తో...

**మలయాళీ అమ్మాయి అయ్యుండి తెలుగు కష్టమనిపించడం లేదా?**

నాకు మొదటి నుంచి తెలుగుతో కొద్దిగా పరిచయం ఉంది. అప్పుడప్పుడు తెలుగు సినిమాలు చూస్తూ ఉండేదాన్ని. దాంతో భాష అర్థం కాకపోవడమంటూ లేదు. కాకపోతే మాట్లాడటమే ఇంకా రాలేదు. ఎదుటివారు చెప్పింది అర్థం అవుతోంది. తిరిగి జవాబు చెప్పలేకపోతున్నాను. త్వరలోనే తెలుగు నేర్చుకునే ప్రయత్నంలో ఉన్నాను.

**ఏ భాషలో చేయడం తేలికగా ఉంది?**

తెలుగులో కమర్షియల్ సినిమాలకి పట్టం కడతారు. నటన నచ్చితే చాలు అందలం ఎక్కిస్తారు. తెలుగమ్మాయా? పరభాషా అమ్మాయా? అని చూడరు. తెలుగువారిలో నాకు నచ్చిన మొట్టమొదటి గుణం అదే! తెలుగు ప్రేక్షకుల్లో ఈ సాఫ్ట్ కార్నర్ కారణంగా పరభాషా హీరోయిన్లు ఇక్కడ స్టార్ హీరోయిన్లు అవుతున్నారు. కోలీవుడ్‌లో కూడా దాదాపు ఇదే పరిస్థితి ఉంది. మాలీవుడ్‌లోనే పరిస్థితి కొద్దిగా భిన్నంగా ఉంటుంది.

**అందంగా ఉండే మీ వెంట 'మజ్ను'లు ఎవరైనా పడ్డారా?**

చాలామంది పడ్డారు. వారిలో నా మజ్ను ఎవరో నాకు తెలీదు. అయినా ఇప్పుడప్పుడే ప్రేమా, పెళ్లీ ఆలోచన లేదు. అందుకే ఎలాంటి వాడు కావాలి? అన్నది కూడా ఆలోచించడం లేదు. అవన్నీ చూసుకోవడానికి మా పేరెంట్స్ ఉన్నారు.

**ప్రేమ మీద నమ్మకం లేదా?**

నమ్మకం అని కాదు. ఇప్పుడు సమయం కాదని చెబుతున్నాను. ఎవరినైనా ప్రేమిస్తే వారికే ఎక్కువ సమయం కేటాయించాలి. ప్రస్తుతం అంత టైం నా దగ్గర లేదు. ఆ సమయం వస్తే ప్రేమిస్తానేమో... ఇప్పుడే ఎలా చెప్పగలను?



### తెలుగు సినిమాల్లో గ్లామర్ తప్పనిసరి కదా? గ్లామర్‌గా కనిపిస్తారా?

సినిమా అంటేనే గ్లామర్ ప్రపంచం. ఒక్క తెలుగనే కాదు ఇతర భాషల సినిమాల్లో కూడా గ్లామర్ తప్పనిసరి. అలాగని పూర్తిగా గ్లామర్ పాత్రలకే అంకితం కాను. నటనకు ఆస్కారం ఉన్న సినిమాలే చేస్తాను. మనదైన మార్కు సినిమాల్లో చూపించకపోతే రాణించడం కష్టం. ఇక ఎక్స్‌పోజింగ్‌కి కొద్దిగా దూరంగానే ఉంటాను. మోడ్రన్ డ్రెస్సుల పేరిట ఎక్స్‌పోజింగ్ చేయమంటే మాత్రం చేయను. అలాగని నిండుగా చీరలోనే కనిపిస్తానని అనడం లేదు. అసభ్యకరంగా కనిపించనంత వరకూ మోడ్రన్ డ్రెస్సులు వేసుకోమంటే నాకెలాంటి అభ్యంతరం లేదు.

### విమర్శలు, పుకార్లను ఎలా తీసుకుంటారు?

సద్విమర్శలైతే తప్పకుండా ఆలోచిస్తాను. పనిలేకుండా చేసే విమర్శలను అస్సలు పట్టించుకోను. ఇక పుకార్లను ఎంజాయ్ చేస్తానే తప్ప వాటి గురించి అస్సలు ఆలోచించను. వీటి గురించి పట్టించుకుంటే పనిచేయడం కష్టమని మా ఫాదర్ ఎప్పుడో చెప్పారు.

### ఎలాంటి పాత్రలు ఇష్టపడతారు?

సినిమా మొత్తం నేనే కనిపించాలని లేదు. కానీ, నా పాత్రకు తగిన ఇంపార్టెన్స్ ఉండాలి. అలాంటి సినిమాలే ఎంపిక చేసుకుంటున్నాను.

### హోంసిక్ లాంటిది ఎప్పుడైనా ఫేస్ చేశారా?

లేదు. ఎందుకంటే ఇక్కడ నాకు ఫ్రెండ్స్ ఎక్కువగా ఉన్నారు. నా షూటింగులూ, వాళ్ళని కలవడం వంటివాటితోనే టైం గడిచి పోతుంది. అయినా ప్రతిరోజూ మా పేరెంట్స్‌తో కనీసం ఓ అరగంటైనా ఫోన్లో మాట్లాడుతుంటాను. నా అప్‌డేట్స్ ఎప్పటికప్పుడు వాళ్ళకి చెబుతుంటాను. దాంతో వాళ్ళని మిస్ అవుతున్నానన్న ఫీలింగ్ ఎప్పుడూ కలగలేదు.

### తీరిక సమయాల్లో ఏం చేస్తుంటారు?

అన్ని భాషల సినిమాలు చూస్తుంటాను. ఫ్యాషన్ అంటే ఎక్కువ ఇంట్రెస్టు ఉంది. దీనికి సంబంధించిన న్యూస్, ఆర్టికల్స్ ఎప్పటికప్పుడు ఫాలో అవుతుంటాను.

### చదువు మధ్యలో ఆపేసినట్టున్నారు?

సినిమాల్లో వరుసగా అవకాశాలు వస్తుండటంతో తాత్కాలికంగా దానికి బ్రేక్ ఇచ్చాను. త్వరలోనే దాన్ని పూర్తి చేస్తాను.

### కోలీవుడ్‌లో హీరోయిన్ ఆఫర్ లాగేసుకున్నారట? నిజమేనా?

విశాల్ సినిమా గురించేగా? మొదట మరో హీరోయిన్‌ని తీసుకున్నారని కానీ, ఆమె స్థానంలో నన్ను రీప్లేస్ చేశారని కానీ నాకు తెలియదు. దర్శకుడి దగ్గర నుంచి ఫోన్ రాగానే వెళ్ళాను. చీరలో కొన్ని స్టిల్స్ తీసుకున్నారు. వాటిని చూసిన తరువాత నువ్వే మా హీరోయిన్ అన్నారు. నేనూ వెంటనే ఓకే చెప్పేశాను. ఎందుకంటే ఆ దర్శకుడి మీద నాకు పూర్తి నమ్మకం ఉంది. కథ గురించి కూడా పట్టించుకోలేదు. కథ గురించే అడగలేదంటే అంతకు ముందు జరిగిన వివరాలను నేనెందుకు తెలుసుకుంటాను? సినిమాలో ఏ హీరోయిన్ అయితే బాగుంటుందన్నది ఆ సినిమా దర్శకుడి ఇష్టం. అక్కడ ఒకరి అవకాశాలను ఒకరు లాగేసుకునే చాన్స్ అస్సలు ఉండదు.

### మాలీవుడ్ మీద విమర్శలు చేయడం ఎంతవరకు సబబు?

నేను ఫీలైందే చెప్పాను. నేను తెలుగు, తమిళం, మలయాళం మూడు భాషల్లో నటించాను. తెలుగు, తమిళంలో హీరోయిన్లని బాగా చూసుకుంటారు. ఒక్క మాలీవుడ్‌లోనే హీరోయిన్లకు తగిన గౌరవం ఇవ్వరు. అందుకే అలా చెప్పాను. మాలీవుడ్‌ని బాగా పరిశీలించిన తరువాత చేసిన విమర్శలే అవి.

### ఈ రంగంలో మీకు స్ఫూర్తి?

చాలా రంగాలలో చాలా మందిని స్ఫూర్తిగా తీసుకున్నాను. అలాగని వారిని అనుకరించడానికి ప్రయత్నించను. నా రూట్, నా ఆలోచనలు నాకు ఉంటాయి. ఎవరినీ అనుకరించే అలవాటు లేదు.

### మీకు నయనతార అంటే ఇష్టం అన్నారు? మిగతావారిని ఇష్టపడరా?

మనకు పరిచయమైన వారిలో కొద్దిమందిని బాగా ఇష్టపడతాం. అలాగని మిగతావారు ఇష్టం లేదా? అంటే లేదని చెప్పలేం కదా. ఇది కూడా అంతే! నయనతార నటన అంటే ఇష్టం. ఆమె వెరైటీ పాత్రలు చేస్తుంటారు. ఆమె సినిమాల ఎంపిక చూసే, ఆమె మీద ఇష్టం ఏర్పడింది.

### ఫిట్‌నెస్ కోసం ఏం చేస్తుంటారు?

వారంలో మూడునుంచి నాలుగు రోజులు రన్నింగ్ చేస్తాను. ఆహారం ఒకేసారి కాకుండా మూడునాలుగుసార్లు కొద్దికొద్దిగా తీసుకుంటాను. ఏ విషయానికీ పెద్దగా టెన్షన్ పడను. నాకు చేతనైనదే చేస్తాను తప్ప శక్తికి మించిన పని చేయను. సో...ఒత్తిడి అనేది తక్కువే నాకు.

### డైరెక్షన్ చేస్తానన్నారు కదా?

దర్శకత్వం మీద ఇంట్రెస్టు ఉంది. కానీ ఇప్పుడు కాదు. దానికి చాలా టైముంది.

### ప్రస్తుతం చేస్తున్న సినిమాలు..

తెలుగులో రెండు, తమిళంలో రెండు సినిమాలు చేస్తున్నాను.

-చిన్ని

## ఇంటర్వ్యూ



# స్త్రీల కష్టాలే నన్ను రచయిత్రిని చేశాయి

**-కె.బి.లక్ష్మి**

**సుమారు 45 ఏళ్ళనాటిమాట. ఓ పద్దెనిమిదేళ్ళ పల్లెటూరు అమ్మాయి హైదరాబాదు నగరానికివచ్చి ఓ ప్రముఖ కాలేజీ ప్రిన్సిపాల్ రూంలోకివెళ్ళి 'సైన్సుకోర్సు చదవాలనుకుంటున్నాను, మీ కాలేజీలో సీటిస్తారా?' అని ఇంగ్లీషులో అడిగింది. అదిగో! ఆ తెగువే ఆ మగువను నాలుగు దశాబ్దాలపాటు సక్సెస్‌ఫుల్ జర్నలిస్టుగా నిలబెట్టింది. రెండు సాహిత్య పత్రికలకు ఎడిటర్‌ని చేసింది. ఆకాశవాణి, దూరదర్శన్‌లలో ప్రయోక్తగా, వ్యాఖ్యాతగా అనేక కార్యక్రమాల్లో పాల్గొనేట్టు చేసింది. ఆవిడ ఎక్కడుంటే అక్కడ మాటలు పూలపరిమళమై వ్యాపిస్తాయి. యాంకరింగ్ వేదికపై నవ్వులు పువ్వులై వికసిస్తాయి. మనిషిలో పాజిటివ్ అంశాల్నే పోగేద్దాం నెగెటివ్ అంశాల్ని నీటిలో కలిపేద్దామని నిష్కల్మషంగా నిర్మలంగా సుతిమెత్తగా చెబుతూ మనసుల్ని తట్టే రచయిత్రి, జర్నలిస్టు, కాలమిస్టు, ఎడిటర్, యాంకర్ కె.బి.లక్ష్మి. తాను నడిచినదారిలో పరచిన పుప్పొడిరాగాలను మనసంతా నింపుకుంటూ మనతో పంచుకున్నారు. ఆ పరిమళ ప్రపంచంలోకి అడుగు పెడదాం!**

### బాల్యంలో సాహిత్య స్పర్శ

హైస్కూలు రోజుల్లోనే సాహిత్యాభిరుచి ఏర్పడింది. ఇంగ్లీషు మాస్టారేమో తెలుగుసాహిత్యం చెబితే, తెలుగుమాస్టారు ఇంగ్లీషు సాహిత్యంలోకి వెళ్ళిపోయేవారు. అలా షేక్స్‌పియర్, వర్డ్స్‌వర్త్, మిల్టన్, కాళిదాసు, శ్రీనాథుడు వంటి ప్రాచీన ఆధునిక తెలుగు, ఆంగ్ల సాహిత్యాల మధ్య తిరుగాడుతూ ఉండేవాళ్ళం. అంతకన్నా గొప్ప విషయమేమిటంటే ఇంటర్మీడియట్ వరకు వేటపాలెంలోనే నా చదువంతా. వేటపాలెం సారస్వతనికేతనం నాకో గొప్పగురువు. నా డాక్టరేటు పరిశోధనకు కావలసిన మొదటి పుస్తకాలు కూడా ఆ లైబ్రరీనుంచే తెచ్చుకున్నా. నా స్నేహితులు గవ్వలు, చింతపిక్కల ఆటల్లో ఉంటే, నా సమయమంతా ఆ లైబ్రరీలో గడిపేదాన్ని. దానికి కారణం మా నాన్నగారే। ఆయన పువ్వులు, పుస్తకాలు కలిపి తెస్తూ ఉండేవారు. అలా వేటపాలెం నన్ను తీర్చిదిద్దింది. మా ఇంటికీ, వేటపాలెం సారస్వత నికేతనం మధ్య మాలక్ష్మమ్మగుడి ఉండేది. అమ్మవారికి దణ్ణం పెట్టుకోవడం, లైబ్రరీ (సారస్వత నికేతనం)కి వెళ్ళిపోవటం. తెల్లటి ఇసుక తిన్నెలు, మా ఊరి చెరువు, నాగర్‌కోయిల్ గుడి, జీడి మామిడిచెట్లు... ఇలా జీవితానికి అవసరమైన ఆనందం, సంతోషం, వ్యక్తిత్వం ఇవన్నీ నాకు వేటపాలెం ఇచ్చింది.

### జీవితాన్ని మార్చిన హైదరాబాద్

మా అమ్మ సంగీతజ్ఞురాలు. వయోలిన్ వాయించేది. నాకు సంగీతం, నృత్యం నేర్పించింది. మేం ఆరుగురు ఆడపిల్లలం, ఒక మగపిల్లాడు. నేను పెద్దదాన్ని. ఏనాడూ ఆడపిల్లలనే ఆంక్షలు ఉండేవికాదు. డిగ్రీలో చేరేందుకు విజయవాడలో బోటనీలో సీటు రాలేదు. అమ్మమ్మ, మామయ్య హైదరాబాద్‌లో ఉండేవారు. అమ్మమ్మ ఇచ్చిన ధైర్యంతో హైదరాబాద్ వచ్చాను. ఆవిడ స్నేహితుల సలహాతో ఇక్కడ రెడ్డి ఉమెన్స్ కాలేజీకివెళ్ళా. ప్రిన్సిపాల్ రూంకువెళ్ళి 'నాకు సీటు కావాలి, సైన్స్ చదవడంకోసం వచ్చానని ధైర్యంగా అడిగాను. ఒక విలేజ్ అమ్మాయివచ్చి చదువుకుంటాను సీటివ్వండి అని ఇంగ్లీషులో అడిగినతీరుకు ముచ్చటపడింది ప్రిన్సిపాల్. ఆవిడపేరు మిసెస్ 'రీగో'. మీ గ్రాండ్‌డాటర్ గొప్పదవుతుంది అని ఆవిడ మా అమ్మమ్మ చేతులు పట్టుకుని చెప్పింది.

### చదువు, సాహిత్యం

చదువుతోపాటే సాహిత్యంపట్ల ఆసక్తి సమాంతరంగా నడిచింది. పుస్తకాలుకొని చదువుకోవడం నాకు అలవాటు. హైదరాబాదులో నవ్య నాటక పరిషత్తువారో మరెవరో పెట్టిన పోటీల్లో ఫస్టు ప్రైజు వచ్చింది. టీకాతాత్పర్యం ఉన్న 'మనుచరిత్ర' పుస్తకం నారాయణరెడ్డిగారి చేతులమీదుగా అందుకున్నాను. ఊరుగాని ఊరొచ్చి పొందిన ఆ బహుమతి నాలో కొత్తఉత్సాహం నింపింది.

'యువభారతి' సంస్థతో అనుబంధం ఏర్పడి, వనితా విభాగానికి అధ్యక్షురాలిగా, కార్యదర్శిగా పనిచేశాను. యువభారతి లక్ష్మిగా పేరొచ్చింది. గొప్ప కవుల్ని చూశాను. శ్రీశ్రీగారిని ఆంధ్ర సారస్వత పరిషత్తులోనే కలిశాను. అక్కడ మంచి సాహిత్య సమావేశాలు జరుగుతూ ఉండేవి. రవీంద్ర భారతిలో అంతర కళాశాలల నాటక పోటీల్లో పాల్గొని అర్థరాత్రిపూట రిక్షాలో ధైర్యంగా వెళ్ళటం

కూడా నాకో మంచి జ్ఞాపకం. అవన్నీ మరపురాని మంచిరోజులు. సాహిత్యఆసక్తివల్ల పీజీ చదివే నాటికి ఎమ్మే సోషియాలజీకి మారిపోయాను. దివాకర్ల వెంకటావధానిగారి వ్యాకరణం, నారాయణ రెడ్డిగారి పాఠం వినాలనే కోరికతో ఆర్ట్స్ కాలేజీకి వెళ్ళాను. ఉస్మానియా ఆర్ట్స్‌కాలేజీ అంటే నాకు ఓ Facination. అక్కడే రెండేళ్ళ రష్యన్ భాష డిప్లొమా చేశాను. నా పరిశోధన కూడా అక్కడే. 'దశాబ్ద తెలుగు కథ' 'ట్రెండ్ సెట్టింగ్ నవల్స్' ఇవీ నేను ఎంచుకున్న అంశాలు. మగ రచయితల కంటే ఎక్కువ ప్రగతివాద దృక్పథంలో, స్త్రీవాదంలో పాత్రలు సృష్టించిన రచయిత్రి ఐ.వి.యస్.అచ్యుత వల్లి నవలలమీద పరిశోధన చేశాను.


కుటుంబసభ్యులతో...

### కథకుల ప్రభావం

తిలక్ అంటే నాకిష్టం. చలం కథలు ఇష్టం. ఠాగోర్ కథలు కూడా. మంచికథ ఏదైనా ఇష్టం. ఎవరు రాశారన్నది ప్రధానం కాదు. మంచికథ ఎప్పుడూ హాయిగా ఉండాలి. మనసుని తేలికపరి చేలా ఉండాలి. చదివాక కాసేపైనా మనసు మురిసేలా ఉండాలి. నవరసాల్లో ఏ రసమైనా కథ కావొచ్చు.

### స్త్రీల కష్టాలే రచయిత్రిని చేశాయి

హైస్కూల్‌రోజుల్లో సైన్స్‌ఫెయిర్లు, ఆటల పోటీలు, నాటకాలు ఇలా అన్నింటిలో పాల్గొంటూ ఉండేదాన్ని. స్కూల్ మేగజైన్‌కోసం మొట్టమొదటి సారి 'కప్పల నాయుడు - చెప్పుల జోడు' అనే హాస్యకథ రాశాను. నైన్త్‌క్లాసులో ఉండగా, ప్రదర్శ నకు నోచుకున్న గంటనిడివిగల 'విధివశం' నాటిక రాశాను. అప్పట్లో చాలామంది ఆడవాళ్ళు మా అమ్మదగ్గరకువచ్చి భర్తలుపెట్టే కష్టాలు చెప్పు కునే వాళ్ళు. అమ్మ సలహాలిచ్చేది. అవన్నీ 200 పేజీల్లో నవల రూపంలో రాశాను. దాన్ని నవల అంటారని నాకు తెలీదు. ఆడవాళ్ళ కష్టాలే నన్ను రచనకు ప్రేరేపించాయి. పేరు కూడా పెట్టలేదు. దాన్ని ఇప్పటి పరిస్థితులకు మార్చి రాద్దామనీ, ఆ నవలకు 'ఆశ్రయం' అనే పేరు పెట్టాలనీ అను కుంటున్నాను.

### జర్నలిస్టు కెరీర్

మూడు దశాబ్దాలు సుదీర్ఘకాలం ఫోర్త్‌ఎస్టేట్‌లో పనిచేసిన ఉమెన్ జర్నలిస్టును. ఒక ప్రముఖ దినపత్రికవారు స్త్రీల పత్రిక పెడుతున్నారని మిత్రుడిద్వారా తెలుసుకుని దరఖాస్తు చేశాను. 1978లో అలా ఒక కథలమాసపత్రిక నిర్వహణా బాధ్యత చేపట్టాను. మరో నవలా మాసపత్రికను చలసాని ప్రసాదరావుగారు చూసే వారు. ఇక తర్వాత 2006 వరకు కథ, నవలా మాసపత్రిక రెండిటి బాధ్యతలు నిర్వహించాను. మేగజైన్ జర్నలిజం, రిపోర్టింగ్ నాకిష్టమైన అంశాలు. కొంతకాలం పొలిటికల్ రిపోర్టింగ్, కల్చరల్ రిపోర్టింగ్ చేశాను.

### రేడియోతో అనుబంధం

1973లో ఎం.ఏ చదువుతుండగా రేడియోతో అనుబంధం ఏర్పడింది. అలా 2001 వరకు రేడియోలో క్యాజువల్‌గా చేశాను. నాటకాలలో కూడా వేస్తుండేదాన్ని. ఇక దూరదర్శన్‌లో ప్రయాగ నరసింహశాస్త్రిగారు పద్య నాటకంలో పాల్గొనే అవకాశాలిచ్చేవారు.

### నా రచనలు

నా మొత్తం సమయం నేను పనిచేసిన పత్రికకే కేటాయించాను. జబ్బుపుష్టిఉన్నా రాయలేకపోయాను. మారుపేర్లతో రాయడం నాకిష్టముండేది కాదు. రాసినంతవరకు విమర్శకుల మెప్పు, పాఠకుల ఆదరణ పొందాను.

'మనసున మనసై' సంపుటిలో కథలు ముని పల్లెరాజుగారు, మధురాంతకం రాజారాంగారు, కారా మాస్టారు, వాకాటి పాండురంగారావు వంటి వారి ప్రశంసలు పొందింది. 'జూకామల్లె' నా మరో కథలసంపుటి.


జంధ్యాల నుండి పురస్కారం అందుకుంటూ..


నటి భానుమతితో...

### కవిత్వం

కవిత్వం కూడా రాశాను. ఆ రోజుల్లో సుధామ, శాంతిస్వరూప్, వై.రామకృష్ణారావు, శాంతీ మేమంతా యువకవులం. యువకవి సమ్మేళనాల్లో కుందుర్తి, దాశరథివంటి పెద్దపెద్ద వారితో కలిసి కవిత్వం చదివేవాళ్ళం. ఒకసారి దసరాకి శివారెడ్డిగారి అధ్యక్షతన తెలంగాణా మాండలీకంలో కవిత్వం రాశాను. 'కమలమ్మ పెండ్లికి కారటు వచ్చింది. అయినా గానీ పోతలేను' అనే నా కవితను చాలా మంది మెచ్చుకున్నారు. నాకు మొదట్నించి డైరీలో చిన్నచిన్న కవితల్ని, చదివిన అంశాల్ని రాసు కోవడం అలవాటు. అలా రాసుకున్న కవితలన్నింటినీ 'వీక్షణం' అనే సంకలనంగా తెచ్చాను. స్పాంటెనియస్‌గా తట్టిన ఆలోచనల్ని కవితల రూపంలో రాసుకుంటాను. 'గమ్యం', 'వీక్షణం'. నా కవిత్వ సంకలనాలు. మరో కథల పుస్తకం రాబోతోంది. నా 'వీక్షణం' కవిత్వాన్ని గోవిందరాజుల రామకృష్ణారావుగారు 'Snapsmots' పేరుతో ఆంగ్లానువాదం చేశారు.

ఇప్పుడు నేనో ఫ్రీలాన్సింగ్ కాలమిస్టుని. ఏక కాలంలో మూడు కాలమ్స్ రాస్తున్నాను.

### నీ కథ చదివానొహో అనాలి

అప్పటి కథలకు నిడివి నిబంధనలేదు. చెప్ప దలుచుకున్నది పూర్తిగాచెప్పే స్వేచ్ఛ వారికుండేది. చిన్నకథల కాన్సెప్ట్ మొదలయ్యాక అందరికీ రాయాలన్న తాపత్రయం పెరిగింది. 'నా కథ చదవండి' అని వాట్సప్‌లో, ఫేస్‌బుక్‌లోచెప్పి చది వించుకునే తరం వచ్చేసింది. అలా కాకుండా 'నీ కథ చదివానొహో' అంటే బావుంటుంది. నలభై ఏళ్ళు పైబడిన వారే తెలుగు చదవకలుగుతున్నారు. రచయితలే పాఠకులైపోతున్నారు.

### కుటుంబం

మాకు ఒక అమ్మాయి, అబ్బాయి. బాగా చదువుకున్నారు. జీవితంలో స్థిరపడ్డారు. అమ్మని ఫ్రెండ్‌లా గౌరవిస్తారు, ప్రేమిస్తారు. సంప్రదాయం, సంస్కృతి వాళ్ళకందించాం. మా అబ్బాయి కవిత్వం రాస్తాడు. అమ్మాయి మంచి విమర్శకురాలు. నా కథలకు తొలి పాఠకురాలు.

**-సి.ఎస్.రాంబాబు, సెల్: 94904 01005**

